

# యువభారతి మీ అభిప్రాయాల్ని ఆహ్వానిస్తున్నది

యువభారతి 'లహరీ' ఉపన్యాస కార్యక్రమాలు, ప్రచురణలు 'నందిని' గూర్చి జనాభిప్రాయాన్ని సేకరించాలని మా సంకల్పం. క్రింది విషయాలపై విలువైన మీ సూచనలు తెలిపితే సంస్థ భవిష్యత్కార్యకలాపాలు తీర్చిదిద్దే ప్రయత్నంలో తాము సహకరించిన వారౌతారు.

* ఈ పుస్తకం చదివారుకదా! మీ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా వెంటనే మాకు తెలిపి, మా కృషిని ప్రోత్సహించండి.

* నందిని శీర్షికలు నచ్చాయా? బాగా నచ్చిన లేక నచ్చని శీర్షికలేవి? ఎందుచేత? ఇంకా ఏయే శీర్షికలు ప్రవేశపెడితే బాగుంటుంది? 'నందిని'ని అత్యుత్తమ సాహితీ పత్రికగా తీర్చిదిద్దేందుకు మీసలహాలు, సూచనలేమిటి?

* యువభారతి నిర్వహిస్తున్న 'లహరీ' ఉపన్యాస కార్యక్రమాలలో మీరెప్పుడైనా పాల్గొన్నారా? మీ అభిప్రాయమేమిటి? భవిష్యత్తులో 'లహరీ' ఉపన్యాస కార్యక్రమాలు ఎలా వుంటే బాగుంటాయని మీరనుకుంటున్నారు.

* యువభారతి ప్రచురణలో కొన్నింటినైనా మీరు చదివారా? మీకునచ్చిన లేక నచ్చని ప్రచురణలేవి? ఇంకా ఎలాంటివి ప్రచురిస్తే బాగుంటుంది?

* సంస్థ పథకాలు 'సాహితీమిత్ర', 'భారతీమిత్ర', 'భారతీభూషణ'లలో మీరు సభ్యులా? సంస్థప్రచురణలు మీకు అందుతున్నాయా?

యువభారతి ప్రచురణలను మీ మిత్రులకు పరిచయం చేయండి. యువభారతి ప్రచురణలను మీరు బహుమానాలుగా ఇవ్వండి. మీకు పరిచయమున్న పాఠశాలలచే కొనిపించండి. మీ పరపతిని వినియోగించి "నందిని"లో వ్యాపార ప్రకటనలు ఇప్పించండి.

చుట్టూరా ఆవరించుకుని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కన్న ప్రయత్నించి చిన్న దీపాన్నయినా వెలిగించాలనేదే యువభారతి ధ్యేయం.

దూరప్రాంతాల మిత్రులు, హైదరాబాదు వచ్చినప్పుడు తిలక్ రోడ్‌లోని ఆంధ్రసారస్వత పరిషత్ భవనంలోని మన కార్యాలయానికి విచ్చేయండని ఆహ్వానిస్తున్నాం.

మీ సహకారాన్ని అర్థిస్తూ — యువభారతి

# ఆలోచనా లహరి

సాహితీ విమర్శకులు

కట్టమంచి రామలింగారెడ్డి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ,
కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులు,
గిడుగు రామమూర్తి పంతులు, ముట్నూరి కృష్ణారావు
విశ్వనాథ సత్యనారాయణ గారల
సాహితీ వ్యక్తిత్వాల మణిదర్పణం

ప్రసిద్ధాంధ్ర సాహిత్యాచార్యులు

డా॥ చల్లా రాధాకృష్ణశర్మ, శ్రీ గౌరిపెద్ది రామసుబ్బ శర్మ,
ఆచార్య బి. రామరాజు, డా॥అక్కిరాజు రమాపతిరావు 'మంజుశ్రీ'
డా॥ ముదిగొండ శివప్రసాద్, డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం గారల

ఉపన్యాసమంజరి




రిజిస్టర్ నెం : 1/64

ప్రచురణ

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

**ALOCHANA LAHARI**

**A Collection of Lectures on Literary Critics :**

C. R. Reddy, Rallapalli Anantakrishna Sharma,
Komarraju Venkata Lakshmana Rao Pantulu,
Gidugu Ramamurthy Pantulu, Mutnuri Krishna Rao, and
Viswanadha Satyanarayana

By

Dr. Challa Radhakrishna Sarma, Sri Gouripeddi Rama Subba Sarma, Prof.B.Rama Raju, Dr.Akkiraju Ramapathi Rao(Manjusri) Dr.Mudigonda Sivaprasad, and Dr. G.V.Subrahmanyam.



ప్రచురణ : 71

ప్రథమ ముద్రణ : 2,200 ప్రతులు
డిసెంబరు 14, 1980

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ : జ్యోతి ప్రెస్, హైదరాబాదు - 500 380.

ముఖచిత్ర ముద్రణ : గీతా ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాద్ - 500 003

లేదా

యువభారతి కార్యాలయం-ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

వెల : రూ. **16-00**

ప్రచురణ పూర్వవిరాళం రూ.10-00ఇచ్చిన సాహితీప్రియులకుఅందజేయబడింది

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆర్థిక సహాయమున ముద్రింపబడినది.




# యువ భారతి పరిచయము

మనిషిలో అతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మకశక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి గడచిన పదిహేడేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణకార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 70 ప్రచురణలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించపూనుకున్నది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే-యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 7,000 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వపథకాలలో భారతీమిత్రులుగా దాదాపు 725 మంది, భారతీభూషణులుగా 70 మంది చేరారు.

ఉడుతాభక్తితో మేముచేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతాసౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాదు. *ఇరివెంటి కృష్ణమూర్తి*

14-12-1980 అధ్యక్షుడు : యువభారతి

# మా గురించి...



అధ్యయనం పట్ల ఆసక్తిని పెంచేది విమర్శనం. రచయితకూ పాఠకునికీ మధ్య సేతువు విమర్శకుడు. సృజనాత్మక సాహిత్యం ప్రసరించడానికి విమర్శ తోడ్పడుతుంది. కవి అందరి హృదయాలలోకి పోగలగితే కవి హృదయంలోకి పోగలిగేవాడు విమర్శకుడు. ఆ విమర్శ ఎంత ఆత్మీయంగా ఎంత సహేతుకంగా ఎంత అభినివేశసంపద్యుక్తంగా ఎంత బహుముఖ ప్రజ్ఞా సమన్వితంగా ఉంటే సృజనాత్మక సాహిత్యం అంత రసాత్మకంగా అంత సమంజసంగా అంత సహృదయవేద్యంగా అంత ఆనందప్రదంగా అంత సందేశగర్భితంగా వెలువడడానికి అవకాశం ఏర్పడుతుంది.

తెలుగు సాహిత్యంలో విమర్శప్రక్రియ ఇప్పుడు బాగా పుంజుకుంటున్నది. బహుముఖాలుగా విస్తరిల్లుతున్నది. శాస్త్రీయ సమాలోచన పరిధిలోకి ప్రవేశిస్తున్నది..

యువభారతి తెలుగులో ప్రసిద్ధులైన విమర్శకులను ఆరుగురిని ఎన్నిక చేసికొని, వారు నిన్నటి తరాన్ని ఏ విధంగా ఉద్దీప్తం చేసినారో, మరి నేటి తరానికి ఏ విధంగా మార్గదర్శకులవుతున్నారో పర్యాలోచన చేయించే ప్రయత్నం చేసింది. ఈ పదిహేడవ వార్షికోత్సవ సందర్భంగా.

గతానుగతికమైన విమర్శనపథానికి కొత్తమలుపును ప్రసాదించినారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు. అరుదైన అందమైన వచనరచనకు శ్రీకారం చుట్టి అనంతశేముషీవైభవంతో నిష్పక్షపాతంగా నిర్మొహమాటంగా సత్యాన్ని మధురంగా ప్రతిపాదించిన విమర్శకులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ గారు. తెలుగు ప్రజలకు విజ్ఞాన సర్వస్వాన్ని అందించాలని ఉద్యమించిన భాషాసేవకులు బహుభాషావేత్తలు చరిత్రపరిశోధకులు ఉత్తమ సాహిత్య విమర్శకులు శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు. కాలానుగుణ్యమైన భావ ప్రకటనా సౌలభ్యాన్ని కోల్పోయి ఎన్నడో వ్రాసిన వ్యాకరణానికి కట్టుపడిపోయిన తెలుగు భాషను సముద్ధరించి వ్యావహారిక భాషోద్యమాన్ని నిర్వహించి తెలుగుభాషకు విస్తృతి కలిగించిన మహనీయులు సద్విమర్శకులు శ్రీ గిడుగు రామ్మూర్తి పంతులుగారు. తెలుగు పత్రికా రచనను శక్తిమంతం చేసిన మనీషి, సాహిత్య తపస్వి శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు. కవితారచనలో మహోన్నత ప్రమాణా లందుకొని, అన్ని సాహిత్య ప్రక్రియలను సమర్థవంతంగానిర్వహించి, భారతీయ

సాహిత్యశాస్త్రప్రమాణాల వెలుగులో తెలుగు సాహిత్యాన్ని సమాలోచించిన ఉత్తమ విమర్శకులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు.

ఈ మహనీయులను గూర్చి మా యువభారతి పదిహేడవ వార్షికోత్సవ సందర్భంగా ఏర్పాటుచేసిన "ఆలోచనాలహరి" ఉపన్యాసమంజరి కార్యక్రమంలో ఉపన్యసించి వ్యాసాలుగా అందించి, తమ సాహిత్యప్రణయాన్ని, భాషాభిమానాన్నీ ప్రదర్శించిన విద్వాంసులు డా॥ చల్లా రాధాకృష్ణశర్మగారు, శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు, ఆచార్య బిరుదురాజు రామరాజుగారు, డా॥అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ) గారు, డా॥ముదిగొండ శివప్రసాదుగారు, డా॥జి.వి. సుబ్రహ్మణ్యం గారు. యువభారతి, వీరికి హార్దికధన్యవాదాలను అభివందనాలను సమర్పించుకుంటున్నది.

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షులు : యువభారతి

# యువభారతి 17 వ వార్షికోత్సవము

# ఆలోచనా లహరి

# ఉపన్యాసమంజరి

సమయం : సాయంకాలం 6-00 గం॥ లకు
స్థలం : ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

ప్రథమ సమావేశం : డిసెంబరు 12, శుక్రవారం
ప్రారంభకులు : శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు
అధ్యక్షులు "సూర్యుడు కూడా ఉదయిస్తాడు" కవితాసంకలనం.
ముఖ్య అతిథులు : శ్రీ టి. ఎస్. ఆర్. నరసింహంగారు
"*వేగుచుక్కలు*" ఆవిష్కరణ : శ్రీ జి. ఎల్. సంఘి
కట్టమంచి రామలింగారెడ్డిగారిని గూర్చి ఉపన్యాసం :
వక్త : డా॥ చల్లా రాధాకృష్ణశర్మగారు
రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిని గూర్చి ఉపన్యాసం :
వక్త : శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు

ద్వితీయ సమావేశం : డిసెంబరు 13, శనివారం
అధ్యక్షులు : శ్రీ కె. వి. భాస్కరరావుగారు
ముఖ్య అతిథులు : శ్రీ కె. పున్నయ్యగారు
కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారిని గూర్చి ఉపన్యాసం :
వక్త : ఆచార్య బి. రామరాజుగారు
గిడుగు రామ్మూర్తి పంతులుగారి గూర్చి ఉపన్యాసం :
వక్త : అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ) గారు

తృతీయ సమావేశం : డిసెంబరు 14, ఆదివారం
అధ్యక్షులు : ఆచార్య సి. నారాయణరెడ్డిగారు
ముఖ్య అతిథులు, 'ఆలోచనాలహరి' ఆవిష్కర్తలు :
గౌరవనీయులు పరకాల శేషావతారంగారు
'మన పురాణ సంకేతాలు', 'మరో జంఘాలశాస్త్రి' గ్రంథావిష్కర్తలు :
కళాప్రపూర్ణ శ్రీ రావూరి వేంకటసత్యనారాయణరావుగారు
ముట్నూరి కృష్ణారావుగారిని గూర్చి ఉపన్యాసం :
వక్త : డా॥ ముదిగొండ శివప్రసాద్‌గారు
విశ్వనాథ సత్యనారాయణగారినిగూర్చి ఉపన్యాసం :
వక్త : డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు



# ప్రేరణ

సహృదయులకు, సాహితీ మిత్రులకు నమస్సులు. రెండు సంవత్సరాల తరవాత మిమ్మల్ని మళ్ళీ పలుకరించే భాగ్యం లభించినందుకు ఆనందంగా ఉంది. అయితే వెలుగువెనుక చీకటి, సంతోషం వెనుక దుఃఖం ఎప్పుడూ పొంచి ఉంటాయి. అందుకే అమితమైన ఆనందం వచ్చినా, దుఃఖం వచ్చినా కళ్లనీళ్లు రావడం చూస్తుంటాం. అలాగే ఈ ఆనందం వెనుక, ఈ ఉత్సాహం వెనుక ఈ ఉత్సవం వెనుక గత రెండేళ్ళుగా మేము అనుభవించిన కష్టాలు, కన్నీళ్ళు దాగి ఉన్నాయి. వాటిని మీ వంటి సహృదయులతో చెప్పుకుని మా హృదయాలను తేలిక పరచుకోవాలని మా ప్రయత్నం. మీతోకాక పోతే మరెవరితో చెప్పుకోవాలి చెప్పండి?

1971 లో మొట్టమొదటి సారిగా 'కావ్యలహరి' ఉపన్యాస మంజరీ కార్యక్రమాన్ని ఏర్పాటుచేసి, ఉగాది పచ్చడిరుచి చూశాం. బాగున్నాయని, చక్కగా నిర్వహించామని పొగడినవాళ్లు, పాత చింతకాయ పచ్చడికి కొత్తపోపు వేశామని, దేశాన్ని వెనక్కి నడిపిస్తున్నామని తెగడిన వాళ్ళూ కూడా మాకు తారసిల్లారు. అయినా ఆ పొగడ్తలకి పొంగిపోలేదు. ఈ తెగడ్తలకి కృంగిపోలేదు. ఆ పూలని ఈ రాళ్లని కూడా సమానంగానే స్వీకరించాం.

ఒకవైపు ప్రబంధాలమీద, తిక్కన,పాల్కురికి, సోమనాథుడు, శ్రీకృష్ణదేవరాయలు, నన్నయ, పోతన, పింగళిసూరన, నాచనసోమన, పిల్లలమర్రి పినవీరభద్రుడు వంటి ప్రాచీన కవుల సాహిత్య వ్యక్తిత్వాలను ఉపన్యాల ద్వారా కవితా వైభవాల ద్వారా సామాన్య పాఠకుని కందిస్తూనే, మరోవైపు ఆధునిక కవులు వేమన, గురజాడ, కందుకూరి, తిరుపతి వేంకటకవులు, విశ్వనాథ, శ్రీశ్రీ జాషువా, దేవులపల్లి కృష్ణశాస్త్రి. దాశరథి, రాయప్రోలు, నండూరి, నాయని, ఆరుద్ర, కుందుర్తి, నారాయణరెడ్డి గారల సాహిత్య వ్యక్తిత్వాలను సమీక్షించాం.

'ప్రతిభాలహరి'లో విశ్వనాథ' శ్రీశ్రీ లను గూర్చి ఒకే వేదికమీద ఉపన్యాసాలని ఏర్పాటుచేసినప్పుడు ఇరువర్గాలవారూ ఆశ్చర్యపోయారు. మరి వీరిది ఏ వర్గం అయి ఉంటుందా? ఏ 'ఇజం' అయిఉంటుందా? అని మెదళ్లు చించుకున్నారు. వారికప్పుడు తెలిసింది వీరికి ఇజాలతో పనిలేదు నిజాలతోనే పని అని. వారిది ఒంటికంటి చూపుకాదు. విశాలమైన దృక్పథం అని. వీరికి సాహిత్యానికి అడ్డుగోడలులేవని. వీరు రంగుటద్దాలు ధరించరని.

సాహిత్యోద్యమాలు నదుల్లాంటివి. నదులలాగే వాటికి దుడుకుతనం. మార్గం, మలుపు, వేగం, వరద ఉంటాయి. ఉద్యమాల ఊపులో ఒక్కొక్కసారి ఉద్యమ నిర్వాహకులు కూడా ఉద్యమాలకు నేతృత్వం వహించడానికి బదులు అప్పటి ఒత్తిడులకు లొంగి ప్రవాహంలో కొట్టుకుపోతుంటారు.

సామాన్యపాఠకుడికి, సాహిత్యాభిరుచి కలిగిన రసహృదయుడికి ఒక్కొక్కసారి ఈ ఉద్యమాలు అంతుపట్టవు. ఉద్యమం ముగిసిన కొంతకాలానికిగాని ఉద్యమంవలన లాభనష్టాలు తెలిసిరావు.

అటువంటి సాహిత్యోద్యమాలను అనుశీలించి వాటిలోని మంచిని గ్రహించవలసిన అవసరం ఎంతైనాఉంది. ఆ మంచిని పదిలపరచుకుని, పెంపొందించుకునేందుకు, ఉజ్జ్వల భవిష్యత్తుకు కావలసిన పునాదులను నిర్మించుకునేందుకు సాహిత్యావలోకనం అవసరం అవుతుంది. ఆ కృషిలో భాగంగా 'యువభారతి' తన వంతు బాధ్యతను ఉడుతాభక్తిగా నిర్వహిస్తున్నారు.

'నవోదయలహరి' కార్యక్రమం హార్దిక విజయాన్ని సాధించింది కాని ఆర్థికవిజయాన్ని సాధించలేకపోయింది. ఫలితంగా వరుసగా రెండు సంవత్సరాలు ఉపన్యాస కార్యక్రమాల్ని ఏర్పాటు చేయలేని ఆర్థిక దుస్థితి సంస్థని ఆవరించింది. ఈ సంవత్సరం 'ఆలోచనాలహరి'లో ఆర్గురు సుప్రసిద్ధ విమర్శకులు భాషావేత్తలను ఎన్ను' న్నాం. పెద్దఎత్తున సమావేశాలను ఏర్పాటుచేశాం. కేవలం సమావేశాల నిర్వహణకే దాదాపు రూ॥ 5000/- అవసరం అవుతాయి. ఇక పుస్తక ప్రచురణని కలుపుకుంటే దాదాపు రూ॥ 25,000/- అవసరం అవుతాయి. కాని ఇంతవరకూ వచ్చిన ప్రచురణ పూర్వ విరాళాల మొత్తం ఏమంత ఆసక్తిదాయకంగా లేదు.

లెక్కకి 7,000 మంది సాహితీమిత్రులున్నా, క్రమం తప్పకుండా సభ్యత్వాన్ని చెల్లిస్తూ సాహితీమిత్రులుగా కొనసాగుతున్న వారి సంఖ్య 1,000 మందికి మించిలేదేమో!.

అనంతమయిన సాహిత్యసాగరాన్ని మథించి సుధారసాన్ని తెలుగు పాఠకలోకానికందించాలనే ధ్యేయంతో మేము 'విజయదశమి' నాడు వెలువరించిన సాహిత్య త్రైమాసపత్రిక 'నందిని' కనీసం వెయ్యి ఇళ్లను చేరుకోలేకపోయింది.

వేలాది తెలుగు ఇళ్లకు చేరుకోవలసిన యువభారతి ప్రచురణలు తెలుగు చూడక యువభారతి కార్యాలయంలోనే ఇంకా మగ్గిపోతున్నాయి.

వీలయినంత తక్కువ వెలకు వీలయినంత ఎక్కువ మందికి మంచి పుస్తకాలందించాలన్నది మా ఆశయం. కాని దీనిని కొద్దిగా మార్చుకుని వీలయినంత ఎక్కువ ధరకు వీలయినంత తక్కువమందికి మంచి పుస్తకాలను అందించేస్థితి వస్తోంది. నానాటికీ పెరిగిపోతున్న ధరలు, తరుగుతున్న వనరులు మమ్మల్ని మరింత ఇరకాటంలో పెడుతున్నాయి.

సిటీబస్సులో టికెట్టు లేకుండా ఫుట్‌బోర్డుమీద ప్రయాణం చేస్తున్న వారి టిక్కెట్టెవడు కొంటున్నట్లు? నిజాయితీగా టికెట్టు కొనుక్కొని ప్రయాణం చేస్తున్నవాడు. పన్నులెగవేసే వారి పన్నెవరు చెల్లిస్తున్నట్లు? నిజాయతీగా పన్ను చెల్లించేవాడు. అలాగే పుస్తకాన్ని కొననివాళ్ళ భారాన్ని పుస్తకాన్ని కొని చదివే అలవాటున్న మీరు మోయవలసి రావచ్చు. అందుకై ఇకపై మా ప్రచురణకు మీరు అధికధరలు చెల్లించవలసిరావచ్చు. ఇది మీ సంస్థ. దీనిని నిలబెట్టుకోవడం మీ ధర్మం. ఈ జ్యోతిని వెలగించింది మేమే అయినా మీ స్నేహాన్ని అందించి ఈ చిరు దివ్వెను కాపాడుకొమ్మని అభ్యర్థిస్తున్నాం.

మా ఆహ్వానాన్నిమన్నించి మా సభలకు విచ్చేసి జయప్రదం చేసినందుకు మా కృతజ్ఞతలు. పండుగలో పాలు పంచుకోడానికి ఆహ్వానం అవసరం కానీ కష్టాలను, కన్నీళ్లను పంచుకోడానికి ఆహ్వానం అవసరం లేదు కదా ! పిలవకుండానే వెళ్ళి సహాయం చేయవలసిన సమయం అది. ప్రస్తుతం ఉన్న ఇబ్బందుల నధిగమించి యువభారతిని మరింత పటిష్టం చేసేందుకు మీ సంపూర్ణ సహకారాన్ని మనసారా అర్థిస్తున్నాం.

సంవత్సరానికి కనీసం రూ.10/- యిచ్చేందుకు లేదా యిప్పించేందుకు సిద్ధపడిన వ్యక్తులు కనీసం 10,000 మంది లభించిన రోజున యువభారతి కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నిర్విఘ్నంగా, నిరాటంకంగా సాగిపోతాయి. యిందుకు మీరు చెయ్యగలిగింది ఎంతైనా ఉంది.

మా 'యువభారతి' ప్రచురణలను మిత్రులకు పరిచయం చేయండి. వారిచేత కొనిపించండి.వారిని సాహితీమిత్ర/భారతీమిత్ర/భారతీభూషణ సభ్యత్వ పథకాలలో సభ్యులుగా చేర్పించండి.

మీరు వ్యాపారంలో ఉంటే మీ వ్యాపార ప్రకటనలను మా 'నందిని' లో ఇవ్వండి. మీకు తెలిసిన మిత్రులచేత ఇప్పించండి.

'నందిని' చందా దారులుగా మీరు చేరండి. మీ మిత్రులను చేర్పించండి.

ఇది యువభారతి 17 వ వార్షికోత్సవం. అంటే బాలారిష్టాల నధిగమించిన నిండు జవ్వని ఈనాటి యువభారతి సాహిత్య సంస్థ పుట్టినరోజు జరుపుకోటంకష్టం. తెలుగు సాహిత్య సంస్థ పుట్టినరోజు జరుపుకోవడం మరీ కష్టం. 16 సంవత్సరాలు నిండి 17 వ శరత్తులో అడుగిడిన 'యువభారతి' మీవంటి సాహిత్యప్రియుల ఆదరాభిమానాలతో కలకాలం వర్థిల్లాలని మా ఆకాంక్ష.

శుభాకాంక్షలతో

భవదీయుడు

అయల సోమయాజుల నాగేశ్వరరావు

కార్యదర్శి, యువభారతి.




# ఎందరో మహానుభావులు

* 'ఆలోచనాలహరి' కార్యక్రమ రూపకల్పనలో సలహాలనందించి దీవించిన యువభారతి గౌరవసభ్యులు సర్వశ్రీ దేవులపల్లి రామానుజరావు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆచార్య సి. నారాయణరెడ్డి, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారలు
* 'ఆలోచనాలహరి' ఉపన్యాసమంజరి సమావేశాలకు దక్షతతో అధ్యక్షత వహించి సభలను జయప్రదంగా నిర్వహించిన పెద్దలు డా॥ దాశరథిగారు, కె. వి. భాస్కరరావుగారు, ఆచార్య సి. నారాయణరెడ్డిగారలు
* 'ఆలోచనాలహరి' ఉపన్యాస సభలలో ముఖ్య అతిధులుగా పాల్గొని తమ ఆశీస్సులందించిన సౌజన్యమూర్తులు శ్రీయుతులు టి. ఎస్. ఆర్. నరసింహం గారు కె. పున్నయ్యగారు, గౌరవనీయులు పరకాల శేషావతారంగారలు.
* 'ఆలోచనాలహరి' ఉపన్యాస పరంపరను ఆరంభించి ఆశీర్వదించిన మాన్యులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు
* 'ఆలోచనాలహరి'ని ఆవిష్కరించి ఆశీస్సులందించిన ఆంధ్రప్రదేశ్ రవాణా శాఖామాత్యులు గౌరవనీయులు పరకాల శేషావతారంగారు "సూర్యుడుమళ్ళీ ఉదయిస్తాడు" గ్రంథాన్ని ఆవిష్కరించిన డా॥ దాశరధిగారు "మన పురాణ సంకేతాలు" 'మరోజంఘాలశాస్త్రి' గ్రంథాల నావిష్కరించిన డా॥ రావూరి వెంకట సత్యనారాయణరావుగారు
* 'ఆలోచనాలహరి' ఉపన్యాసాల నివ్వటమే కాక వ్యాసాలను కూడా సమర్పించి ఈ గ్రంథానికి రూపుకల్పించిన సాహిత్యాచార్యులు శ్రీయుతులు డా॥ చల్లా రాధాకృష్ణశర్మగారు, శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు, ఆచార్య బి. రామరాజు గారు, డా॥ అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ), డా॥ ముదిగొండ శివప్రసాద్, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారలు
* మా "సాహితీ వాహిని" పరంపరలో 'మనపురాణ సంకేతాలు' రచించిన సహృదయులు డా॥ ముదిగొండ శివప్రసాద్‌గారు
* చదువుమీద ఆసక్తి కలిగించే కథలపుస్తకం "వేగుచుక్కలు"ను తమ అశోకుమార్ సంఘి చారిటబుల్ ట్రస్ట్ ఆర్థిక సహాయంతో వెలువరించడానికి పూనుకున్న వదాన్యులు శ్రీ జి. యల్. సంఘిగారు
* యువభారతి ప్రచురణ ముఖ చిత్రాలను, అక్షరాలంకారాలను సంతరించిన చిత్రకారులు శ్రీ శీలావీర్రాజుగారు

* ప్రచురణకు ముఖ్యావసరమైన తెల్లకాగితాన్ని అందించటంలో సహకరించిన రాజ్యలక్ష్మి పేపర్ మార్ట్‌వారు

* యువభారతి కార్యక్రమాలను ఇతోధికంగా లోకానికి తెలియచెప్పిన పాత్రికేయులు, సాహిత్యశీలురు

* యువభారతి "ఆలోచనాలహరి" ప్రచురణను తమదిగా స్వీకరించి ముద్రించిన ముద్రాపకులు జ్యోతి ప్రింటర్స్, ఇతర పుస్తకాలను అందంగా ముద్రించిన పద్మావతీ ప్రింటర్స్, మురళీ పవర్‌ప్రెస్, నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్ ముఖముద్రాపకులు గీతా ఆర్ట్ ప్రింటర్స్

* బ్లాకుల తయారీ శిల్పులు ఇండియా బ్లాక్‌మేకర్స్, మోహన్ ప్రోసెస్,

* యువభారతి కార్యక్రమాల ప్రధానరంగం ఆంధ్రసారస్వతపరిషత్తు. అక్కడ సభలు, సమావేశాలు జరుపుకోవటానికి దయతో అనుమతించినవారు, అందునా పేర్కొనదగిన పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, కార్యాలయ నిర్వాహకులు శ్రీహరికిషన్‌రావుగారు

* యువభారతి నెలసరి కార్యక్రమాల రంగం శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషా ని. యం, అనుమతించినవారు నిలయపాలకవర్గం వారు; విశేషించి తత్కార్యదర్శి శ్రీ యం. యల్. నరసింహారావులగారు

* సభకు ఆసనాలంకారం సమకూర్చేవారు యూసఫ్ అండ్ కంపెనీవారు విద్యుద్దీపాలంకరణ కర్తలు—హనుమాన్ ఎలక్ట్రికల్స్ వారు.

* మా ప్రచురణల కొనుగోలులో ఇతోధికంగా ప్రోత్సాహాన్నిస్తున్నవారు రాజా రామమోహన్‌రాయ్ గ్రంథాలయ ఫౌండేషన్‌వారు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంథాలయశాఖ డైరెక్టరుగారు, జిల్లా గ్రంథాలయాధికారులు

* మా సాహిత్య కార్యక్రమాలన్నింటికీ వేలసంఖ్యలో వచ్చి యువభారతి సాహిత్యోద్యమాన్ని సాదరంగా ప్రోత్సహిస్తున్న సాహిత్య స్నేహమూర్తులు సహృదయులైన తెలుగువారు

* యువభారతి చైతన్యం "యువభారతీయుల" సమైక్యకృషి, సమష్టిచైతన్యం సాహితీ ఉద్యమంలో కష్ట నిష్ఠూరాలకు ఓర్చి రాత్రింబగళ్లు శ్రమిస్తూ అండదండలుగా ఉన్నవారు యువభారతి సభ్యులు, సాహితీమిత్రులు, భారతీమిత్రులు, భారతీభూషణులు

* ఎదురుగా కనపడేది ఇందరు. కనుమరుగున ఉండి ఈ సంస్థను దీవించేది ఎందరో.

అందరూ మహానుభావులే ! అందరికీ వందనములు !!

అయల సోమయాజుల నాగేశ్వరరావు
కార్యదర్శి, యువభారతి.

## అందరికీ మా వందనములు

# ఆలోచనా లహరి

## అనుక్రమణిక



"చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది"





# ప్రస్తావన

"**A Poetry that does not prompt or demand comment is in its nature trivial**" అన్నాడు జార్జివాట్‌సన్. విమర్శకుడు కావ్యాస్వాదనకు వివేకంతో వెలుగుబాటను చూపుతాడు. సాహిత్యం విమర్శతో సమున్మేషిస్తుంది. ఆలోచనామృతంగా అవతరిస్తుంది. ఆలోచనాలహరి విమర్శక వ్యక్తిత్వాల కర్పిస్తున్న అక్షరనీరాజనం.

యువభారతివారి లహరి ప్రచురణలకు ఒక ప్రత్యేకత ఉంది. ప్రతి పది సంవత్సరాల కొకసారి ప్రాచీనాధునిక సాహితీ మూర్తులను పునస్సమీక్ష చేయటం అవసరం. అనుదినం అధ్యయనం అనంతంగా సాగుతున్న సాహిత్యక్షేత్రంలో అభ్యుదయం అడుగుముందుకు వేసిన కొద్దీ అభినవంగా నూత్న దృక్పథాలూ, సిద్ధాంతాలూ, సమన్వయాలూ వెలువడుతుండటం సహజం. క్రొత్త వాతావరణంలో పాతను బేరీజు వేయాలి. కాలం చెప్పిన పాఠాలతో గతాన్ని సమీక్షించాలి. ముందుకు నడిచే వర్తమానానికి గతం ఎంతవరకు పనికివస్తుందని పర్యాలోచించాలి. పనికిరాకపోతే పరిత్యజించవచ్చు. పురోగతికి పనికివస్తే పునరాలోచించవచ్చు. ఈ దృక్పథంలో యువభారతి ప్రసిద్ధాంధ్ర కవుల సాహిత్య వ్యక్తిత్వాలను ఇంతవరకూ సమీక్షించి లహరి ప్రచురణలుగా ఆంధ్రావళి కందించింది.

సాహిత్యమంటే కవిత్వమొక్కటేకాదు. కవిత్వం చేయలేని పనులెన్నో మిగిలిన సాహిత్య ప్రక్రియలు సాధిస్తున్నాయి. ఆధునికయుగంలో కానీ, ఆయా ప్రక్రియల పరిణామ దశావిశేషాలను వివేచించి ఆయా రంగాల్లో కృషిచేసిన మనీషులను స్మరించి, వారి సాహితీ వ్యక్తిత్వాలను సమీక్షించుకోవలసిన అవసరం ఏర్పడటం సహజం. ఈ రంగంలో తగినంత కృషి యింకా జరగలేదనిపిస్తుంది. ఉదాహరణకు ఆంధ్రసాహిత్య విమర్శను తీసుకొంటే సాహిత్య చరిత్రలో వారి పాత్రలు క్రీనీడల్లా మసకబారి కనబడతాయేకాని, వారాయా కాలాల్లో సాగించిన ఉద్యమాల స్వరూపంగాని, వారి ప్రత్యేక ప్రతిపత్తులనుగాని పరిశీలించి విలువకట్టడం విశేషంగా జరుగలేదు. యువభారతి ఈ లహరిని ఆ ప్రయత్నాని కంకితం చేసింది. అయితే ఎందరో మహానుభావులున్నారు. అందరినీ ఒకేసారి అనుశీలించడం అసాధ్యం. అందువల్ల వివిధశాఖల్లో శిఖరప్రాయుల్లా ఉండి, వాటికి ప్రాతినిధ్యం వహించే ప్రతిభామూర్తులను ఆరుగురిని గురించి సమాలోచించే యత్నం ఈ గ్రంథంలో పొందుపరచ బడింది.

ఆధునిక సాహిత్య విమర్శకు యుగపురుషుడుగా ప్రసిద్ధిచెంది అనుశీలన విమర్శ ప్రస్థానానికి ఆచార్యస్థానంగా నిలచిన డా॥ కట్టమంచివారు ఈ వరుసలో అగ్రగణ్యులు కావటం సముచితం. ఆయన తరువాత సాహిత్య శిల్పానుశీలన ప్రస్థానానికి రూపురేఖలు దిద్ది, ప్రాచ్య ప్రాశ్చాత్య లక్షణ సమన్వయ దృక్పథంలో, ప్రతి ప్రక్రియకూ ప్రత్యేక ప్రతిపత్తిని భావించి ప్రతిభావంతమైన విమర్శను సాగించిన విశ్వనాథను ఎన్నికచేయటం ఔచిత్యవంతంగా ఉంది. పత్రికా రచనకు ప్రామాణ్యాన్ని కల్పించి కావ్యార్థాలకు పరమార్థాన్ని సాధించి తత్త్వ సౌందర్యాన్ని సాహిత్య నందనంలో సంవాసింపజేసిన ముట్నూరి కృష్ణారావు గారిని సంభావించటం సవ్యంగా ఉంది. సంగీత సాహిత్య సారాన్ని సరస వివేచనంతో మృదుమధురఫణితియందు జాలువార్చి విమర్శకు మోహన వంశీరాగాన్ని సదరించిన రాళ్ళపల్లివారి సాహితీ వ్యక్తిత్వాన్ని సమ్మానించటం సమాదరణీయంగా ఉంది. తెలుగులో భాషాపరంగా విప్లవరూపమైన ఉద్యమాన్ని సాగించటమే కాకుపడా ఆధునిక సాహిత్యప్రక్రియలన్నీ ఉపజీవించే వ్యావహారిక భాషా సౌలభ్యాన్ని కలిగించి, ఆ రంగంలో సృజనాత్మక విమర్శ మార్గాన్ని ఆవిష్కరించిన గిడుగు రామ్మూర్తి పంతులుగారిని స్మరించడం కీర్తింపదగిన అంశం. పరిశోధన విమర్శకు పెద్దపీట. దానికి పరిణతిప్రాగల్భ్యాలను కలిగించటమే కాకుండా విజ్ఞానసర్వస్వ రచనకు, చారిత్రకాధ్యయన శీలానికి వెలుగుబాటలు వేసిన కొమర్రాజువారిని గూర్చి సమాలోచించటం సమంజసమౌతున్నది. ఇది షడ్రుచులతో కూడుకొన్న సాహిత్య సమారాధనం.

నవ్యసాహిత్యయుగోదయంనుండి తెలుగులో వివిధ ప్రయోగాలు సాగాయి కవిత్వంతోపాటు విమర్శకూడా పరిణామం చెందింది. గిడుగువారి భాషోద్యమం జనవాక్యానికి ప్రామాణికత్వం ప్రసాదించింది. సాహిత్య విమర్శ అంతా ఒక యెత్తు వారి ఉద్యమం మరోయెత్తు. సృజనాత్మక సాహిత్య విమర్శ వెలయటానికి పూర్వం గ్రంథపరిష్కార విమర్శ, కవుల చరిత్ర నిర్మాణం, చారిత్రకాంశ పరిశీలనం, నిఘంటు నిర్మాణం, విజ్ఞానసర్వస్వ నిర్మాణం, లక్షణ విమర్శప్రస్థానం మొదలైన ఉద్యమాలు సజీవ విమర్శకు పూర్వరంగాన్ని సిద్ధంచేశాయి. ఆ యుగానికి ప్రతినిధిగా కొమర్రాజు కొండకొమ్మలాగా కనపడుతున్నాడు.

కట్టమంచి కవిత్వ తత్త్వ విచారం జడమైన సాహిత్య విమర్శకు చైతన్యం కలిగించి క్రొత్తదారులు చూపించింది. పాశ్చాత్య ప్రమాణాలతో కావ్యానుశీలనం చేసే క్రాంత దృష్టిని ప్రసాదించింది. విమర్శలో ప్రగతి అప్పటినుండే సాగింది. ఎన్నో యుగాలు సాహిత్య జగత్తులో ప్రవర్తిల్లాయి. కావ్యానుశీలన యుగకర్తగా కట్టమంచివారు నిలిచారు. ఆయన ప్రమాణాలతో ఆత్మాశ్రయ రీతులు ప్రసరించటంచేత వారి విమర్శ ప్రస్థానాన్ని గౌరవించినా, పద్ధతిలో మార్పులు తెచ్చారు తరువాతివారు. అట్టి మార్పులో శిల్పానుశీల ప్రస్థానం ఒకటి. దానికి విశ్వనాథ

వెలుగు నింపాడు. తత్త్వానుశీలన ప్రస్థానానికి ముట్నూరు వారు ముగ్గు పోశారు. మధురశైలీవిన్యాస ప్రస్థానానికి రాళ్లపల్లివారు రంగవల్లులు తీర్చారు. ఇంతటితో ఆగలేదు ఆ ప్రగతి. ప్రయోగయుగానికి శ్రీశ్రీ పాదులు త్రవ్వాడు– ఆ వెంటనే కొంతకాలం జంటగా సాంఘికవిమర్శ, మానసిక తత్త్వ విమర్శ, మార్క్సిస్టు దృక్పథ విమర్శ ముందుకు సాగాయి. విశ్వవిద్యాలయాలు సమన్వయాత్మక పరిశోధన ప్రవృత్తికి ప్రాతిపదికలువేసి ప్రస్థానం సాగిస్తున్నాయి. సాహితీ పత్రికలు నేడు సమీక్షాయుగాన్ని ప్రవర్తిల్ల చేస్తున్నాయి. నేటి సాహిత్యంలో పరిశోధనకు పరుపుకుర్చీలూ, సాహిత్యసమీక్షకు సాదా కుర్చీలు దొరుకుతున్నాయి. విమర్శ సామాన్యప్రజల నందుకోవాలని ప్రయత్నం చేస్తున్నది. ప్రమాణాల కంటె, పరిమాణాలకంటె ప్రజా చైతన్యాన్ని ప్రతిబింబించుకోవాలని యత్నిస్తున్నది. అయినా, దానికి సహజంగా ఉండవలసిన దర్శనశక్తి క్రమంగా తగ్గిపోవటంచేత ప్రజలుకూడా దాన్ని ప్రామాణికదృష్టితో గౌరవించటం లేదు. ఈనాడు ఉపన్యాసాలపై నున్న ఉబలాటం ఉత్తమ విమర్శమీద లేదు. అందువల్ల యువభారతి ఉపన్యాసమంజరిని ఏర్పాటుచేసి, ప్రజల్లో సాహిత్యంపట్ల సదవగాహనము కల్పించి, సాహిత్య విమర్శవైపు ప్రజల మనస్సులను మరలించజేయాలని యత్నిస్తున్నది. ఉద్యమం వెనుక ఉత్తమాదర్శమున్నదని ప్రజలు గుర్తించారు వారి ప్రయోగాలు ఫలవంతములౌతాయని ఆశిద్దాం.

ఈ గ్రంథంలో వ్యాసాలు రచించినవారు ప్రసిద్ధికెక్కిన పండితులు; సాహిత్య విమర్శలో చేయితిరిగినవారు. మహా విమర్శకులని కీర్తికెక్కిన సాహితీ మూర్తులవ్యక్తిత్వాలను చిత్రించే వ్యాసాలు వారిచేత వ్రాయించి ప్రచురించాలని యువభారతి ఇందులో ప్రయత్నం చేసింది. పుస్తకం మీముందుంది. విలువకట్టే విజ్ఞులు మీరు. మీ మన్ననలనందుకుంటే ఈ కృషి ధన్యం.

హైదరాబాదు, జి. వి. సుబ్రహ్మణ్యం
12.12.1980

# కట్టమంచి రామలింగారెడ్డి.

డా॥ చల్లా రాధాకృష్ణశర్మ

"మా వంశమున కేది వచ్చిన రానిండు, తెనుఁగుభాష యొక్కటి మాత్ర మక్షయముగ నిలిచియుండినఁ జాలును." [1]

ఇంత మాతృభాషాభిమానం మూర్తీభవించిన మహనీయుడు డాక్టర్. సి. ఆర్. రెడ్డిగారు. నలుగురికీ చిరపరిచితులైన కట్టమంచి రామలింగారెడ్డి గారు. ఈ స్వభాషాభిమానం ఆయనకి వంశానుగతంగా వచ్చిన విద్య. అయితే, యిది భాషా దురభిమానానికో అన్యభాషా ద్వేషానికో దారి తియ్యలేదు. పై పెచ్చు సంస్కృతాది వివిధ భాషలను సరి సమానంగా ఆదరించిన భాషా ప్రియుడు ఆయన. ''సంస్కృతం మృతభాషా ? సంస్కృతి లోపించిన వారికే అది మృతభాషగా కనిపిస్తుంది." అని ఆయన ఒకసారి అన్నారు. [2] తమిళ భాషా సాహిత్యాలంటే ఆయనకి ఎంతో అభిమానం. "తమిళంలో సిలప్పదికారం, మణిమేఖల వంటి కావ్యాలు ఉండటం చూసి తెలుగువాడినైన నేను అసూయ చెందుతున్నాను. తెలుగులో ఈకావ్యాలవంటివి లేవు"-అని ఒకచోట అభివ్యక్తం చేసినఅచ్ఛమైన భాషాభిమాని ఆయన.[3] ఆంగ్లభాషా సాహిత్యాలకు పెళ్ళిపందిళ్ళు వెలిసే ఆ రోజుల్లో ప్రముఖస్థానంలో ఉన్న ఒకవ్యక్తి అన్యభాషా ద్వేషదూషితం కాని స్వభాషాభిమానం కలిగివుండడం నిజంగానే గొప్ప విషయం.

కట్టమంచివారు ముమ్మూర్తులా ఆధునికుడు; అలాగే సనాతనుడు. ఆయన ప్రకటించిన భావాలు, ఒక్కొక్కసారి, విప్లవాత్మకములు; అలాగే ఆయన

పట్టిన తెలుగు శైలి సంప్రదాయ సిద్ధమైన ప్రాచీన శైలి. ఆయన కొమ్ములు తిరిగిన పండితుడు; అలాగే చెయ్యి తిరిగిన రచయిత. ఆయన ఎదటి వారికి గుండె బెదురుగా సంచరించిన రాజకీయవాది. అలాగే అందరినీ అలరించిన ప్రముఖ విద్యావేత్త. ఆయన కవిహృదయాన్ని ఆవిష్కరించే భాష్యకారుడు. అలాగే కొండంత భావాన్ని కుదించి చెప్పగల సూత్రకారుడు.

ఈ ద్వైధీభావం కట్టమంచివారి మాటల్లో చేతల్లో కూడా కనిపిస్తుంది. గాంధీజీ అంటే అపారమైన ఆదరభావం ఉన్నా, మహాత్ముని రాజకీయాభిప్రాయాలు కొన్నిటిని విమర్శించడానికి ఆయన వెనుకాడలేదు. భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణాన్ని బహుథా ప్రోత్సహించినా, దేశ సమగ్రతకూ ఇరుగుపొరుగు వారితో సత్సంబంధాలకూ అది పానకంలో పుడక కాకూడదని ఆయన హెచ్చరించారు. ఆధునికతనూ విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలనూ ఎంతగానో ఆదరించినా, తాత్త్వికభావాలను నిరసించడం మంచిది కాదన్నారు. శ్రీబాగ్ ఒడంబడిక వంటి ఆదర్శాత్మక విధానాలను రూపొందించినా, వాటిని ఆయన ఆచరణ యోగ్యంగాకూడా తీర్చడం ఒక విశేషం. రాజకీయాలపట్ల ఆసక్తి ప్రదర్శించినా, విద్యా విధానాలంటే ఆయన ప్రదర్శించిన ఆదరభావం నిరుపమానం. సాహిత్యాన్ని అభిమానించినట్లుగానే, ఆధ్యాత్మికతను కూడా ఆయన అభిమానించారు.

కట్టమంచివారనగానే, యీ వివిధ విషయాలు మనఃఫలకంమీద ప్రతిఫలిస్తాయి. ఆయన మేధావి, పండితుడు, రచయిత, వక్త, విద్యావేత్త, రాజనీతివేత్త, పరిపాలనా దక్షుడు. ఈ వివిధ గుణాలు ఒకేవ్యక్తిలో నెలకొని వుండడం కూడా ఒక విశిష్ట లక్షణమే. ఈ గుణాలతోపాటు, ఆయన మానవతావాదిగా కూడా ఉండడం పేర్కొనదగిన అంశం. మానవతాదృష్టి లోపించిన విద్యావేత్తగాని, రచయితగాని, రాజనీతివేత్తగాని నలుగురిచేత ఓహో అని మన్ననలు పొందలేడు. కాగా ఈ మానవతా దృష్టి ఆయన్ని ఒక మహా మనీషిగా మలచగలిగింది. ఆచార్య కె.ఆర్. శ్రీనివాస అయ్యంగారు పేర్కొన్నట్లుగా, రాజనీతివేత్తగా కంటే, విద్యావేత్తగా కంటే, విద్వాంసుడుగా కంటే కూడా వ్యక్తిగా కట్టమంచివారు చాలా ఉదాత్తుడు. [4]

సి. ఆర్. రెడ్డిగారిని ఒక రంగానికే పరిమితం చెయ్యడం సమంజసం కాదు. ఒక వేళ అలా చెయ్యడానికి ప్రయత్నిస్తే, అది హాస్యాస్పదం తప్ప మరొకటి కాదు. ఆయన సమకాలికులు కొందరు ఇలా అనుకొనేవారు. 'రెడ్డిగారు కనక రాజకీయాలలోనే నిమగ్నమై ఉంటే, ఆయన మహోన్నత శిఖరాలు అందుకొనేవాడు.' నాటి రాజకీయ రంగంలో ఆయన ప్రముఖ పాత్ర నిర్వహించిన మాట నిజమే. 1921 నుంచి 1926 దాకాను, 1930 నుంచి 1936 దాకాను ఆయన రాజకీయాలలో పాల్గొన్నారు. మొదట్లో ఆయన జస్టిస్ పార్టీ

సభ్యుడు. 1924 లో ఆ పార్టీ నుంచి తప్పుకుని, యునైటెడ్ నేషనలిస్ట్ పార్టీ స్థాపించారు. ఆ తర్వాత ప్రతిపక్ష సభ్యుల్లో ప్రముఖుడుగా పేరు గడించారు. ఆ రోజుల్లో ఆయనంటే మంత్రులకు సింహస్వప్నం! ఆయన మామూలు రాజకీయవాది అనుకోవడం అసమంజసం. ఆయన రాజనీతివేత్త. మహా స్వతంత్రుడు. మొగమాటము లేకుండా మాట్లాడే స్వభావం కలవాడు. సాధారణంగా రాజకీయవాదుల్లో కనిపించే వాక్పారుష్యం, స్వవచోవ్యాఘాతం మొదలైనవి ఆయన మాటల్లో కనిపించవు. స్పష్టత, నిర్భీకత, పరిహాస రసికత మొదలైనవి ఆయన మాటలకు పెట్టని భూషణాలు. కనుకనే ఆయన రాజకీయ ప్రసంగాలు సైతం సి. ఆర్. గా ప్రథిత యశస్కుడైన శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారి వంటి ప్రముఖుల ప్రశంసలు పొందగలిగాయి.

మదరాసు శాసన మండలిలో వివిధ సమయాలలో ఆయన చేసిన ప్రసంగాలు, వాటిలో దొర్లిన చెణుకులు, విసిరిన విసర్లు ఆలోచనామృతాలు. వీటిని

'కాలం గతిస్తున్నది కాబట్టి, కాలంతో పాటే జ్ఞాపకశక్తి కూడాగతించకూడదు.'

'ద్వంద పరిపాలన ఒక్క మదరాసుకే పరిమితమైన వ్యాధికాదు; అది అఖిల భారత వ్యాధి.'

'పదవుల ఆశ సంశ్లేషానికి హేతువైతే ఆశాభంగాలు విశ్లేషానికి దారి తీస్తాయి.'

ఒకసారి ఆయన శాసన మండలిలో ప్రభుత్వ విధానాలను నిశితంగా విమర్శిస్తుండగా, సహించలేక పోయిన ముఖ్యమంత్రి (పానగల్ రాజా) తన జేబులోంచి ఒక కాగితం తీసి భయపెట్టాలనుకున్నాడు. అందులో రెడ్డిగారు స్వకార్యం గురించి విన్నవించుకొన్నారట. అది గమనించిన కట్టమంచివారు వెంటనే యిలా అన్నారు: 'ఇంగ్లాండులో అయితే కలహించుకున్న ప్రేమికులు విడిపొయ్యేటప్పుడు ఎవరి ఉత్తరాలను వాళ్లకు ఇచ్చివేస్తారు.' అంతే; ముఖ్యమంత్రి నోటికి తాళం వేసినట్లయింది.

ఇంకొకసారి ఆయన బడ్జెటు గురించి ప్రస్తావిస్తూ కొన్ని సంఖ్యా వివరాలు తమ ప్రసంగంలో తెలియజేశారు. అవి సరికావని ఒకరు ఆక్షేపణ తెలపడం తరువాయి "నేను లెక్కలు చెప్పడంలేదు, రాజకీయాలు మాట్లాడుతున్నాను" అన్నారు కట్టమంచివారు ఏమాత్రమూ తడుముకోకుండా.

ఆయన ఒకసారి మదరాసులోని ఎగ్మూరులో ఒక రాజకీయ సభలో ప్రసంగిస్తూ ఉండగా, కొందరు వేదిక మీదికి రాళ్లు రువ్వారు. వెంటనే 'మన రాజకీయాల్లో జస్టిస్‌పార్టీవారు కొందరు రాతియుగాన్ని ప్రవేశపెడుతున్నారు' న్నారు ఆయన.

ఆరోజుల్లో (1936) అవిభక్త మదరాసు రాష్ట్రంలో ఎక్కడ విన్నా కాంగ్రెసువారు పదవీబాధ్యతలు స్వీకరిస్తారా ?' అనే ప్రశ్న వినిపించేది. కట్టమంచివారు రైలు ప్రయాణం చేసి మదరాసు సెంట్రలు స్టేషనులో అప్పుడే దిగారు. పత్రికా విలేఖరులు ఆయన్ని చుట్టుముట్టారు. అందరినోళ్ళలో నానుతున్న ఆ ప్రశ్నవేసి, మీ అభిప్రాయం ఏమిటని అడిగారు. "ఇప్పుడు నాకు కావలసినది పోర్టరు గాని రిపోర్టరు కాదు" అన్నారు ఆయన.

ఇటువంటి చెణుకులూ చమత్కారాలూ కట్టమంచివారి ప్రసంగాలలో చాలా కనిపిస్తాయి. పైకి ఇవి శబ్దచమత్కారాలుగా కనిపించినా, వీటిలోని ఆయన సమయస్ఫూర్తి, పరిహాస రసికతా, భావతీవ్రతా పరిశీలించదగినవి. అంతే కాక కట్టమంచివారి వ్యక్తిత్వాన్ని ఇవి తేటతెల్లం చేస్తాయికూడా. ఒకరి మెరమెచ్చులకోసం మాట్లాడే వ్యక్తిత్వం కాదు ఆయనది. మహాస్వతంత్రుడు. ఒకసారి కేంద్ర విద్యామంత్రి ఒకరు 'మీరు విద్యాశాఖా కార్యదర్శిగా చేరతారా?' అని అడిగారట. అందుకు కట్టమంచివారి సమాధానం: ఇద్దరు విద్యామంత్రులు ఎలా ఉంటారు.?[5]

ఇంత స్వతంత్రుడు ప్రభుత్వ యంత్రాంగంలో పడి నలగడానికీ, రాజకీయ విషవలయంలో చిక్కి మెలగడానికీ ఎలా సమ్మతిస్తాడు? ఏదిఏలా ఉన్నా, రాజకీయాలనుంచి తప్పుకొని ఆయన విద్యారంగంలోకి రావడమే కాక అందులో అహర్నిశలూ పాటుపడడం విద్యారంగం చేసుకున్న భాగ్యమనవచ్చు. రాజాజీ అంతటివాడు ఆయన్ని 'అసాధారణమైన ఉపాధ్యక్షుడు' అని అభివర్ణించారు. అతిశయోక్తి కాదిది. ఈ అసాధారణత్వం ఆయన్ని మరపురాని మనీషిగా చేసింది.

కట్టమంచి రామలింగారెడ్డిగారి అభిజనం చిత్తూరు జిల్లాలోని కట్టమంచి గ్రామం. 1880, డిసెంబరు 10 న సుబ్రహ్మణ్యారెడ్డి దంపతులకు జన్మించారు. ప్రతి తత్త్వజ్ఞుడూ, దైవభక్తుడూ ఏకపత్నీవ్రతుడూ భారత భాగవతోజ్జ్వలవారిధీ అయిన సుబ్రహ్మణ్యారెడ్డిగారు న్యాయవాదిగా పండితుడుగా చిరకీర్తి ఆర్జించిన పుణ్యమూర్తి. భారతసార రత్నావళి, భాగవతసార ముక్తావళి అనే రెండు సంకలనాలు ప్రకటించిన సాహిత్యోపాసకుడు. ముత్తాతగారు (పెద్దరామలింగారెడ్డి) భాస్కరశతకకర్త. భక్తిరసప్రధానమైన వరదరాజ శతకం వెలయించిన నరసమ్మగారు వరసకి అగ్రజ. తెలుగు భాషాపాండిత్యం ఆధ్యాత్మికచింతనా పెనవేసుకుపోయిన వంశంలో పుట్టిన రామలింగారెడ్డిగారికి ఈ రెండు గుణాలు ఉగ్గుతో అలవడిన విద్యలనడం సత్యసన్నిహితం.

తన తండ్రిని గురించి ముసలమ్మ మరణం ఉపక్రమణికలో రామలింగారెడ్డిగారు ఒక చక్కని పద్యం వ్రాశారు.

'భారత భాగవతోజ్జ్వల
వారిధిగతసారపద్య వరమణి చయమున్
హారముగఁ గూర్చె నెవఁ డా
సూరిని మజ్జనకుఁ దలఁచి చూడుఁడు నన్నున్.'

స్వభావోక్తులు అందాలు దిద్దుకున్న యీ పద్యం రామలింగారెడ్డిగారి పితృభక్తిని స్పష్టం చేస్తున్నది. 'మజ్జనకుఁ దలఁచి చూడుఁడు నన్నున్' అని చెప్పుకోవడం ఆయన వినయసంపదను కూడా సూచిస్తోంది. సుబ్రహ్మణ్యరెడ్డిగారు ఎంతగా పేరు ప్రతిష్ఠలు ఆర్జించారంటే, రామలింగారెడ్డిగారు మదరాసు శాసన మండలికి పోటీచేసిన సందర్భంలో ఆయన ఊరూరా పర్యటించినప్పుడు ఎక్కడికి వెడితే అక్కడ '....ఫలానా రెడ్డిగారి కుమారుడు' అంటూ ఆయన్ని ఆదరించారు. కనుకనే తాను సులభంగా విజయం సాధించినట్టు ఆయన చెప్పుకునే వారట![6]

రామలింగారెడ్డిగారి ప్రాథమిక విద్యాభ్యాసం ఆయన స్వగ్రామంలో జరిగింది. ఆ చిన్నవయస్సులోనే ఆయనకి భారత భాగవత రామాయణాలతో పరిచయ భాగ్యమూ కలిగింది. ముఖ్యంగా భారత రామాయణాలు ఆయన్ని బహుథా ఆకర్షించాయి. ఆయన ఎక్కడున్నా ఏ పదవిలో ఉన్నా, ఈ ఆకర్షణ కొంచెమైనా తగ్గలేదు. రామాయణ భారతాలు (తెలుగు సేతలు) పదేపదే అధ్యయనం చేశారు. నాకే కనక పూర్తి అధికారం ఉంటే మహాభారత పఠనాన్ని నిర్బంధ పాఠ్యాంశంగా చేస్తానని ఆయన ఒకసారి సెలవిచ్చారట. రామాయణం గురించి ఆంగ్లంలోనూ, మహాభారతం గురించి తెలుగులోనూ ఆయన విమర్శ గ్రంథాల వెలువరించడానికి ప్రారంభించారు! కాని మన దురదృష్టం. అవి పూర్తికాలేదు.

ఈ సందర్భంలో మైసూరులోని గాంధీ సేవాసంఘంవారిని ఉద్దేశిస్తూ రామలింగారెడ్డిగారు చేసిన ప్రసంగం పరిశీలనార్హం'........భారతీయులు విద్యావంతులు కారని కొందరు అంటారు. ఈ అభిప్రాయానికి నేనెప్పుడూ వ్యతిరేకినే. విశ్వవిద్యాలయ విద్యార్థిలా అందరు అక్షరాస్యులు కాకపోవచ్చు. కాని అతని అంత విద్యావంతులై ఉండవచ్చు. వినికిడివల్ల మనం నేర్చుకుంటాము. (శ్రుత పాండిత్యం). శీలాన్ని పెంపొందింప జేసుకునేందుకూ,భావోన్నతిని గడించేందుకూ, మన జీవితాలను మెరుగు పరుచుకునేందుకు రామాయణ భారతాలకంటె శ్రేష్ఠమయింది మరొకటి ఉందా ? మన గ్రామసీమల్లో నివసించే స్త్రీపురుషులు మన ప్రాచీన సాహిత్యంలో నిష్ణాతులు, విద్యావంతులు. వారు అక్షరాస్యులు కాకపోవచ్చు. కాని విద్య నేర్చినవారు.' కాగా, విద్యా సంస్కృతుల్ని అక్షరాస్యతతో ముడి పెట్టడం అసమంజసమని ఆయన అభిప్రాయం.

ప్రాథమిక విద్య ముగిసిన తర్వాత ఆయన చిత్తూరు ఉన్నత పాఠశాలలో చేరారు. అక్కడ తెలుగుపండితులుగా పనిచేసే కుప్పనయ్యంగారు యువకుడైన రామలింగారెడ్డికి వ్యాకరణాదులు బోధించారు. తెలుగు,ఇంగ్లీషు, చరిత్ర, భూగోళ శాస్త్రం మొదలైనవి ఆయనకి కొట్టిన పిండి. కాని, గణితశాస్త్రం మాత్రం మింగుడు పడని ముద్ద. 1896 లో స్కూల్‌ఫైనల్ పరీక్షలో కృతార్థుడై మదరాసులోని క్రైస్తవ కళాశాలలో యఫ్.ఎ. లో చేరాడు. ఆ రోజుల్లో ఆ కళాశాలాధ్యక్షులు డా.మిల్లరు. ప్రసిద్ధ విద్యావేత్తగా ఆయన కీర్తి సముపార్జించాడు. వేదం వేంకటరాయశాస్త్రి, సమర్థి రంగయ్యసెట్టి వంటి ప్రముఖులు ఆ కళాశాలలో పనిచేసేవారు.

కళాశాలలో చదివే రోజుల్లోనే ఆయన తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ మంచి వక్తగా పేరు సంపాదించారు. లోకమాన్య బాలగంగాధర తిలక్‌ని ఆనాటి ప్రభుత్వం నిర్బంధించినప్పుడు లోకమాన్యుడికి సానుభూతి ప్రకటించేందుకు విద్యార్థుల్ని ఆయన ప్రేరేపించారు.[7] ఇదంతా ఒక యెత్తు. తెలుగు కవితా విమర్శకుడుగా పేరు గడించడం మరొక యెత్తును.

క్రైస్తవ కళాశాలకు చెందిన శ్రీమదాంధ్ర భాషాభిరంజనీ సమాజ పోషకులు సమర్థి రంగయ్య సెట్టిగారు నెలకొల్పిన బహుమాన కావ్య పద్ధతిని పురస్కరించుకుని రామలింగారెడ్డిగారు ముసలమ్మ మరణం వ్రాశారు. బహుమతి పొందారు. అలాగే ఆంధ్ర భాషాభిరంజనీ సమాజం ఆధ్వర్యంలో జరిగిన సమావేశంలో (1899) కళాపూర్ణోదయం గురించి ఒక వ్యాసం చదివారు; ప్రశంసపొందారు. అదే తరువాతి కవిత్వతత్త్వ విచార గ్రంథరచనకు ప్రాతిపదిక అయింది.

ఈ సందర్భంలో సుప్రసిద్ధ దేశభక్తులు గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారి మాటలను మననం చేసుకోవడం సమంజసం. [8]

"శ్రీ క. రామలింగారెడ్డి నాకు జ్యేష్ఠ సోదరుడు. నా యందలి ప్రేమచే కొంతకాల మతడు నన్ను 'సీనియర్' - జ్యేష్ఠుడని వ్యవహరించినను, అతడు క్రైస్తవ కళాశాలలో బి.ఏ. పట్ట పరీక్షయందు చరిత్రలో చేరి డబుల్ డిగ్రీకొరకు -దుశ్శాలువల కొరకన్నమాట - తత్త్వశాస్త్రము చదువుచు ఉపన్యాస వేదికల మీద ఇంగ్లీషు తెలుగుల రెంటిని అనర్గళముగా వెల్లువ లురికించుచు ప్రసంగించు దినములలో నేనా కళాశాలను ప్రవేశించి ఇతనియంతటి వాడను నేనెప్పుడగుదునో యని నోరూర్చుకొనుచు, నాసికమీది ఆ పెద్ద మచ్చ మీదను, అతని ముఖము మీదను తదేక ధ్యానముగా దృష్టి నిలిపి అతనిని రమారమిగా ప్రేమించితిని."

ఆదర్శ విద్యార్థి అయిన రామలింగా రెడ్డిగారు బి. ఏ. పరీక్షలో చరిత్ర, తత్త్వ శాస్త్రాలలో కృతార్థులు (1902) కావడం ఒక పెద్ద విషయం కాదు.

ప్రభుత్వపు విద్యార్థి వేతనంతో ఆయన ఆ తర్వాత ఉన్నత విద్యకోసం ఇంగ్లాండు వెళ్ళారు. కేంబ్రిడ్జిలో సెయింట్ జాన్స్ కళాశాలలో చేరి, యం. యే., చదివి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణు లయ్యారు. చరిత్రే కాక, ఆర్థిక తత్త్వ శాస్త్రాలు కూడా అధ్యయనం చేశారు.

కేంబ్రిడ్జిలో చదివే రోజుల్లో కూడా ఆయన ప్రతిభ నలుగురికీ తెలియ వచ్చింది. బహుమతులు మొదలైనవి పొందడంతోపాటు కేంబ్రిడ్జి యూనియనుకి ఉపాధ్యక్షుడుగా ఎన్నుకోబడడంతో ఆయన చరిత్ర సృష్టించిన వాడయ్యాడు. ఆ గౌరవం పొందిన తొలి భారతీయ ఉపాధ్యక్షుడు ఆయనే. గోల్డ్స్వర్త్స్, లిట్టన్, స్ట్రాచీ, ఈ. యం. ఫార్ స్టర్ మొదలైన ప్రముఖులతో మేధావులతో ఆయనకి సన్నిహిత పరిచయం కలిగింది. అలాగే సుప్రసిద్ధ దేశభక్తులు లాలా లజపతిరాయ్, గోపాలకృష్ణ గోఖలే మొదలైన వారితోనూ పరచయం కలిగింది. ముఖ్యంగా గోఖలే అంటే ఆయనకి అపారమైన ఆదరభావం. ఆయన సలహా ననుసరించే న్యాయశాస్త్రం చదవాలనుకున్న రామలింగారెడ్డిగారు అధ్యాపక వృత్తిని వరించారు. అది విద్యారంగానికి ఎంతో మేలు చేకూర్చింది. విదేశంలో ఉన్నా, పాశ్చాత్య మేధావులతో నేస్తం కట్టినా ఆయన మనస్సు ఆంధ్ర మహా భారతం నుంచి మరలలేదు. ఇది ఆయన మాతృభాషాభిమానానికీ, భారతం మీది గౌరవానికీ ఒక నిదర్శనం. స్వదేశానికి తిరిగివచ్చే ముందు ఆయన అమె రికా వెళ్ళి అక్కడి విద్యాసంస్థలను సందర్శించారు.

విద్యారంగంలో రామలింగారెడ్డిగారు అత్యున్నత శిఖరాలు అందుకున్నా రనడం నిజానికి దగ్గరి చుట్టం. ఆచార్యుడుగా, వైస్ ప్రిన్సిపాల్గా, ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ ఎజుకేషన్ (విద్యాశాఖాధిగారిగా,) ఉపాధ్యక్షుడుగా, ప్రోఛాన్సెల రుగా ఆయన వివిధ పదవుల్లో సమర్థ వంతంగా పని చేశారు.

స్వదేశానికి తిరిగి వచ్చిన తర్వాత, ఆయన బరోడా కళాశాలకు వైస్ ప్రిన్సిపాల్గా నియమితు లయ్యారు. అతకు ముందు ఆ పదవిలో శ్రీ అర విందులు ఉండేవారు. తర్వాత మైసూరు మహారాజా కళాశాలకు ప్రిన్సిపాల్గా, ఆ తర్వాత ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ ఎజుకేషన్గా నియమితులయ్యారు. అప్ప టికి ఆయన వయస్సు నాలుగు పదులైనా దాటలేదు! ఐరోపీయ చరిత్ర, భార తీయ ఆర్థిక శాస్త్రం మొదలైన వాటిని ఆయన బోధించిన తీరు విద్యార్థుల్ని బాగా ఆకర్షించింది. విశ్వవిద్యాలయ సంస్కరణలను గురించి ఆయన చేసిన ప్రసంగాలు అమూల్యములు. అవి ఆలోచనామృతములు. మైసూరు విశ్వ విద్యా లయంలో తెలుగుశాఖ ఏర్పడడానికి కారణం ఆయనే. ఆయన హయాములో పాఠశాలల్లో హరిజన విద్యార్థులకు ప్రవేశం లభించింది. మైసూరు విశ్వ విద్యా లయానికి ప్రణాళిక తయారు చేసిన రామలింగారెడ్డిగారు 1921 లో ఉన్నట్టుండి

ఇన్‌స్పెక్టర్ జెనరల్ ఆఫ్ ఎజుకేషన్ పదవికి రాజీనామా చేశారు. ఇలా బాధ్యతాయుతమైన పదవి నిర్వహిస్తూనే ఆయన తెలుగులో భారత అర్థశాస్త్రం వెలయించి మహోపకారం చేశారు.

1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వెలుగులోకి వచ్చింది. రామలింగా రెడ్డిగారు స్థాపకఉపాధ్యక్షులు. విశ్వవిద్యాలయ నియమ నిబంధనలు మొదలుకొని వివిధ శాఖలకు అధ్యాపక బృందాన్ని నియమించేదాకా గల వివిధ అంశాలు పర్యాప్తంగా పరిశీలించవలసి వచ్చింది. ఆయనకిగల ఆంధ్రాభిమానం నిరుపమానం. అయినప్పటికీ, అధ్యాపక నియామకంలో కేవలం విద్యార్హతలకే ప్రాధాన్య మిచ్చారు. అంతేకాని సంకుచితమైన ప్రాంతీయ, భాషాభిమానాలకు చోటివ్వలేదు. విజ్ఞానశాస్త్ర పరిశోధనకు ప్రాముఖ్యం ఇవ్వబడింది. కాని తెలుగు శాఖలో ఆచార్య పదవిని ఆయన కల్పించకపోవడం శోచనీయం!

విశ్వవిద్యాలయోపాధ్యక్షుడుగా రాజకీయాలకు దూరంగా ఉన్నా, ఆయన ఆనాటి రాజకియ పరిస్థితుల్ని చూచీ చూడనట్లు ఉండలేకపోయాడు. స్వాతంత్ర్య సముపార్జనకు గాంధీజీ ప్రారంభించిన ఉద్యమాలు ఆయనకి తెలుసు. సైమన్ కమీషన్ రాకతో దేశంలో అలజడి రేగింది. లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో సంపూర్ణ స్వరాజ్యవాంఛ వ్యక్తం చేయబడింది. దేశంలో ఒక విధమైన అప్రశాంతత నెలకొన్నది. జగత్ప్రసిద్ధమైన దండి సత్యాగ్రహం ప్రారంభమయింది. సత్యాగ్రహుల నినాదాలు మిన్నుముట్టాయి. అదంతా చూసి ఆనాటి ప్రభుత్వం సహించలేకపోయింది. దమననీతికి పాల్పడింది. లాఠీ వికటాట్టహాసం చేసింది. కారాగృహాలు సత్యాగ్రహుల పాలిటి చంద్రశాలలైనాయి.

సహాయ నిరాకరణోద్యమాన్ని అణిచివేయడానికి పూనుకొన్న ప్రభుత్వపు చర్యలు రామలింగారెడ్డిగారికి దుర్భర మనిపించాయి. తత్ఫలితంగా తమ ఉపాధ్యక్ష పదవికి రాజీనామా ఇస్తూ (1930), ఆయన ఛాన్సెలర్ అయిన మదరాసు గవర్నరుకి ఒక లేఖ వ్రాశారు. ఆయన తన ఆవేదనకు సూటిగా ఇలా వ్యక్తం చేశారు.

"నా సోదర సోదరీమణులు చేస్తున్న త్యాగాలు, పడుతున్న బాధలుచూసి ప్రస్తుతపదవిలో నే నుండలేకపోతున్నాను. ఈమానసిక క్షోభలమధ్య ఉపాధ్యక్ష పదవి సంతోషప్రదమనీ గౌరవదాయకమనీ భావించడంలేదు."

ప్రముఖ పత్రికా సంపాదకులు శ్రీ ఖాసా సుబ్బారావుగారు ఈ లేఖను 'మన దేశభక్తి సాహిత్యంలో మహాకావ్యం'గా అభివర్ణించారు.

రామలింగారెడ్డిగారి తర్వాత సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు ఉపాధ్యక్షులయ్యారు. కాని, ఆయన 1936లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి వెళ్ళడంతో

మళ్ళీ రెడ్డిగారిని ఉపాధ్యక్ష పదవి వరించింది. ఆ పదవిలో ఆయన 1946 దాకా ఉన్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఈ మహనీయు లిద్దరూ చేసిన సేవను సర్. సి. వి. రామన్ అంతటి ప్రముఖుడు ప్రస్తుతించారు. ఇలా ఈ విశ్వకళా పరిషత్తుకి ఇద్దరు మహామేధావులు ఒకరి తర్వాత మరొకరు ఉపాధ్యక్షులు కావడం నిజంగానే ప్రముఖ విషయం.

ఆ తర్వాత రామలింగారెడ్డిగారు 1949 సెప్టెంబరులో మైసూరు విశ్వ విద్యాలయానికి ప్రోఛాన్సెలరుగా నియమితులయ్యారు. కాని, ఆపదవిలో ఆయన చాలాకాలం ఉండలేదు. ఆయన ఆరోగ్యం అంత తృప్తికరంగా లేకపోయింది. అప్పుడు ఆయన మదరాసులోని ఒక నర్సింగ్‌హోమ్‌లో చికిత్సకోసం చేరారు. పెద్ద ఆపరేషన్ జరిగింది. కోలుకుంటున్నట్టే కనిపించారు. కాని, విధివిలాసం మరోవిధంగా ఉంది. చివరిదాకా ఆయన స్పృహలోనే ఉన్నారు. చివరిఘడియలు సమీపించినట్టు ఊహించిన ఆయన ఒక కాగితం మీద 'ఆశ లేదు; ధైర్యంగా ఉండండి' అని వ్రాశారు....1951, ఫిబ్రవరి 24న రామలింగారెడ్డిగారు స్వర్గస్థు లయ్యారు.

మైసూరులో కొద్దికాలమే ఉన్నా, విశేషానుభవం రంగరించుకున్న ఆయన ప్రసంగాలు వినే భాగ్యం అక్కడి పౌరులకూ విద్యార్థులకూ లభించింది. ఆయన చేసిన కట్టకడపటి ప్రసంగం రామకృష్ణ పరమహంసను గురించి. ఇది మైసూరు ఆకాశవాణినుంచి 1951 జనవరి 13 న ప్రసారమయింది. మన జాతీయ పునరు జ్జీవనంలో రామకృష్ణుడు నిర్వహించిన విశిష్టమైన పాత్ర అందులోని ప్రధా నాంశం. ఆయన ప్రారంభించిన ఉద్యమం సంఘాన్నీ సకల మానవాళినీ ఉత్తేజితుల్ని చేసింది. మహనీయులు ప్రారంభించిన ఉద్యమాల పుట్టు పూర్వో త్తరాలు ఎలా ఉన్నా, అవన్నీ చివరికి మన సనాతన ధర్మంలో అంతర్వాహిను లైనాయని రామలింగారెడ్డిగారి అభిప్రాయం. అలాగే ఆయన చేసిన యితర ప్రసంగాలు కూడా ఆలోచనాత్మకాలు. ఏవిషయం గురించి మాట్లాడినా, క్షుణ్ణంగా పరిశీలించిన తరువాతనే ఆయన మాట్లాడేవారు. కనుకనే ఆయన ప్రసంగాలు గాలిలో కలిసిపొయ్యేవి కావు; మనస్సులో నిలిచిపోయ్యేవి.

మొదటినుంచీ ఏదో ఒక బాధ్యతాయుతమైన పదవిలో ఉన్నప్పటికీ, రామ లింగారెడ్డిగారి మనస్సు దేశం గురించే ఆలోచిస్తూ ఉండేది. కాశ్మీరు విభజనను గురించి ఆయన అన్నమాటలు పరిశీలించండి: ఆంగ్లో శాక్సనులకు విభజనపట్ల మక్కువేమో అనిపిస్తుంది. ఐర్లాండుని వాళ్లు విభజించారు. ఇండియాని విభజిం చారు; బెంగాలునీ పంజాబునీ విభజించారు; కాగితంమీద పాలస్టీనుని విభజించారు. కాశ్మీరుని కూడా విభజించాలని యత్నిస్తున్నారు. ఒకవేళ కాంగ్రెసువారు, ఔదార్య భరితమైన ఆదర్శవాదానికి వశులై భారతదేశ విభజనకు అంగీకరించినట్లే,ఇందుకు

కూడా సమ్మతిస్తే వాళ్లు మరో పొరపాటు చేసిన వాళ్ళవుతారు. కాశ్మీరు సమస్యను భద్రతామండలికి నివేదించడం అనుచిత కార్యమని భావించిన రామలింగారెడ్డిగారు ఇలా పేర్కొన్నారట: ఒక దుష్టుడు కనక మా యింట్లోకి జొరబడితే, అతన్ని మొదట బయటికి నెట్టేసి తర్వాత ఆ సంగతిని పోలీసులకు తెలియజేస్తాను. అతన్ని ఇంట్లోనే ఉండనిచ్చి పోలీసు స్టేషనుకి పరుగుతీయడం బలహీనతా అవివేకమూను.

ఇలా వివిధ విషయాలను గురించి ఆలోచింపజేసే స్వాతంత్రాభిప్రాయాలు ప్రకటించిన రామలింగారెడ్డిగారు అతి స్వతంత్రులేకాక అంతరంగంలో జాతీయతావాది. 1942లో లభించిన సర్ బిరుదాన్ని స్వాతంత్ర్యానంతరం విసర్జించడమేకాక ఆయన యిచ్చిన స్వాతంత్ర్యదిన సందేశాన్ని కనుక పరిశీలిస్తే, దేశవిభజన ఆయన్ని ఎంతగా బాధపెట్టిందో వ్యక్తమవుతుంది. రెండు దేశాలుగా విడివడి పోయిన ఇండియా ఎప్పటికైనా ఒకటవుతుందా? అని ఆయన తన ఆవేదనను ఆ సందేశంలో స్పష్టం చేశారు.

ఇంతవరకూ వ్యక్తిగా రాజనీతివేత్తగా విద్యావేత్తగా రామలింగారెడ్డిగారిని గురించి రేఖామాత్రంగా పరిశీలించాము. ఇక కవిగా విమర్శకుడుగా ఆయన చేసిన సాహిత్యసేవను పరిశీలిద్దాము.

కొందరు రామలింగారెడ్డిగారిని ప్రసిద్ధ రాజకీయవాదిగా భావిస్తారు. మరి కొందరు సుప్రసిద్ధ విద్యావేత్తగా ప్రస్తుతిస్తారు. అలాగే సాహిత్యవిషయంలోనూ రెండు రకాల అభిప్రాయాలు లేకపోలేదు. నూతనకావ్య రచనా విధానానికీ నవ్య కవితాశైలికీ రెడ్డిగారు మార్గదర్శకులని కొందరి అభిప్రాయం. ఆయన తెలుగులో నూత్న విమర్శ పద్ధతికి దోవ వేసినవారని కొందరి అభిప్రాయం. ఈ రెండు అభిప్రాయాలలోనూ నిజం ఉన్నది. సాహిత్య విద్యార్థులలో కూడా చాలామంది ఆయన్ని విమర్శకుడుగా గుర్తించినంత గాఢంగా కవిగా గుర్తించలేదు. ఆయన విమర్శప్రతిభకు ముందు కవితాప్రతిభ మరుగున పడిపోయిందేమో అనిపిస్తుంది. ఏది యెలా ఉన్నా, రామలింగారెడ్డిగారు ఆధునికాంధ్ర చరిత్రలో స్థానం సంపాదించుకున్న విమర్శకకవి.

విదేశంలో ఉన్నత విద్యాభ్యాసం చేసినా, వినూత్న విషయాలు ఎన్నో గ్రహించినా, అధునాతన భావాలను ఆదరించినా. భాషాశైలులకు సంబంధించినంతవరకూ రామలింగారెడ్డిగారు సంప్రదాయ విధేయులనడం సమంజసం. అందులోనూ ఆయన పద్యరచన మరీ సంప్రదాయవిధేయం. ఇది ఒక దోషంగా నేను పరిగణించను. పద్యమైనా పద్యేతరమైనా అది రచయిత మనస్సులోని భావాన్ని సుస్పష్టం చెయ్యాలి. భావప్రకటనలో అస్పష్టతకు చోటివ్వని శైలి, సంప్రదాయ బద్ధమైనా కాకపోయినా, హృద్యంగానే కనిపిస్తుంది. ఈ దృష్టితో చూస్తే, రామలింగారెడ్డిగారిది భావప్రధానమైన సాంప్రదాయిక శైలి. భావ వ్యక్తీకరణకూ పాత్ర చిత్రణకూ ఆయన ప్రాధాన్య మిచ్చిన విషయం ఆయన ముస

లమ్మ మరణం, నవయామిని మొదలైన ఖండ కావ్యాలను అలవోకగా పరిశీలించినా తెలియవస్తుంది. అందువల్ల ఆయనది సాంప్రదాయిక శైలి అయినా, అది వట్టి మాటలపోగు కాదు. ఆ మాటల వెనుక ఉదాత్త భావాలు కనిపిస్తాయి. పైగా ఆయన కవితాక్షేత్రంలో గట్టిగా కృషి చెయ్యలేదు. కృషి సాగించి వుంటే బంగారు పంటలు పండించి వుండేవారు

రామలింగారెడ్డిగారు విద్యార్థిగా ఉన్నప్పుడు (19వ యేట) వెలువడిన ఖండకావ్యం ముసలమ్మ మరణం. అదీ ఆయన ఇచ్ఛికంగా చేసిన రచన కాదు. సమర్థి రంగయ్య సెట్టిగారు నిర్వహించిన కవితాస్పర్థకోసం సంతరించబడిన రచన. అది ఆయన తొలి ఖండకావ్యం. సంప్రదాయ బద్ధుడైన ఒక రచయిత తొలికావ్యం శబ్దాడంబరంతో మధ్య మధ్య కొంచెం ప్రౌఢంగా కనిపించడంలో వింతలేదు. కనుకనే బుక్కరాయసముద్రంలోని సరస్సు 'చలదుత్తుంగ మహోగ్ర భంగపటలీ సంఘట్టనారావముతో' భయంకరంగా దర్శన మిచ్చినట్లు కవి వర్ణించడం జరిగింది. శైలికి సంబంధించి నంతవరకూ ఆయన ప్రాచీనుడు. కాని, కథాకథనం ఆయనలోని నవీనతా దృక్పథాన్ని సువిదితం చేస్తున్నది.

107 పద్యాలలో సాగిన లఘుకృతియే అయినప్పటికీ, 'ఇరువదియవ శతాబ్ది యుదయింపనున్న వేగుబోకలో నక్షత్రమువలె మన సారస్వతాకాశమున నవ్యకాంతులతో నావిర్భవించిన నూత్నాంధ్ర కావ్యము' ముసలమ్మ మరణం. ఈ కావ్యప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు చెప్పిన మాట లివి. ఆ నవ్యకాంతు లేమిటి?.

అనుశ్రుతంగా వస్తున్న శృంగార రస పోషణకు ప్రాధాన్యం కల్పించకుండా నిస్స్వార్థ త్యాగానికి కవి పెద్దపీట వెయ్యడం ఒక విశేషం. కాగా ముసలమ్మ మరణం చదువుతున్నప్పుడు ఒకే మూసలో పోసిన కృతిని కాక ఒక కొత్త రచనను చదువుతున్నామనే అనుభూతి పాఠకుడికి అప్రయత్నంగా కలుగుతుంది. సామాన్య మహిళలను గురించి మన ప్రాచీన కావ్యాలలో క్వాచిత్కంగా వర్ణనలూ మొదలైనవి కనిపించినప్పటికీ, ప్రస్తుత కావ్యం ఆద్యంతాలూ ఒక పల్లెటూరి యిల్లాలికి సంబంధించినదై ఉండడం మరో విశేషం. సంప్రదాయానికి భిన్నంగా కావ్యాన్ని ఖేదాంతంగా ముగించడం ఇంకొక ప్రత్యేకత. ఇది కథలోనే ఉన్నా, ఆనాటి పద్ధతిని త్రోసిరాజనడం కవి ప్రదర్శించిన స్వతంత్రతకూ ప్రకటించిన భావ విప్లవానికీ ప్రబల నిదర్శనం. పాత కొత్తల మేలి కలయిక యీ కావ్యం. ఒక మహిళలోని త్యాగనిరతిని అవగాహన చేసుకొనేందుకు బహుథా ఉపకరించే ప్రశస్తకృతి యిది. 'ఈ చిన్న పొత్తము ముఖ్యముగా స్త్రీల కొరకు జేయబడినది. వారి కుపయుక్తముగా

నొప్పిన యెయల నా ప్రయాస సఫలత నొందినట్లే.' అని కావ్యప్రయోజనాన్ని తత్కర్త స్పష్టం చేశాడు.

ముసలమ్మ మరణం లోని కథ అల్పమే అయినప్పటికీ అలాంటి కథలు మన దేశంలో అక్కడక్కడా వాడుకలో ఉన్నప్పటికీ ఆ కథకు ఒక ప్రత్యేకతను సమకూర్చిన ఘనత రామలింగారెడ్డిగారికి దక్కింది. కథను కరుణరసపుముద్దగా మలచడమే కాక ముసలమ్మ పాత్రలోని త్యాగశీలతకు బ్రహ్మరథం పట్టడం జరిగింది. అందువల్ల కథ పాఠకుడిని అనాయాసంగా ఆకట్టుకుంది. అనగా రామలింగారెడ్డిగారి పాత్రచిత్రణ కథకు జీవం పోసిందనడం సత్యసన్నిహితం. కథ ఆయన సొంతం కాకపోయినా, 'రసాధిక్యమునకై నూతన కల్పనలు' చేశారు.

బుక్కరాయ సముద్రంలోని చెరువు ఆకాశం చిల్లిపడ్డట్టుగా కురిసిన వానలకు పొంగడం, గ్రామప్రజలు పోలేరమ్మకు పొంగలి పెట్టడం, ముసలమ్మ అనే యిల్లాలు ఆ చెరువులో మునిగి ఆత్మత్యాగం చేసి చెరువుని శాంతింపజేసి ఊరివారిని కాపాడడం ఈ కావ్యంలోని కథ.

ఆత్మత్యాగానికి సంసిద్ధురాలయిన ముసలమ్మ తనను ప్రాణాధికంగా ప్రేమించే భర్త వద్ద, వృద్ధులైన అత్తమామలవద్ద అనుజ్ఞ పొందడం, కన్నకొడుకుమీద మమకారాన్ని కూడా చంపుకుని ఆ బుడుతడిని భర్తకు అప్పగించడం మొదలైన ఘట్టాలు కటికిగుండెను సైతం కరిగించేవిలా ఉన్నాయి. కరుణరసానికి అటువంటి అమోఘమైన శక్తి స్వతస్సిద్ధంగానే ఉంది. అయితే యీ కావ్యంలో త్యాగశీలతతో రంగరించబడేసరికి దానికి ఎక్కడలేని శోభ కలిగింది. కావ్యంలో అడుగడుగునా త్యాగవాంఛలోని మహనీయత కళ్ళకు కట్టినట్లుగా చిత్రించబడింది.

"జనులకు మే లొలరింపని
తనువేలా ? కాల్పదగదా ?,..............."

"అయిన నా చేయు కార్యమీ యఖిలమైన
వారికిని వీరికిని శుభం బారజేయు
వీరికై విడువక మేను పెంచి పెంచి
యేమి చేయంగ బ్రొయిలోన నిడనె........"

"................అఖిల జనుల
కలక నేనాడు దీర్పంగ దలపడేని
పుట్టనేల నరుడు మఱి గిట్టనేల ?..............."

మొదలైన పద్యభాగాలు చిరస్మరణీయములే కాక ముసలమ్మ పాత్ర లోని త్యాగబుద్ధికి అద్దంపడుతున్నవి. అందరిమీది అనురాగాన్ని త్యజించి సంఘ శ్రేయమును లక్ష్యంగా చేసుకొని చిరునవ్వు నవ్వుతూ ఆమె చెరువులో మునిగి శరీరత్యాగం చేసింది; గ్రామదేవతగా ప్రజా హృదయంలో నిలిచి పోయింది.

త్యాగశీలతకు దృష్టాంతంగా నిలిచిపోయిన ముసలమ్మ పాత్రను కవి చిత్రించిన తీరు ప్రశంసార్హం. ఆమె సుగుణాలవాల. పరోపకార బుద్ధి ఆమెకు పెట్టని భూషణం. ఆమె అన్యులవంటిది కాదు. ఎంత మంచి యిల్లాలైనా, ఆమె అత్తమామల మెప్పుని పొందడం అసంభవం కాదు కాని అసాధారణం. 'అత్త మెచ్చిన కోడలూ లేదు, కోడలు మెచ్చిన అత్తా లేదు' - అనడం లోకవ్యవ హారం. ఇందుకు అపప్రథ కల్పించిన ఉత్తమ ఇల్లాలు ముసలమ్మ. ఆమె సౌజన్యాన్ని అత్తమామల ముఖతః కవి యిలా చెప్పించారు.

"కనులు లేని మాకు గన్నును నూతకో
లయును నీవ మా తనయుల కంటె
గూర్తు మాకు ముద్దుకోడలా ! నీవులే
నట్టి యిల్లు నిల్లె? యడవి గాక."

'భావ సంపదలోను, శైలీ సాధుత్వములోను రెడ్డిగారు ఆధునికాంధ్ర కవులలోఁ డిక్కనగారి ప్రథమశిష్యు లనిపించు కొనుటకుఁ దగిన యర్హత గల వారు—'' అన్న పింగళి లక్ష్మీకాంతముగారి మాటలు అక్షరాలా నిజమనడానికి పై పద్యం ఒక్కటి చాలనుకుంటాను. ఇంత భావసంపద అంత చిన్నతనంలోనే కలగడం రెడ్డిగారి సుకృత విశేషం.

రామలింగారెడ్డిగారు బహుకావ్య నిర్మాతలు కాకపోయినా, ఆయన కమ నీయ కల్పనాశక్తి రమణీయ భావసంపదా కల కవి అనడానికి ఉన్న రచనలే చాలు. అనాదరణీయమైన బిల్హణుడి కథను ఆయన ఆదరణీయంగా చిత్రించారు. క్షణికమైన మోహావేశానికి వశుడైనా, బిల్హణుడు తన తప్పు తాను తెలుసుకొని పశ్చాత్తప్తుడు కావడాన్ని సహజ సుందరంగా చిత్రించారు. మనిషి తప్పు చేయడం సహజం. ఆ తప్పుని దిద్దుకుని దారి చూపినవారిని కృతజ్ఞతా భావంతో స్మరించడం జ్ఞానసంపన్నుడైన మానవుని కర్తవ్యం. ఇటువంటి బిల్హణ పండితుణ్ణి మనం నవయామినిలో దర్శిస్తాము.

కవిగాకంటె వ్యాసకర్తగా విమర్శకునిగా రామలింగారెడ్డిగారు సాహిత్య లోకానికి చిరపరిచితులు. ఆయన కవిత్వతత్త్వ విచారం చదవని సాహిత్య విద్యార్థి ఉండడు. ఈ ఉద్గ్రంథానికి బీజమైన కళాపూర్ణోదయ విమర్శనవ్యాసం ఆయన విద్యార్థిగా ఉన్నప్పుడు సంతరించబడింది. ఇది వేదము వేంకటరాయ

అధికంగా శ్రమించి క్రుంగిపోవటం. రెండవది అగ్నిసాక్షిగా పెండ్లాడిన అర్ధాంగికంటె తనను ఆశ్రయించిన అస్మాసు ఎక్కువగా ప్రేమించటం. ఈ రెండు వ్యసనాలూ లేకపోతే లక్ష్మణరావుగారు ఇంకా పది కాలాలు బ్రతికి తెలుగు వాఙ్మయాన్ని ఇతోధికంగా సుసంపన్నం చేసేవారు. నాటి పండితులు అధిక సంఖ్యాకులు మెచ్చినదీ, ఈనాటి అధిక సంఖ్యాకులు మెచ్చనిదీ లక్ష్మణరావుగారికి ఒక మచ్చ ఉన్నది. గిడుగు రామమూర్తి గురజాడ అప్పారావు పంతులుగార్లు లేవదీసిన వ్యావహారిక భాషోద్యమానికి కొమర్రాజువారు వ్యతిరేకులు. వారు గ్రాంధికభాషావాదులు. మైసూరు మద్రాసు విశ్వవిద్యాలయాల పాఠ్యనిర్ణాయక సంఘాలతోను పరీక్షలతోను వారికి సంబంధం ఉండేది. ఈ సంస్థలలోను ఇతర సాహిత్య సంస్థలలోను భాషావిషయమై జరిగిన వాదోపవాదాలలో కొమర్రాజు వారు గ్రాంధిక వాదులకు పట్టుగొమ్మగా ఉండేవారు. అయితే వారి సరళగ్రాంధిక రచనం నాడూ నేడూ స్వేచ్ఛావధులు దాటుతున్న వ్యావహారికానికంటె బహుళ జన గ్రాహ్యంగాను సరళసుందరంగాను ఉంటుందనటంలో సందేహం లేదు. చిలకమర్తివారు తమ స్వీయచరిత్రలోను, కవిత్వవేదిగారు తమ "వీరేశలింగ యుగం" లోను కొమర్రాజువారి సరళశైలిని సమర్థించినారు. స్వయంగా లక్ష్మణ రావుగారే అచ్చతెనుగు గూర్చి వ్రాస్తూ "గ్రామ్యపదములు దేశ్యములనియే మా తాత్పర్యము. వానిని గ్రంథాదులయందుపయోగింపవచ్చునా కూడదా యనుట వేరు విషయము. అది యా పదములయొక్క యోగ్యతనుబట్టి నిర్ణయింపవలసి యుండును. వానిని గ్రామ్యములనుటకు కారణమా శబ్దములు మోటుగ నుండుట, పెద్దలచే వాడబడకపోవుట. మాటలాడునప్పుడే చెవికింపుగ నుండని వానిని గ్రంథాదులయందెవ్వరు వాడెదరు? కావున చెవులకింపు గానివాని మాట యటుండ నిండు. చెవికింపై మోటుతన మేమియు లేక సలక్షణ భాషయందు పర్యాయ పదము లేనట్టి యొకానొక గ్రామపద్యము చక్కనిది యున్నయెడల నది యిది వరకు గ్రంథకారులచే వాడబడలేదన్నంత మాత్రమున దానిని పరిత్యజించుట వృద్ధి జెందుచున్న చెట్టును ద్రుంచివేయుటయే. అన్యదేశ్యపదమును వలయు నప్పుడు తీసికొనిన నేమియు దోషము లేదట! కృత్రిమ తద్భవములు పనికివచ్చు నట! స్వదేశజమైన గ్రామ్యమనగనే పనికిరాదట!" అన్న మాటలను బట్టి వారి భాషాసంస్కారదృష్టి ఎంత విశాలమైనదో మనం ఊహించవచ్చును.

చనిపోయేనాడు కూడ రచనావ్యాసంగం మానుకొనని కర్మిష్ఠి, చదువుతూ చదువుతూ చనిపోయిన విజ్ఞానపిపాసువూ ఐన లక్ష్మణరావుగారి వైయక్తికజీవి తంలో రెండు అపశ్రుతులు వినపడుతున్నవి. ఒకటి అక్క భండారు అచ్చ మాంబ సమాజసేవ చేస్తూ బిలాస్‌పూర్ ప్లేగ్‌కాంప్‌లో 1905 లో చనిపోయిన తరువాత బావగారైన భండారు మాధవరావుగారితో అభిప్రాయభేదాలు రావటం.

బావ బావమరుదులకు ఈ అంతశ్శైత్యాలు ఏర్పడటానికి కారణం చనిపోయిన అచ్చమాంబగారి వస్తువులంట. ఆమెగారి వస్తువులు ఏవోకొన్ని లక్ష్మణరావుగారి వద్ద ఉండేవట. వాటిని ఇమ్మని మాధవరావు కోరితే లక్ష్మణరావు నిరాకరించినారట. ఒక జమీందారీకి దివానుగా ఉండినవాడూ, ప్రజాసంస్థల ధనం ఒక్కపైసాకూడ సొంతంకోసం వాడుకోనివాడూ, పరద్రవ్యం లోష్ఠవతుగా చూచినవాడూ, ఐన లక్ష్మణరావుగారు అక్కగారి వస్తువులకోసం ఇంతగా ఎందుకు ప్రలోభపడ్డారు? ఇది సొమ్ముమీది వ్యామోహం కాదేమో! తనను ఇంతవాణ్ణిచేసిన అక్కగారిమీద ఉండిన ప్రేమకొద్దీ కృతజ్ఞతతో ఆ వస్తువులు స్మృతిచిహ్నంగా దాచుకోవలననే మమకారం దీనికి కారణం కావచ్చు. రెండవది తనను కనీ పెంచీ ఏడిండ్ల పిల్లికూనవలె దేశదేశాలు తిప్పి కాచి రక్షించిన తల్లిగారితో వైమనస్యం. దీనికి కారణం ఆమెగారి పూర్వాచారపరాయణత్వము, లక్ష్మణరావుగారి సంఘ సంస్కరణపు వీరాభినివేశము. లక్ష్మణరావుగారు స్త్రీవిద్య, వితంతువివాహం, అస్పృశ్యతానివారణ, కులభేదనిర్మూలనం వంటి సాంఘికసంస్కరణోద్యమాలలో పని చేస్తుంటే గంగమ్మతల్లికి నచ్చకపోయేది. ఈ సంస్కరణలు బయటితో ఆగిపోక ఇంట్లోకి ప్రవేశించేసరికి ఆమె ఊరుకోలేక పోయింది. లక్ష్మణరావుగారు తమ కూతురు అచ్చమాంబను చదివించటం విదేశాలకు పంపటం ఆమెకు నచ్చక కొడుకును విడిచి కాశీకి వెళ్ళిపోయిందట. కొడుకు చనిపోయిన తరువాతకూడ ఆమె తిరిగిరాలేదు. ఐతే తల్లీకొడుకులు జాబులు వ్రాసుకోవటం, కొడుకు తల్లికి అవసరమైన డబ్బు పంపటం మాత్రం మామూలుగా జరిగేదట.

ఇక లక్ష్మణరావుగారి ఆశయాలు వాటి సాధనకోసం ఆయన చేపట్టిన పనులు సంగ్రహంగా నివేదిస్తాను. గతశబ్దాంలో మన దేశంలో పుట్టిన మహాపురుషులు చాలమందికి భారతదేశ స్వాతంత్ర్యసముపార్జనమే ప్రధానాశయం. ఈ ప్రధానాశయ సాధనకు ఆ మహాపురుషులు వేరువేరు మార్గాలను అవలంబించినారు. ప్రాప్యమైన ఒకే పరమాత్మను చేరుకోవటానికి వివిధమతప్రవక్తలు భిన్నమార్గాలు అన్వేషించినట్లే ఈ మహాపురుషులు కొందరు ధార్మికరంగాన్ని, కొందరు సామాజికరంగాన్ని, కొందరు రాజకీయరంగాన్ని, మరికొందరు విద్యావైజ్ఞానికరంగాలను ఎంచుకున్నారు. ఆయా రంగాలలో తాము సేవచేస్తూ సరియైన వ్యక్తులను ఆయా రంగాలలోనికి ఆకర్షించినారు. కొమర్రాజువారు ప్రధానంగా విద్యావైజ్ఞానికరంగాలనూ, గౌణంగా సామాజికరంగమునూ ఆలంబనం చేసుకొన్నారు. వైజ్ఞానికవిప్లవంకోసం దేశభాషామాధ్యమంద్వారా విద్యాబోధనము, శాస్త్రీయవిజ్ఞానమూ, చరిత్ర రాజనీతి మొదలైన విషయాలు బోధించే ఉత్తమగ్రంథాలు, జాతీయోత్తేజమూ శౌర్యమూ పెంచే చారిత్రకనవలలూ జీవిత చరిత్రలు వివిధజ్ఞానకోశములైన విజ్ఞానసర్వస్వములూ ప్రచురించటం అనే

పనులు చేపట్టినారు. సామాజిక విప్లవంకోసం అస్పృశ్యతానివారణ, కులభేద నిర్మూలన, స్త్రీవిద్య, వితంతువివాహాలు సాంఘిక దురాచారాల నిర్మూలనం మొదలైన వాటిని గురించి కృషి చేసినారు.

రాజకీయాలలో బాలగంగాధర్ టిళక్‌గారిని ఆదర్శంగా పెట్టుకొన్న లక్ష్మణరావుగారి భావాలు ఎటువంటివో మనం ఊహించవచ్చు. అక్కగారితో పాటు జాతీయకాంగ్రెసు మహాసభ లన్నింటికీ వెళ్లటం, స్వదేశీవస్తువులు మాత్రమే ఉపయోగించటం, బిపిన్‌చంద్రపాల్‌ను స్వాగతించటానికి నాయనివారిని ప్రోత్స హించటం, 1907 లో నందిగామలో జరిగిన కృష్ణాజిల్లా రాజకీయమహాసభలో ప్రముఖంగా పాల్గొనటం, కుమారునికి వినాయకరావు సావర్కార్ పేరు పెట్టు కోవటం, విజ్ఞానచంద్రికా గ్రంథమండలి పక్షాన అబ్రహాం లింకన్ చరిత్రం మొట్టమొదలు ప్రకటించటం, మహమ్మదీయ మహాయుగంలో అక్బరుగూర్చి వ్రాస్తూ యూరప్ ప్రజలకు స్వాతంత్ర్యం ప్రాప్తించిన తీరు చెప్పటం మొదలైన వాటివలన లక్ష్మణరావుగారికి భారతదేశం స్వాతంత్ర్యంపట్ల ఎటువంటి అభిని వేశం ఉండేదో తెలుసుకోవచ్చు. 1905 లో జరిగిన బెంగాల్ విభజన ఫలితంగా దేశమంతటా గొప్ప ఆందోళన జరిగినది. స్వదేశీఉద్యమం తలయెత్తినది. అప్పుడు కొమర్రాజు, అయ్యదేవర, గాడిచెర్ల ముగ్గురూ కలిసి "స్వదేశమిత్రన్" సంపాదకులైన జి. సుబ్రహ్మణ్యంఅయ్యర్ ఆధ్యక్ష్యంలో 1905 సెప్టెంబరులో మద్రాసుతీరాన ఐదారువేల విద్యార్థులను సమావేశపరచి గొప్పసభ జరిపినారు. దీపావళి సందర్భంగా జాతీయనిధికోసం విద్యార్థులతో కలిసి లక్ష్మణరావు 5200 రూపాయలు విరాళాలు ప్రోగుచేసినారంటే వారి కార్యదీక్ష దేశభక్తి ఎంతప్రగాఢ మైనవో మనం ఊహించుకోవచ్చు. మద్రాసులో డాక్టర్ సి. బి. రామారావు గారి ఇంట్లో మిత్రులందరూ సమావేశమై సంఘసంస్కరణోద్యమం గురించి తీర్మానించుకోవటమూ, నాడు శ్రీనివాసయ్యంగార్ నిర్వహిస్తుండిన దక్షిణహిందూ దేశ సంఘసంస్కరణ సమితిలో చేరి రాత్రిపూట హరిజనులకు చదువులుచెప్పటం వంటి సంఘటనలద్వారా సంఘసంస్కారమూ అస్పృశ్యతానివారణం మొదలైన వాటిపట్ల లక్ష్మణరావుగారికి ఎంత అభినివేశం ఉండేదో తెలుస్తుంది. ప్రజలను విద్యావిజ్ఞాన సంపన్నులను చేయటానికీ మాతృభాషద్వారా విద్యాబోధనకూ, జాతీయవిద్యావిధానం రూపొందించటానికీ లక్ష్మణరావుగారు అహోరాత్రులు కృషి చేసినారు. అబ్రహాంలింకన్ చరిత్రవిడుదలచేస్తూ ప్రకటించిన విజ్ఞానపత్రం స్త్రీవిద్యకూ శాస్త్రీయవిద్యకూ లక్ష్మణరావుగారిచ్చిన ప్రాధాన్యం నిరూపిస్తుంది. మహమ్మదీయ మహాయుగంలో ఔరంగజేబునుగూర్చి వ్రాస్తూ అతడు తన గురు వుకు వ్రాసినలేఖను పూర్తిగా అనువదించటం లక్ష్మణరావుగారికి జాతీయవిద్యా విధానం పట్ల ఉన్న మక్కువను తెలియజేస్తుంది.

లక్ష్మణరావుగారి వద్ద సుశిక్షితులైన మహానుభావులెందరో ఉన్నారు. ఈ నాటికీ సజీవంగా ఉన్న ఆధునిక కవితాపితామహులు రాయప్రోలు సుబ్బారావు గారు లక్ష్మణరావుగారి వద్ద విజ్ఞానసర్వస్వం కార్యాలయంలో పనిచేసినవారు. కొమర్రాజువారి ప్రసక్తి వస్తే రాయప్రోలువారు ముకుళితనేత్రాలతో భక్తి ప్రకటిస్తారు. చిలుకూరి వీరభద్రరావుగారిని, భోగరాజు నారాయణమూర్తి గారిని ప్రోత్సహించినది లక్ష్మణరావుగారే. తెలుగు చరిత్రకు మౌలికమైన రూపురేఖలు దిద్దిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారూ తెలంగాణా శాసనాలనూ చారిత్రక సామగ్రినీ బండ్లకెత్తించిన ఆదిరాజు వీరభద్రరావు గారు లక్ష్మణరావుగారికి శిష్యులు. అయ్యదేవర వారి జీవితాన్ని తీర్చిదిద్దినది లక్ష్మణరావుగారే. ఈవిషయం కాశేశ్వరరావుగారే నాకు చెప్పినారు. లక్ష్మణరావుగారి మరణానంతరం 1923 నవంబరులో విజ్ఞానచంద్రికా గ్రంథమాల పక్షమున ప్రకటించిన తమ ఫ్రెంచిస్వాతంత్ర్య విప్లవము అనే గ్రంథాన్ని కాశేశ్వరరావుగారు లక్ష్మణరావుగారికి భక్తితో అంకితం చేసినారు. మహాకవి విశ్వనాథ సత్యనారాయణగారు తమ విశ్వనాథపంచశతిని కొమర్రాజు వారికి అంకితం చేస్తూ వ్రాసిన పద్యాలు ఆకీర్తికాయునికి నివాళించిన మాణిక్యదీపాలు. నవ్యాంధ్ర నిర్మాతలైన వీరేశలింగం పంతులుగారు లక్ష్మణరావుగారికి ఆదర్శగురువులు. కందుకూరివారి అడుగుజాడల్లోనే కొమర్రాజు వారు పయనించి ఆంధ్రాభ్యుదయమనే భవనానికి మరొక అంతస్తును కూర్చినారు. వీరేశలింగం పంతులు స్వీయచరిత్రం రచించుకోవటానికి పురికొల్పినది లక్ష్మణరావుగారే. పంతులుగారి కవులచరిత్ర రచనకు లక్ష్మణరావుగారు తోడ్పడటమే కాక వేటూరి ప్రభాకర శాస్త్రిగారి సహాయం లభింపజేసినారు. వీరేశలింగం గారికి ఒక్క రాజకీయాలలోతప్ప అన్నివిధాలా వారసులు లక్ష్మణరావుగారు. పంతులుగారి చరమదశలో లక్ష్మణరావుగారు సేవ చేసినారు. పంతులుగారు జబ్బుపడితే ఎగ్మూరులో తాము నివసించే వేదవిలాస్ భవనంలోనే ఉంచుకొని ఆరసికొన్నారు. పంతులుగారు చనిపోయిననాడు వద్దలేకున్నా తరువాత వచ్చి కర్మ చేసినారు. పంతులుగారు కూర్చుండి ప్రాణాలు విడిచిన కుర్చీలోనే లక్ష్మణరావుగారు 48 వ ఏట 13 - 7 - 1923 నాడు తమ దేహం చాలించటం విధి విలాసం అనుకోవలె.

ఇక లక్ష్మణరావు పంతులుగారు తెలుగు సంస్కృతీవికాసానికి ఆంధ్ర వాఙ్మయానికీ చేసిన వరివస్య మనవి చేస్తాను. కొమర్రాజువారు నాగపురంలో విద్యార్థిగా ఉన్ననాటినుండే రచనావ్యాసంగంలో నిమగ్నులైనారు. మరాఠీభాషలో వారు వ్రాసిన శతాధిక వ్యాసాలు గేయాలు ప్రహసనాల గురించి మనకు ఏమీ తెలియదు. వారు మరాఠీలో చేసినట్లు సృజనాత్మక రచనలు తెలుగులో ఎందుకో చేయలేదు. తెలుగుదేశంలో ఆపంట నాటికీ నేటికీ పూటిగా ఉన్నందున కాబోలు

లక్ష్మణరావుగారు ఆబాట విడిచిపెట్టి జాతికి విజ్ఞానం ప్రసాదించేవీ, శాస్త్రీయ దృక్పథం పెంచేవీ ఉత్తేజాన్ని కలిగించేవీ ఐనటువంటి రచనలే తెలుగులో తాము చేసినారు, చేయించినారు. నాగపురంలో చదువుకునే దినాల్లోనే లక్ష్మణ రావుగారు తెలుగుదేశం నుండి వెలువడుతుండిన పత్రికలకు వ్యాసాలు వ్రాస్తుండే వారు. రాయసం వెంకటశివుడుగారు ప్రచురిస్తుండిన 'జనానా' పత్రికలో 'విశ్వము యొక్క విరాట్‌స్వరూపము' 'విశ్వముయొక్క బాలస్వరూపము' వంటి విజ్ఞానాత్మకమైన వ్యాసాలు ప్రచురించినారు. హిందూసామ్రాజ్య పునర్నిర్మాత ధర్మ ప్రభువు ఐన ఛత్రపతి శివాజీని గురించి విదేశీయులూ ముస్లింలూ వ్రాసిన గ్రంథాలలో పక్షపాతదృష్టితో కూడిన అవకతవకలు చాలా ఉన్నవి. లక్ష్మణ రావుగారు మహారాష్ట్ర దేశంలో ఉన్నప్పుడే ఆ మహావీరుని గురించి సరియైన సమాచారం సేకరించి 'శివాజీ చరిత్రము' అనే ప్రామాణికమైన గ్రంథం తెలుగులో వ్రాసి ప్రకటించినారు (1900?). ఆ గ్రంథమూ దాని పీఠికా చదివితే లక్ష్మణ రావుగారు పడిన శ్రమ తెలుస్తుంది. సంస్కృతంలోనూ దేశభాషలలోను లభించే మౌలికసామగ్రి ఆధారంగా అప్రమాణికమైన విదేశీయుల వ్రాతలను ఖండిస్తూ ఆయన శివాజీచరిత్రం ఎంతో ఉత్తేజకరంగా వ్రాసినారు. అటువంటి చరిత్రల పఠనంవల్లనే నిర్వీర్యమైపోయిన జాతి మరల జాగృతం కాగలదని ధార్మిక విప్లవం రాగలదని లక్ష్మణరావుగారి దృఢవిశ్వాసం.

భారతదేశ చరిత్రను హిందూ మహమ్మదీయ మహారాష్ట్ర బ్రిటిష్ యుగాలని నాల్గుగా విభాగించి సమగ్రమూ నిష్పాక్షికమూ ఐన చరిత్ర వ్రాయవలెనని లక్ష్మణరావుగారు సంకల్పించినారు. మొదటి రెండు యుగాల చరిత్రలు వ్రాసి ప్రకటించినారు. మూడవదానికి కావలసిన చారిత్రక సామగ్రినంతా సేకరించినారు, కాని వ్రాయలేదు. ఇందులో మొదటిదైన 'హిందూ మహాయుగము' ఆరు ప్రకరణాలలో క్రీ.పూ. 2000 నుండి క్రీస్తు తరువాత 1200 సంవత్సరాల భారతదేశ భౌగోళిక, రాజకీయ, సామాజిక, ఆర్థిక, మత, విద్యా, కళా విషయాలకు అద్దం పట్టినారు. ఆనాటికి అచ్చైన ముఖ్యచరిత్రలన్నీ అవలోడించి అదనంగా వేద స్మృతి పురాణేతిహాసాది మూలగ్రంథాల సాక్ష్యాధారాలిస్తూ కూర్చిన చరిత్రం ఇది. ఇది 1907 లో ప్రకటితమైనది. ఈ గ్రంథాన్ని ముగిస్తూ "హిందూదేశ పారతంత్ర్యమునకు కారణములు" అనే శీర్షికతో వారు చేసిన నిర్ణయాలు వారు చేసిన సూచనలు వారి విజ్ఞానమునకూ వారి దేశభక్తికి నిదర్శనాలు. జాతిమతభేదములు, అస్పృశ్యత, నీతిబంధనముల శైథిల్యము, అనైక్యము, బాల్యవివాహములు మూలంగా జాతి నిర్వీర్యమై పోయినదన్నారు. రెండవదైన 'మహమ్మదీయ మహాయుగమును' వారు 1908లో ప్రకటించినారు. ఇదికూడ ఆరు ప్రకరణాల గ్రంథం. ముసల్మానులు భారతదేశంలో అడుగు

పెట్టిన నాటినుండి అనగా క్రీ. 664 నుండి మొగల్‌సామ్రాజ్యపతనంవరకు అనగా క్రీ.శ. 1806 వరకు భారతదేశం చరిత్రను సాధికారికంగా సమగ్రంగా సాకల్యంగా కూర్చినారు.

మహమ్మదీయ యుగచరిత్రలో చాలా సాధకబాధకాలున్నవి. ఇందులో భేదాభిప్రాయాలకూ విరుద్ధాభిప్రాయాలకూ తావున్నది. వాస్తవం చెప్పితే విరోధం చెప్పకుంటే ద్రోహం. ఆంగ్ల పారసీక భాషల్లో ఉన్న సామగ్రితో పాటు దేశభాషల్లో ఉన్న చారిత్రక సామగ్రిని పుష్కలంగా వాడుకొని లక్ష్మణరావు గారు నిష్పక్షపాతమైన వైఖరిని ప్రదర్శించినారు. సమదృష్టిని ప్రదర్శించినారు. "వైభవాదికములలో ఢిల్లీరాజ్యమును గూడ మించినట్టి విజయనగర సామ్రాజ్యమును గురించి యిప్పటి చరిత్ర గ్రంథములలో పదిపంక్తులు వ్రాయుదురు. ఇది మిక్కిలి యన్యాయము. నేనట్లు చేయనొల్లక హిందూరాజుల పౌరుషాదులను మహమ్మదీయుల పౌరుషాదులతోపాటు వర్ణించినాడను'' అన్నారు. ఇందులో వారు క్రొత్తగా 1. అనంగపాలుని చేతిలో మహమ్మద్‌గజ్నీ ఓటమి 2. పృథ్వీరాజు చేతిలో మహమ్మదుగోరీ ఏడుసార్లు ఓడిపోయి ప్రాణదానం పొందటం 3. స్థానేశ్వరయుద్ధంలో జరిగిన మోసం 4 ఔరంగజేబును ఓడించిన ఛత్రసాల్ రాజు వృత్తాంతం 5. అక్కన్న మాదన్నలచరిత్ర 6. అక్బరును ఓడించిన వీరాబాయి చరిత్రము చెప్పినారు. ఇవి కాక అక్కడక్కడ అనేక నూతనాంశాలు ప్రతిపాదించినారు. ముసల్మానుల మంచితనం చెప్పవలసినప్పుడు " అయం నిజః పరో వా" అనే భేదం పాటించక ఎక్కడగూడ పూజ్యాపూజావ్యతిక్రమం జరుగనీయలేదు. ప్రస్తుత హిందూముసల్మానులు అన్నదమ్ములని ప్రతిపాదించినారు. శ్రీకృష్ణదేవరాయల చిత్రపటానికి రూపకల్పన చేసినారు. హిందుమహాయుగం వలెనే ఇదికూడ మనదేశపు రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, మత, విద్యాకళా చరిత్రగతికి అద్దం పడుతుంది.

కొమర్రాజువారు చేపట్టిన మరొక గొప్పపని ఆంధ్రవిజ్ఞానసర్వస్వనిర్మాణం. దీనిని 1912 లో ప్రారంభించి 1915 లో ప్రథమసంపుటం 1916 లో ద్వితీయ సంపుటం 1917 లో తృతీయ సంపుటం వెలువరించినారు. ఈ సంపుటాలలో 'అ' నుండి 'అహి' వరకు శీర్షికలతోడి వ్యాసాలున్నవి. విజ్ఞానసర్వస్వం లక్ష్మణరావుగారి ప్రతిభాపాండిత్యాలకు పతాక. ఇందులో ఇతరులతో ఎన్నో వ్యాసాలు వ్రాయించటమేకాక తమకు అభిమాన పాత్రమైనవి కొన్ని, ఇతరులు వ్రాయజాలనివి కొన్ని, ఇతరులు వ్రాయనప్పుడు కొన్ని, ఈవిధంగా 35వ్యాసాలు లక్ష్మణరావుగారే వ్రాసినారు. వేరుగా ముద్రించినట్లయితే ఈ వ్యాసాలు దాదాపు 1000 పుటల గ్రంథం ఔతుంది. మరాఠీ విజ్ఞానసర్వస్వానికి కేత్కర్ మహాశయుడు లక్ష్మణరావుగారి సలహాల ప్రకారమే రూపకల్పన చేసినాడు. అంక

శ్రేఢులు, అక్షరసమామ్నాయం, అధర్వవేదం, అద్దకం, అద్దం, అధికమాసం, అద్వైతం, అనాగరిక సంఘం, అనుమానం, అభిజ్ఞానశాకుంతలం, అభినయం, అర్థశాస్త్రం, అలంకారములు, అల్లోపనిషత్తు వంటి వ్యాసాలు ఆయన బహుముఖ ప్రజ్ఞను, బుద్ధివైభవమును శ్రమనూ, విశదం చేస్తవి. ఈ విజ్ఞానసర్వస్వం నాల్గవ సంపుటం ఆంధ్రసంపుటంగా వెలువరించటానికి సాధన సామగ్రినంతా లక్ష్మణరావుగారు ఆనాడే సమకూర్చి పెట్టినారు. ఆ ప్రణాళికతోపాటు కొంత సమాచారం కూడ ఈనాటి భాషాసమితివారి ఆంధ్రసంస్కృతి అనే మూడవ సంపుటానికి పనికి వచ్చినవి. లక్ష్మణరావుగారివద్ద ఆనాడు పనిచేసిన మల్లంపల్లి వారే ఈ ఆంధ్రసంస్కృతి సంపుటానికి నిర్మాతలు. విజ్ఞానసర్వస్వం కార్య భారం లక్ష్మణరావుగారి తను మన ధనములను పీల్చివేసినది. ఈ కార్యభారం మూలంగానే వారు చిన్నవయస్సులో చనిపోయినారు. మొత్తంప్రణాళికను చూచు కుంటూ, వచ్చిన వ్యాసాలను దిద్దటమే కాక, వ్యాసాలు వ్రాస్తామని ఎంతో ముందుగా డబ్బుపుచ్చుకొని సమయానికి వ్యాసాలు పంపకపోతే అటువంటివారికి అప్పగించిన వ్యాసాలకోసం లక్ష్మణరావుగారు అనేకగ్రంథాలు చదివి ఎంతో శ్రమించి వ్రాసేవారు. లక్ష్మణరావుగారు తమ బరువును తాము మోయటమే కాక ఇతరుల బరువు కూడ మోసి క్రుంగిపోయినారు. తాము సంకల్పించిన భారతదేశ చరిత్రకోసం సామగ్రినంతా సేకరించి కూడ మహారాష్ట్రయుగాన్ని బౌద్ధయుగాన్ని వ్రాయకపోవటానికి విజ్ఞానసరస్వ కార్యభారమే ప్రధానకారణం. లక్ష్మణరావుగారి మరణానంతరం వేలూరి సత్యనారాయణగారు బౌద్ధమహా యుగం వ్రాస్తే విజ్ఞానచంద్రికాగ్రంథమాల 34 వ ప్రచురణంగా 1925 లో ప్రకటించినారు.

విజ్ఞానసర్వస్వంలోని 'అలంకారములు' అనే ఒక్కవ్యాసం చదివితేచాలు లక్ష్మణరావుగారు పడిన శ్రమ తెలుస్తుంది. సంస్కృతంలోని మూలగ్రంథాలే కాక వాటి వ్యాఖ్యానాలనూ, వాటిమీద మరాఠీ తెలుగు మొదలైన భాషల్లో వెలు వడిన టీకలనూ వివరణలనూ అనువాదాలనూ చదివి లక్ష్మణరావుగారు ఈ వ్యాసం వ్రాసినారు. మహారాష్ట్రయుగం చరిత్ర వ్రాయటానికి ఆలస్యం ఎందుకు చేస్తున్నారని గొబ్బూరు వెంకటానందరాఘవరావుగారు అడిగినప్పుడు ఇద్దరికీ జరిగిన సంభాషణసారం డాక్టరు అక్కిరాజు రమాపతిరావు పేర్కొన్నది ఇక్కడ ఉట్టంకించటం అవసరం. లక్ష్మణరావుగారి సమాధానం "అవును నేను దాన్ని పూర్తిచేయాలి. కాని నాకు ఏమాత్రం తీరిక దొరకటం లేదు. ప్రస్తుతం విజ్ఞానసర్వసం రచనలు కూర్చడంలో తలమున్కలవుతున్నాను. 'ఆంధ్ర' సంపుటానికే ఇంకా చాలా విషయాలు సమకూర్చాలి, కావలసిన సమాచారమంతా సమకూర్చటమే కష్టసాధ్యంగా ఉంది. రచనలు చేస్తామని ఒప్పుకున్న వారినుంచి

రచనలను తెప్పించటం మరింత దుర్ఘటంగా ఉంది. ఒక పెద్దమనిషి అలంకారశాస్త్రంమీద వ్యాసం వ్రాస్తానని దానికీయవలసిన ప్రతిఫలం కూడా ముందుగానే తీసుకున్నాడు. ఇప్పటికి నాలుగేండ్లు గడచినవి. కాని ఇంతవరకు ఆయన వ్యాసం పంపించలేదు. ఎన్నిసార్లు ఎన్నిఉత్తరాలో జ్ఞాపకంచేస్తూ వ్రాసివ్రాసి విసుగెత్తి పోయింది. ఇన్నాళ్ల తరువాత ఇప్పుడు ఆయనగారు వ్రాస్తాడూ-అలంకారశాస్త్రం మీద సాధికారంగా సవివరంగా తాను వ్రాసి పంప లేడట. అందువల్ల యిక ఇప్పుడు చేసేదేమీలేక అలంకార శాస్త్రమంతా నేనే చదువుతున్నాను. విజ్ఞానసర్వస్వంలో వ్యాసం వ్రాయడానికి సంస్కృతం మరాఠీ బెంగాలీ తెలుగు భాషలలో వెలువడిన వాఖ్యానాలూ శాస్త్రాలు అన్ని చదువుతున్నాను. తరువాత మహారాష్ట్రయుగం కూడ వ్రాస్తాను" ఈవాక్యాలు చదివినప్పుడు సంగ్రహాంధ్ర విజ్ఞానసర్వస్వం పని చేస్తూ ఆదిరాజు వీరభద్ర రావుగారు పడిన శ్రమ అంతా నాకు జ్ఞాపకానికి వచ్చింది. ఆ కొమర్రాజు వారి శిష్యుడే ఈ ఆదిరాజువారు కనుక గురువుగారి వారసత్వం శిష్యునికి తప్పలేదేమో అనిపించింది. అటువంటి వాళ్ళమీద కోర్టుద్వారా చర్యతీసుకోగూడదా అని గొబ్బూరివారంటే లక్ష్మణరావుగారన్న మాటలు చిత్తగించండి. "ఆయన చాల గొప్పవాడు. వారికిచ్చినందువల్ల మాడబ్బుకు గొప్ప విలువ చేకూరింది, సార్థక మైంది. అటువంటి మహామహుడి ద్వారా రచన పొందలేకపోవడం మా దురదృష్టం. ఆయనగారే వ్రాస్తే ఎంత గొప్పగా ఉజ్వలంగా ఉండునో! ఆయనగారి నిర్లక్ష్యంవల్ల తెలుగు సాహిత్యానికి గొప్పలోటు"— ఓహో! లక్ష్మణరావుగారి మనస్వితా ఎంత గొప్పది! లక్ష్మణరావుగారిని ఇంతకష్టపెట్టిన ఆ మహామహు డెవరా? అని నాకు కొంచెం ఆవేశం కలిగింది, కాని వారి సమాధానం చదివిన తరువాత కందకు లేని దురద కత్తిపీట కెందుకు? అర్థంలేని ఆవేశం నాకెందుకు అనుకున్నాను. లక్ష్మణరావుగారు హైందవ చక్రవర్తులు అనే మౌలికమైన మరొక గొప్ప గ్రంథం వ్రాసినారు. ఇది కూడ వారి తదితర చరిత్రగ్రంథాల వలె బహుళాదరం పొందినది. మల్లికార్జున పండితారాధ్యులు రచించిన శివతత్త్వ సారమును లక్ష్మణరావుగారే పరిష్కరించి ప్రథమంగా ప్రకటించినారు. గ్రంథ పరిష్కరణ పద్ధతులూ పాఠనిర్ణయ విధానాలూ తెలుసుకొనగోరేవారికి అది మార్గదర్శకము. లక్ష్మణరావుగారు గౌతమన్యాయశాస్త్రమును తెలుగులోనికి అనువ దించి, నాడు అక్కిరాజు ఉమాకాంతవిద్యాశేఖరులు నడుపుతుండిన తెలుగువాఙ్మయ పత్రికలో ప్రకటించినారు. వివిధపత్రికలలో అప్పుడప్పుడు వారు ప్రచురించినవి కొన్ని, అముద్రితాలు కొన్నిచేర్చి ఆయన మరణానంతరం 1923లో లక్ష్మణరాయ వ్యాసావళి అనే పేరుతో విజ్ఞానచంద్రికా గ్రంథమాల 31 వ కుసుమంగా ప్రక టించటం జరిగింది. ఇందులో చారిత్రకములు 6, భాషావిషయకమైనవి 3, శాస్త్ర సంబంధమైనవి 8, మొత్తం 17 వ్యాసాలున్నవి. వీనిలో ఆంధ్ర బ్రాహ్మణుల

లోని నియోగివైదికి భేదకాల నిర్ణయము, ఏకశిలానగరము ఓరుగల్లే, ద్రావిడ భాషలలోని ఉత్తమపురుష సర్వనామము, పంచాంగము, దేశభాషలలో శాస్త్ర పఠనము వంటి వ్యాసాలు వారి బహుముఖపాండిత్యానికి సునిశితమైన బుద్ధికీ మచ్చుతునకలు. లక్ష్మణరాయ వ్యాసావళి రెండవసంపుటంలో 5 వ్యాసాలున్నవి. వీటిలోని శృంగారము-పూర్వలాక్షణికులు అనే వ్యాసమొక్కటి తప్ప తక్కినవి విజ్ఞాన సర్వస్వం వ్యాసాలే. 1918 లో వారు వేమనను గూర్చి వ్రాసిన వ్యాసము 1922 లో ఆంధ్రపరిశోధక మహామండలి ఐదవ వార్షికసభ (చిత్రాడ) అధ్యక్షోపన్యాసమూ తదితర అముద్రిత వ్యాసాలూ కలిపి లక్ష్మణరాయవ్యాసావళి మూడవసంపుటంగా వేస్తే బాగుండును. మహారాష్ట్రులకూ తెలుగువారికీ ఉన్న సన్నిహితసంబంధాన్ని తెలియపరిచే రెండుమూడు మౌలికవ్యాసాలు వ్రాసినారు. అవికూడ మరల ముద్రింపదగినవి. చనిపోయేనాడు (13-7-1923) చాళుక్యుల గురించి వ్రాసినట్లు చెప్పేది లక్ష్మణరాయవ్యాసావళి మొదటిసంపుటంలో చేర్చిన "చాళుక్యులు దాక్షిణాత్యులే" అనే వ్యాసం ఐయుంటుందనుకుంటున్నాను.

లక్ష్మణరావుగారు పత్రికలలో ఏదైనా వివాదాస్పదవిషయం చర్చకు తీసుక రాదలిచితే కె. రామానుజరావు అనే మారుపేరుతోగాని లేదా తమకు శిష్యప్రాయుడైన ఆదిరాజు వీరభద్రరావుగారి పేరుతోగాని ప్రకటించేవారట. పాపం వీరభద్రరావుగారి పేరు అప్పుడప్పుడు తీవ్ర విమర్శలకు గురి అయ్యేదట. ఇటువంటి వ్యాసాలు కూడ ఒకచోట చేర్చితే బాగుండును. కె. రామానుజరావు అనే మారు పేరుతో వారు తెలుగులో ఒక సృజనాత్మక రచన కూడ చేసినారు. అది "ఫూల్‌జానీ బేగం" అనే చారిత్రక కథ. లక్ష్మణరావుగారు పరిష్కరించి ప్రకటించిన 7 శాసనాలున్నవి. ఆయన తెలుగు దేశంలో ప్రచారానికి తెచ్చిన మాటలు కొన్ని ఉన్నవి. యునివర్సిటీని విశ్వవిద్యాలయమని, ఎడిటర్‌ను సంపాదకుడని, ఎడ్యుకేషన్‌ను శిక్షణ అని, ఫలానా అనేదానికి అముక అని లక్ష్మణరావుగారే తొట్టతొలుత ప్రచారం కల్పించినారు.

గ్రంథాలయ స్థాపనమూ, గ్రంథ ప్రచురణమూ, విజ్ఞానసర్వస్వ నిర్మాణమూ లక్ష్మణరావుగారికి చాలా యిష్టమైన పనులు. నాయని వెంకట రంగారావు కొమఱ్ఱాజు లక్ష్మణరావుల కలయిక ఏ సుముహూర్తాన జరిగిందో కాని ఆంధ్ర చరిత్రకూ, ఆంధ్రవిజ్ఞానానికీ, ఆంధ్రసంస్కృతికీ, ఒక క్రొత్త మలుపు వచ్చినది. లక్ష్మణరావుగారు రంగారావుగారి వెంట తరుచుగా హైద్రాబాదు వస్తుండేవారు. హైదరాబాదు తెలుగువాళ్ళలో చైతన్యం తీసుకరావటానికి ఆనాడు ఆరాటపడిన వాళ్ళలో రావిచెట్టు రంగారావు, వేమూరు విశ్వనాథశర్మ ముఖ్యులు. వారిరువురూ నాయని కొమఱ్ఱాజు వీరిరువురూ రావిచెట్టువారింటిలో సమావేశమై 1901 లో

హైదరాబాదు నగరంలో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం స్థాపించినారు. ఆనాటి సభలో పెద్దలకు తాంబూలాలు పంచిన చిన్నవాడు ఆదిరాజు వీరభద్ర రావు. ఈ చిన్నవాడు లక్ష్మణరావుగారి శిష్యుడై గ్రంథాలయాలు గ్రంథమాలలూ నడిపి, శాసనాలు పరిశోధించి, చరిత్రలు వ్రాసి, విజ్ఞానకోశాలు స్వతరించి, తెలంగాణం చైతన్యకేతనం ఆకాశపుటంచులకు ఎత్తగలిగినాడు. తెలంగ్గాణంలో గ్రంథాలయోద్యమానికి శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ స్థాపనమే నాంది. ఆ భాషానిలయమే ఆటుతరువాత అనేక సాంస్కృతిక రాజకీయ ఉద్యమాలకు రంగస్థలమైనది. హనుమకొండలోని రాజరాజనరేంద్రాంధ్ర భాషానిలయం కూడ (1904) ఆ మహానుభావుల చేతి చలువయే. ఈనాడీ గ్రంథాలయాలు వట్టి లైబ్రరీలుగా కనబడినా ఒకప్పుడవి కదిలేవీ కదిలించేవీ ఐనటువంటి చైతన్య కేంద్రాలు.

లక్ష్మణరావుగారి మరొక గొప్పసేవ విజ్ఞానచంద్రికామండలి స్థాపన. కొమఱ్ఱాజువారు గాడిచెర్లవారు అయ్యదేవరవారు 1905 సెప్టెంబరులో కాళేశ్వర రావు గారింటిలో సమావేశమై ఆంధ్రులకు నవీనవిజ్ఞానం పంచే ఉద్దేశంతో విజ్ఞానచంద్రికా మండలి స్థాపించటానికి నిశ్చయించుకున్నారు. మరల 1906 సెప్టెంబరులో నాయనివారి ఆధ్యక్ష్యంలో సమావేశమై గ్రంథమాలకు అంకురార్పణం చేసినారు. ఈ సమావేశంలో రావిచెట్టువారు కూడ ఉన్నారు. లక్ష్మణరావుగారు ఒక అరటావు కాగితం అప్పీలు వేయించి పంచినారు. ఆ గ్రంథమాల ద్వారా దేశచరిత్రలు, జీవితచరిత్రలు, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము జంతుశాస్త్రము, భూగర్భశాస్త్రము, అర్థశాస్త్రము, చారిత్రకనవలలు వంటి ఎన్నో అమూల్యగ్రంథాలు వెలువడి తెలుగునాట విజ్ఞానప్రసారానికీ సంస్కృతీ వికాసానికీ ఎంతో దోహదం చేసినవి. లక్ష్మణరావుగారే ఈ గ్రంథాలకు సంపాదకుడు. గ్రంథాలు మద్రాసులో అచ్చైనా కార్యస్థానం హైదరాబాదులో ఉండేది. కార్యాలయ నిర్వాహకులైన రావిచెట్టు రంగారావుగారూ ఆదిరాజు వీరభద్రరావు గారూ హైదరాబాదులో ఉండటమే దీనికి కారణం. మన్సబుదారైన రావిచెట్టు రంగారావుగారు గ్రంథమాల సేవాకార్యంగా పోస్టులో పోవలసిన పుస్తకాల పార్సిళ్ళు కట్టి స్టాంపులు అంటించే పని చేసేవారంటే ఈనాటి మనం నమ్మలేము. ఇవన్నీ సత్యకాలపు కథలవలె ఉంటవి. హైదరాబాదులో రాజకీయ నిర్బంధాలు ఎక్కువైన తరువాత గ్రంథమాల కార్యాలయం 1908 లో మద్రాసుకు తరలింది. ఆదిరాజువారు కూడ మద్రాసుకు వెళ్ళవలసి వచ్చింది. ఈగ్రంథమాల పక్షమున ప్రకటితమైన తొలి గ్రంథాలు 1. గాడిచెర్లవారి అబ్రహాంలింకన్ 2. కొమఱ్ఱాజు వారి హిందూమహాయుగము 3. ఆచంట లక్ష్మీపతిగారి జీవశాస్త్రము 4. వేలాల సుబ్బారావుగారి రాణీసంయుక్త 5. కొమఱ్ఱాజువారి మహమ్మదీయ మహాయుగము

6. మంత్రిప్రగడ సాంబశివరావుగారి పదార్థవిజ్ఞానశాస్త్రము 7. వేమూరి విశ్వనాథ శర్మగారి రసాయనశాస్త్రము 8. చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర ప్రథమభాగము. 1916 నాటికి ఈ గ్రంథమాల పక్షమున లక్ష్మణరావుగారు దాదాపు 30 గ్రంథాలు ప్రకటించినారు. వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రం మొదటిభాగం 15వ ప్రచురణగాను (1911), రెండవభాగం 29 వ ప్రచురణగాను (1915) ఈ గ్రంథమాల పక్షాననే ప్రకటితమైనవి. ప్రథమ ప్రపంచసంగ్రామం మూలంగా ఈ గ్రంథమాల ఆగిపోయినది. ఐతే అయ్యదేవర కాళేశ్వరరావు దిగవల్లి వెంకటశివరావు గారల పూనికతో 1924 లో ఒకసారీ మాడపాటి హనుమంతరావు పంతులుగారి పూనికతో 1948 లో మరొకసారీ పునరుద్ధరింపబడిన ఈ మహాసంస్థ మొత్తం 46 గ్రంథాలు ప్రకటించి కాల గర్భంలో కలిసి పోయినది.

విజ్ఞానప్రసారంకోసం లక్ష్మణరావుగారు 1910 లో విజ్ఞానచంద్రికా పరిషత్తు అనే సంస్థను స్థాపించినారు. వైజ్ఞానిక, చారిత్రక, శాస్త్రీయగ్రంథాలు పాఠ్యాలుగా నిర్ణయించి పరీక్షలు నిర్వహించటం దీని ఉద్దేశం. గుంటూరు, బందరు, బెజవాడ, నరసాపురం, రాజమహేంద్రవరం, కాకినాడ, హైదరాబాదు మొదలైన పెక్కుచోట్ల పరీక్షా కేంద్రాలుండేవి. పరీక్షలలో కృతార్థులైన వారికి వారి యోగ్యతలను బట్టి రూ. 116/- నగదు, బంగారు, వెండి పతకాలు, యోగ్యతాపత్రాలు ఇచ్చేవారు. కందుకూరి వీరేశలింగంపంతులు, కట్టమంచి రామలింగారెడ్డి, పనప్పాకం శ్రీనివాసాచార్యులు, వంటివారు పరీక్షకులుగా ఉండే వారు. ఒద్దిరాజు సీతారామచంద్రరావుగారు కాంచనపల్లి కనకాంబగారు నిడుదవోలు వెంకటరావుగారు ఈ పరీక్షలలో కృతార్థులై బహుమతులు పొందినారు.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వానికి లక్ష్మణరావుగారు వ్రాసిన వ్యాసాలగురించి చెప్పినాను. ఇతరులు వ్రాసిన వ్యాసాలను దిద్ది సంస్కరించటం కూడ వారి పనియే. విజ్ఞానసర్వస్వ నిర్మాణంలో గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, వేమూరి విశ్వనాథశర్మ, ఆచంట లక్ష్మీపతి, వేలాల సుబ్బారావు, కానూరి వీరభద్రేశ్వర రావు, వేపా రామేశం పంతులు, కాశీనాథుని నాగేశ్వరరావు, మంగిపూడి వెంకట శర్మ, వేదం వెంకటరాయశాస్త్రి, మానవల్లి రామకృష్ణకవి, మల్లంపల్లి సోమ శేఖరశర్మ వంటి ఉద్దండులు లక్ష్మణరావు గారికి తోడ్పడ్డారు. రాయప్రోలు వారు కార్యాలయంలో పనిచేసినారు. లక్ష్మణరావుగారి శుశ్రూష చేసి చరిత్ర, శాసనపరిశోధనము, ప్రాచీనలిపిశాస్త్రము, పురావస్తుశాస్త్రము, వంటి గహనమైన విషయాలలో కావలసిన శిక్షణ పొంది ఆంధ్రప్రాంతంలో మల్లంపల్లివారు తెలంగాణంలో ఆదిరాజువారు ఆంధ్రుల చరిత్రను త్రవ్వి తండాలు పోసినారు. ఆయన మరణంతో 1923 లో విజ్ఞానసర్వస్వ నిర్మాణం ఆగిపోయినది. ఆనాడు ఆయన

కన్నకలలు తెలుగుభాషాసమితి పక్షమున ఒకటి, సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి పక్షమున మరొకటి, ఫలించటం ఆంధ్రుల అదృష్టం అనుకోవలెను. కొమర్రాజువారికి తెలంగాణా చాలా ఋణపడి ఉన్నది. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము రాజరాజనరేంద్రాంధ్ర భాషానిలయముల స్థాపనము, పాసుదాసు గారు బమ్మెరపోతనను ఒంటిమెట్టకు గొరగొర గుంజుకపోతుంటే ఆపి ఓరు గల్లులో స్థిరనివాసం కల్పించటం, తెలంగాణంలోని చారిత్రక వైభవమును గుర్తించటం లక్ష్మణరావుగారు తెలంగాణం వారికి చేసిన మహోపకారములు. తెలంగాణపు చారిత్రక సంపదను తొలుత గుర్తించినది లక్ష్మణరావుగారే. "ఆంధ్రదేశమును గురించియు, ఆంధ్రరాజులను గురించియు ఆంధ్రవాఙ్మయ మును గురించియు నెక్కుడు పరిశోధనలు చేసి క్రొత్త వింతలను గనుగొనదలచిన వారికి హైదరాబాదు రాజ్యమందలి తెలుగుభాగమొక బంగారు గనివంటి" దని లక్ష్మణరావుగారు చాటినారు. ఆయన ఆదేశసహకారాలతో హైదరాబాదులో "ఆంధ్రపరిశోధక సంఘము" స్థాపితమైనది. ఆయన మరణానంతరం దానిని ఆయన స్మృతిచిహ్నంగా "లక్ష్మణరాయ పరిశోధక మండలి"గ రూపొందించి నారు. దాని పక్షమున శేషాద్రిరమణకవులు, ఆదిరాజు వీరభద్రరావు, గడియారం రామకృష్ణశర్మ చిట్టచివరన రామరాజు వంటివారు నూర్లకొలది శాసనాలు తాళపత్రగ్రంథాలు విస్మృతకవులచరిత్రలు సేకరించి ప్రచురించినారు. ఈనాడీ సంస్థకూడ తెరమరుగుకు పోతున్నది. అది కాలస్వభావం. కాలం తన యిష్టం వచ్చినట్లు వ్యక్తులనూ సంస్థలనూ రంగంమీదికీ తెస్తుంది, తెరమరుగూ చేస్తుంది

విశ్వనాథ సత్యనారాయణగారు లక్ష్మణరావుగారికి నివాళించిన ఒకపద్యం. ఉదాహరించి నేనుకూడ తెర వెనుకకు పోతాను.

> "అధునాతన సంస్కృతికిని
> ప్రధాన బీజమ్మవీవు పాండిత్యపయో
> నిధి వీవు మార్గదర్శక
> సుధారుచివి నిన్ను మరువజొచ్చిరి యాంధ్రుల్"

....ooo....

# గిడుగు రామమూర్తి పంతులు

డా॥ అక్కిరాజు రమాపతిరావు. 'మంజుశ్రీ'

**వాఙ్మయసేవ—జీవితవిశేషాలు—వ్యక్తిత్వం.**

'లోకమున ఒక్కొక పనికై ఒక్కొకరు జనింతురు' అన్నారు దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు. చిన్నయసూరిని సభక్తికంగా సంస్మరిస్తూ. 'ఒక్కొక పనిలో ఒక్కొకరు రాణింతురు' అనికూడ కలిపారు సూరిగారి కీర్తిమూర్తి నుద్దేశించి చేతులు జోడిస్తూ[1].

నిజమే మరి.

ఏ దేశచరిత్రలోనైనా ఒక కాలంలో ఒక ఘట్టంలో ఒక చారిత్రకావసరాన్ని తీర్చడానికి ఒక మహాపురుషుడు ప్రభవించడం కద్దు. భాషాసాహిత్య చరిత్రలోనూ ఇది సంభవిస్తూనే ఉంటుంది. ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో అలాంటి ఘట్టం వ్యావహారిక భాషోద్యమం. ఈ ఉద్యమ ప్రవక్త గిడుగు వేంకట రామమూర్తి. ఆయనే పథ ప్రవర్తకుడు. సత్యవాది. స్థితప్రజ్ఞుడు. స్థిరసంకల్పుడు. వాఙ్మి. మేధానిధి. పండితమౌళి. సంప్రదాయపరిరక్షకుడు. అభ్యుదయగామి. ప్రజాహితైక తత్పరమతి. గిరాంమూర్తి[2].

---

1. చిన్నయసూరి శబ్దశాస్త్రవైదుష్యము సాహిత్యోపన్యాసములు
   ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ-1962.
   (చిన్నయసూరి శతవర్ధంత్యుత్సవోపన్యాసము).
2. గిరాంమూర్తి ఇటీవల మా ఇన్స్పిరేషన్ శ్రీ
   శ్రీ ప్రతిభ-గిడుగు స్మారక సంచిక-1940

పందొమ్మిది ఇరవై శతాబ్దులలో తెలుగువారి సమగ్ర వికాసంకోసం జీవితకాలాన్ని ఉద్యమంగాగడిపిన మహితాత్ములిద్దరున్నారు. వారిదృష్టి సంపూర్ణ వికాసం. సంపూర్ణ విప్లవం. సాహిత్యోద్యమాలకు సంబంధించినంతవరకు వారిద్దరూ కూడా ఆయా శతాబ్దాల అద్వితీయ ప్రతినిధులు. ఒకరుస్రష్ట. ఇంకొకరు ద్రష్ట. ఈ రెండు శతాబ్దాల మధ్య శతాబ్దం తెలుగువారి సామాజిక సాహిత్య సాంస్కృతిక వికాసంకోసం ప్రబోధించారు. ఆయన స్రష్ట. ఈయన ద్రష్ట. కందుకూరి వీరేశలింగం, గిడుగు రామమూర్తి. ఆయనది సాహిత్యోద్యమం. ఈయనది భాషోద్యమం. సాహిత్యానికీ సమాజానికి ఉండే అవినాభావ, పోష్య పోషక సంబంధాన్ని వీరేశలింగం లెస్సగా గుర్తించాడు. తన సృజనాత్మక మహాప్రతిభతో సంఘాన్నీ సాహిత్యాన్నీ ఉన్నతాదర్శాలవేపు పయనింపజేశాడు. తన పాండిత్యంతో వాఙ్మయదార్శనిక మహాప్రతిభతో సంఘాన్నీ సాహిత్యాన్నీ ఉన్నతాశయాలవైపు పయనింపజేశాడు గిడుగు పండితుడు.

గొప్పదురదృష్టం. గిడుగు పండితుడి వాదాన్ని ఆనాటి పండితులుకొందరు అపార్థం చేసుకున్నారు. వక్రవ్యాఖ్యానాలు చేశారు. వితండవాదం చేశారు. అభాస విమర్శలతో వెక్కిరించారు. స్పర్థతో ఢీకొన్నారు. ఆయన చెపుతున్న దేమిటో అర్థంచేసుకోలేదు. అథవా అర్థంచేసుకున్నా చేసుకోనట్లే ప్రవర్తించారు. వ్యావహారిక భాషావాదాన్ని ముఖ్యంగా రామ్మూర్తి పంతులనూ అపహసించారు. కొందరు పండితులు దురాలాపాలున్నూ సాగించారు. ఇదంతావాళ్లు స్వార్థసిద్ధి కోసం చేసివుండక పోవచ్చు. నిజమే. పరార్థంకోసమే ప్రతిఘటనోద్యమంసాగించి ఉండవచ్చు. కాని వాళ్లు సాగించిన ప్రతిఘటనోద్యమం అర్థరహితమని, వివేక విదూరమని ఇవాళ రుజువైంది.

ఒక విషయంమాత్రం ఇవాళ స్పష్టంగా ఒప్పుకోవాలి. తొట్టతొలినాళ్లలో రామ్మూర్తి పంతులుగారి వాదాన్ని సమర్థించినవాళ్ళు ఏ ఒకరిద్దరో తప్ప గొప్ప పండితులు కాదు. ప్రజ్ఞామహితులుకారు. వీళ్ల అసంబద్ధపు వ్రాతలుకూడా ఎదిరి పక్షంలోని భాషాభిమానులకు బాధకలిగించి వుండవచ్చు. గ్రాంథికం మృతభాష అనడం, కావ్యభాషను గంగలో కలపమనడం అజ్ఞతావిలసనం. బుర్రా శేషగిరి రావు కాని, పి.టి. శ్రీనివాసయ్యంగారు కాని, సెట్టి లక్ష్మీనరసింహంకాని, గురజాడ అప్పారావు, గిడుగురామ్మూర్తి అంత పండితులుకారు. పేరి కాశీనాథశాస్త్రి తాతా సుబ్బరాయశాస్త్రి, వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారలు సమర్థించినట్లుగా కాకుండా బుర్రాశేషగిరిరావు ప్రభృతులు వాక్కలహ పర్యవసాయి అయిన వాదానికి మాత్రమే తోడుపడిన వాళ్లయినారు.

గిడుగు పండితుడు గ్రాంథిక భాషావిద్వేషికాడు. ఆయన పుట్టిన తర్వాత శతాబ్దంలో అంతటి గ్రాంథికభాషా పండితుడు మరి పుట్టలేదు. గ్రాంథికంకోసం

అంగలార్చే వాళ్ళందరికన్నా గ్రాంథికభాషా విషయమై ఆయన విశేషంగా పరిశ్రమించాడు. సుమారు వెయ్యి సంవత్సరాల తెలుగు సాహిత్యాన్ని, భాషావికసనాన్ని ఆయన పరిశీలించినంతగా మరి ఎవ్వరూ ఈనాటి వరకూ పరిశీలించలేదేమో! కవిత్రయ మహాభారతమంతా ఆయనకు హృద్గతంగా వుండేది. నన్నయ్యగారి ప్రయోగాలన్నీ ఆయన జిహ్వాగ్రమందే వుండేవి. నన్నయ్యగారి మహాభారత పదజాలాన్ని అంతటినీ వర్గీకరణంచేసి ఆపద ప్రయోగస్వరూపాన్ని అంతటినీ ఆయన ఉపస్థితిలో వుంచుకొనేవారట. తదేకతానంగా తెలుగుభారతాన్ని ముప్ఫైసార్లకు మించి ఆ మహానుభావుడు, ఆ ప్రజ్ఞానిధి, భాషాప్రయోగదృష్టితో అధ్యయనం చేశారు. నన్నయభట్టారకుని మహాభారతం నుంచి అత్యంతాధునిక మహాకవుల ప్రయోగాలదాకా రామ్మూర్తిపంతులు గారు జ్ఞాపకం పెట్టుకొన్నారు. ఆయన జ్ఞాపకశక్తి పరమాద్భుతమైనది.

ఇంతకూ వ్యావహారిక భాషోద్యమ పరమార్థం ఏమిటి? ఈ ఉద్యమం ప్రతిపాదించే సిద్ధాంతం ఏమిటి? ఈ ఉద్యమానికి ప్రాణభూతమైన అంశాల నీ విధంగా క్రోడీకరించవచ్చు.

1. తెలుగులో లక్షణ గ్రంథాలుగా వ్యవహృతమయ్యేవికాని, వ్యాకరణాలుగా సంభావితమయ్యేవికాని పట్టుమని పాతికను మించిలేవు. ఇందులోనూ పండితులు ప్రామాణికంగా అంగీకరించేవి ఇంకాతక్కువ. అందువల్ల ఈ లక్షణ గ్రంథాలలోనూ, వ్యాకరణాలలోనూ నిర్దేశితమైన సూత్రాలను ఆధారంగా చేసుకొని ప్రాచీన, అర్వాచీన కావ్యభాషను శాసించకూడదు. తాము ప్రమాణంగావించుకొన్న లక్షణాన్ని బట్టిగాని, అనుశాసనాన్ని బట్టిగాని, ఆయా కావ్య ప్రయోగాలను పరిష్కరించకూడదు. ఆ విధంగా పరిష్కరించటం కూటకరణమనే ద్రోహమవుతుంది.

2. పోనీ ఈ లక్షణగ్రంథాలూ, వ్యాకరణాలూ ఒక సూత్ర విషయంలోకాని, ఒక నిర్దిష్ట పద ప్రయోగ విషయమైకాని ఏకగ్రీవంగా తమ మతాన్ని ప్రతిపాదిస్తున్నవా? లేదు. కేతన చెప్పినట్లు విన్నకోట పెద్దన చెప్పడు. అథర్వణుడూ అహోబలపతి అన్నిటా ఏకాభిప్రాయులు కారు. రావిపాటి గురుమూర్తి శాస్త్రీ, చిన్నయసూరీ ఏకీభవించరు. పోతనగారి ప్రయోగాలే అప్పకవి వొప్పుకోడు. కనుక ఎవరిని ప్రమాణంగా శిరసావహించాలి? ఎవరినికాదనాలి! ఈ ఇబ్బంది ఉన్నందువల్ల ఫలానివారి సూత్రాన్నిబట్టి ఈ ప్రయోగందోషం, ఆధునికు లిట్లా ప్రయోగించకూడదు అని శాబ్దికులు కవులను, రచయితలను తప్పుపట్టకూడదు.

3. లోకంలో శిష్టవ్యవహారంలో వినపడుతున్న పదం ఏదైనా ప్రాచీన కవి ప్రయోగాలలోకాని, ఆధునికుల ప్రయోగాలలోకాని కనపడుతూవుంటే,

వ్యాకరణ సూత్రాలవల్ల అది సాధితం కాకపోతే, ఆ ప్రయోగాన్ని నిరసించ కూడదు. ఏ ప్రయోగానికైనా లోకవ్యవహారం వల్లనే సాధుత్వం కలుగుతుంది. లోకవ్యవహారంలో ఉంటే ఆ ప్రయోగాలన్నీ సాధువులే. కవి ప్రయోగంవల్ల ఏ శబ్దానికైనా ఔచిత్యానౌచిత్యాలు సంక్రమిస్తాయేకాని సాధుత్వం నిర్ధారితం కాదు. కాబట్టి ఏదైనా ప్రయోగం శిష్ట వ్యవహారంలో లోకంలో వుండి అదే కవి ప్రయోగంగా కూడా కనపడినప్పుడు సాధుతమ శబ్దంగా దాన్ని అంగీకరించి శిరోధార్యంగా స్వీకరించాలి. అంతేకాని కవిత్రయ ప్రయోగాన్ని చూపితేనేగాని సాధుతాముద్ర వేయం ఆ పదానికి అనడం అవివేకం.

4. వ్యావహారిక భాషోద్యమ వాదులు యదేచ్ఛావిహార వాదులుకారు. తప్పులన్నీ ఒప్పులనీ అంగీకరించాల్సిందే అని వారెన్నడూ వాదించరు. ఒప్పులను తప్పులనకుండా ఉంటే చాలు. అదే పదివేలు వాళ్ళకు. లోకంలో కంటికి కనపడే జంగమ వ్యవస్థ అంతా స్వతస్సిద్ధంగా సర్వప్రాణి సహజంగా మారుతూ వున్నట్లే భాషకూడా మారుతూనే వుంటుంది. ఈ మార్పుకు అనేక కారణాలు దోహదకారులు కావచ్చు. భాషకు మార్పు అనేది వుండదు. అనుకోవటం శాస్త్రీయ దృక్పథంకాదు. తరతరాల భాషావ్యవహర్తల ఉచ్చారణాది కారణాలవల్ల, ఇతరేతర భాషల ప్రభావంవల్ల సామాజిక పరిణామ చారిత్రక కారణాలవల్ల ఒక భాషలో పద, వాక్య సంయోజనంలో మార్పులు అనివార్యం. అయితే ఈ మార్పు అవ్యవస్థితంగా చోటుచేసుకోదు. విశ్లేషించి చూస్తే ఈ మార్పుకి కారణమైన తీరుతెన్నులు వెల్లడవుతాయి. ఈ విశ్లేషణనుబట్టి కొన్ని నియమాలు కూడా ఏర్పరచవచ్చు.

5. వ్యావహారిక భాషా వాదాన్ని అంగీకరిస్తే మాండలిక పదప్రయోగం విభిన్నప్రాంతీయుల పరస్పర అర్థావబోధకు ప్రతిబంధక మవుతుందని కావ్యభాషా సమర్థన వాదులనడం స్పృహణీయంకాదు. మతిమంతం కాదు. కావ్యభాషలోకూడా మాండలిక పదప్రయోగం లేకపోలేదు. పాత్రోచిత భాషావాదం పేరిట లోకవ్యవహారాన్ని రూపకసాహిత్యంలో కవులు, పండితులు ఆధునిక కాలంలో అంగీకరించే వున్నారు. ఇతివృత్తోచిత భాషను పురస్కరించుకొని మాండలిక పదప్రయోగాలు అపరిత్యాజ్యాలు. అపరిహార్యాలూ. ఈ ప్రయోగాలన్నింటినీ నిఘంటువులూ, వ్యాకరణ సూత్రాలూ స్వీకరించి లక్షణ నిర్దేశాన్ని విస్తృతపరచాలి.

ఈ ఐదు అంశాలు వ్యావహారిక భాషోద్యమానికి పంచప్రాణాలు. రామ్మూర్తి పంతులుగారి వాదసారాంశమంతా ఇంతే. మరి రామ్మూర్తి పంతులు గారి వాదాన్ని గ్రామ్యవాదమని, ఆయన్ను గ్రామ్యాచార్యులని అధిక్షేపించడం అవివేక విలసితం కాదా!

ఏదో ఒక లక్షణ గ్రంథాన్నో, వ్యాకరణసూత్రాన్నో ఆధారం చేసుకొని ప్రాచీనకావ్యాలు అచ్చువేసేటప్పుడు కవి ప్రయోగాలను దిద్దబూనడం ఆకవిపట్ల అపచారమూ, తెలుగు భాషాసాహిత్యాలపట్ల ద్రోహమూకాక మరేమిటి ?

ఆత్మకూరు సంస్థానపు సాహిత్యవివాదాలలో తిరుపతి వేంకటకవులు 'దేవతలు ధర్మవర్తులు' అనే నన్నయగారి ప్రయోగాన్ని స్వీయసమర్థనంకోసం ఉటంకించగా ధర్మవృత్తులు అని దిద్దుతాంకాని ఆ ప్రయోగాన్ని అంగీకరించేది లేదు అని వివరించారుట ఆ సంస్థానపు మహాపండితులు.

విజయనగరంలో ఆనందగజపతి ఆస్థానంలో అజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారి పద్యంలో ఏదోసందేహంతోచి ప్రభువువారు క్త్వార్థకాన్ని ఉభయ కర్తృకంగా ప్రయోగించటం ప్రాచీన కవి సమ్మతమని సమర్థించగలరా అని అడిగినప్పుడు దాసుగారు మను చరిత్రం నుంచి 'నృమాంసంబు కూడైన నెట్లు భరించువాడ' అనే ప్రయోగాన్ని కనపరచగా నన్నయ్యగారి ప్రయోగం చూపితేనే తాము ఆమోదించగలమని అన్నారుట. అప్పుడు దాసుగారు శ్రమపడి నన్నయ్య భారతమంతా వెదికి రాహుకంఠంబు దెగిదేహము ధరణిబడియె అనే ప్రయోగం కనపరచినట్లుగా తమ స్వీయ చరిత్రలో ప్రసక్తం చేశారు.

కిందటి శతాబ్దపు ఉత్తరార్థ మంతానూ, ఈ శతాబ్ది మొదటిపాదం గడిచే వరకున్నూ పండితులలో ఈ ధోరణి ప్రబలంగా వుండేది. సాహిత్య విమర్శ అంటే శబ్ద సాధుత్వాసాధుత్వ చర్చగానే వాళ్ళు పరిగణించేవారు. తాము ప్రామాణికంగా ఎంచుకొనే వ్యాకరణ, లక్షణగ్రంథాల నిబంధనల దృష్ట్యా కవి ప్రయోగాలను దిద్దివేసేవాళ్ళు. ఈవిధంగా కవిహృదయం తెలియకుండా స్వీయ మతానుసారం కవి ప్రయోగాలను దిద్దివేసినవాళ్ళను రామ్మూర్తి పంతులుగారు తీవ్రంగా నిరసించారు. ఈ నిరసన ఆయన బాలకవి శరణ్యంలోనూ, ఆంధ్ర పండితభిషక్కుల భాషాభేషజంలోనూ విపులంగా దర్శించవచ్చు. ఈవిషయాన్ని ప్రస్తావిస్తూ వర్ఘుల చినసీతారామస్వామిశాస్త్రులవారు తమ వసుచరిత్ర విమర్శనంలో ఏం వ్రాశారో చూడండి.

"యతిప్రాసల నిర్బంధము సడలించుకొనుచు మహాకవులు కొంతవరకు స్వేచ్ఛనుదీసికొనియుండగా నట్టి లక్ష్యములె మూలాధారముగా గ్రహింపవలసిన లక్షణకర్తల కవి స్వేచ్ఛానుసారముగా సవరించుటలో నేమి యధికారమున్నదో తెలియకున్నది. దుష్టమగునట్టి యలవాటు వ్యాపించుటచేతనే నిజమయిన కవి ప్రయోగములు మృగ్యములగుచున్నవి." (పుట 110-1965 వ సం॥ ముద్రణం)

'నన్నయ్య ముఖ్య సత్కవిజనంబుల కావ్యములలో లేఖకులు, పాఠకాధములు కొన్నిచోట్ల ప్రమాదవశాత్తూ వదిలివేయగా జానపదులు కొందరు వాటిని

పరిష్కరించే భారాన్ని నెత్తిన వేసుకొన్నారుట. అందువల్ల ఆ పాఠాలను కవి ప్రయుక్తాలుగా మేము స్వీకరించం. మాఇష్టంవచ్చినట్లు దిద్దుతామని, అప్పకవి ప్రకటించాడు. ఈ అతిశయాన్ని రామ్మూర్తిపంతులు సహించలేక అప్పకవి పాండిత్యపు బండారాన్ని లోకానికి వెల్లడించారు.

కవి ప్రయోగాన్ని తప్పనకూడదు. వ్యాకరణాంతరంచేతనో, లక్షణ గ్రంథాంతరంచేతనో అర్వాచీన లాక్షణికుడు కవి ప్రయోగాన్ని సమర్థించవలసి వుండగా అర్వాచీన కాలంలో పుట్టిన వ్యాకరణాన్ని అనుశాసనంగా చేసుకొని ప్రాచీన కవి ప్రయోగాలను దిద్దడం అపరాధం. ఈపరిష్కృతి దుష్కృతి. దీనికి మరి నిష్కృతిలేదు. అని రామ్మూర్తిపంతులుగారు పరిష్కర్తలను విమర్శించారు. హితవు చెప్పారు.

వ్యావహారిక భాషోద్యమ వాదుల వాద సరళి ఈవిధంగా వుండగా, వ్యావహారికాన్ని గ్రామ్యమని నిందించి, దానికి పామర వ్యవహారతుల్యతను ఆపాదించి అనవసరమైన రగడను సృష్టించి నిష్ఫలమైన వాదవివాదాలు సాగించారానాటి పండితులు. జయంతిరామయ్య పంతులుగారి వంటి పండితులే సాహిత్యవేత్తలే వ్యవహారికభాషా వాదాన్ని అభిమానించే వారెవరైనా చంద్రశేఖర శతకంలోని పద్యానికి ఒక్కదానికైనా అర్థం చెప్పవలసిందని సవాలుచేయడం చింత్యం. వ్యావహారికభాషావాదానికి గ్రామ్యమన్న పేరు బెట్టినిందించి ధర్షించడం అవిచార మూలకం.[1] శిష్టవ్యావహారికం సాహిత్యప్రయోజ్యమే అనీ, తరతరాలుగా కొన సాగుతున్న సాహిత్య సంప్రదాయమదేనని వాడుకభాషావాదులు ప్రతిపాదిస్తూ వుండగా, పరిహాసంకోసం పామర భాషననుకరించిన చంద్రశేఖర శతకంలోనిభాషనే గ్రామ్యవాదులభిమానిస్తున్నారని సిద్ధాంత ప్రవచనం చేయడం ఎంత పొరపాటు! పానుగంటి లక్ష్మీనరసింహారావు ఇంకొక ముందడుగువేసి వ్యావహారిక భాషావాదులను వెటకారంచేశారు.[2] శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

---

1. "సీదగిడీలు బాపల పసిద్ది సరే పొగనిప్పు కంటసో
మాదుగులింట పోయి బతిమాలితి మూడునెగళ్ళు మందుకై
లేదనితిట్టె పాపపు కలిగ్గము యింతివరాదె దాంటోయీ
రాదట యంద్రసహ్యులు దురాత్ములు మూర్ఖులు చంద్రశేఖరా"

చంద్రశేఖర శతకంలోని ఒక మచ్చుపద్యం ఇది. ఈ భాషతో పోల్చారు జయంతి రామయ్య పంతులుగారు వ్యవహారికాన్ని, వ్యాఖ్యానం అనవసరం.

2. పానుగంటివారి పరిహాస కుశలతను చిత్తగించండి.
"కాని గ్రామ్యవాదులు బుద్ధిహీనులు కారు. పనికిమాలిన పట్టుదలచే వారి బుద్ధి రాణింపకున్నది." న్యాయానికి ఈఅభిప్రాయం గ్రాంథికవాదులకే సమగ్రంగా అనువర్తిస్తుందని చెప్పవచ్చు. అయితే ఇది రుజువుకావడానికి అర్ధశతాబ్ద కాలం వ్యర్థమైంది.

వజ్రాయుధాన్ని ధరించివచ్చారు గ్రామ్యభాషా విధ్వంసానికి. న్యాయమే. వారు కవీంద్రులు కదా !.

"బాగా ఆలోచిస్తే శాస్త్రజ్ఞానం కంటే ప్రయోగవిజ్ఞానమే కవిముఖ్యం. కనక కవికి నూటికి తొంభై వంతులు లక్ష్యజ్ఞానమున్నూ తక్కిన పదివంతులు లక్షణ జ్ఞానమున్నూ వుండడం ఆవశ్యకమని చెప్పక తప్పదు" (కథలు-గాథలు ప్రథమభాగం. పుట 816) అన్నారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు. రామ్మూర్తి పంతులుగారు కోరింది ఇదేగదా. వ్యావహారిక భాషావాదమంతా ఆధారపడింది ఈసూత్రం మీదనేకదా. అయినప్పుడు రామ్మూర్తి పంతులుగారి వాదాన్ని జయంతి రామయ్యపంతులుగారి సారథ్యంలో ఆంధ్ర సాహిత్యపరిషత్తు నిరాక రించడంలో ఔచిత్యం కనపడదు. కేవలం స్వపక్షాభినివేశమే ఈ వాద వివాదాలకు ప్రోత్సాహకారణమై వుంటుందనుకోవాలి.

గ్రాంథికవాదులింకొక ముఖ్య విషయాన్ని కూడా విస్మరించారు. లేదా వాదధోరణిని అపమార్గంలోకి ప్రవేశపెట్టారనుకోవాలి. వ్యావహారిక భాషా వాదులు తమవాదం ముఖ్యంగా వచన రచనకు వర్తించేది అని పదే పదే స్పష్టం చేశారు. కావ్యరచన చేసేవాళ్ళు వాళ్ళ ఇష్టం చొప్పున నిర్వహించుకోవల్సిందగా కోరారు. వచనరచనకు నిర్బంధ గ్రాంథికం ప్రతిబంధకం అనేది వ్యావహారిక వాదుల మతం. పైన ఈ గ్రాంథికానికి ఒక ప్రమాణమంటూ లేదు. ఒక పండి తుడి గ్రాంథికాన్ని ఇంకొక పండితుడు ఆమోదించడు, పరస్పరం విజిగీషతో తమపక్షమే ప్రామాణికమంటూ పెనుగులాడుతారు. కాబట్టి తమకు సముచితమైన భాషలో లౌకిక విషయాలను, విజ్ఞానశాస్త్రాలను శిష్ట జనవ్యవహారికంలో రచించ దలచుకొన్న రచయితలను ఆటంకపరచకండి. ఆ రచనలను నిరసించకండి. దోషారోపణం చెయ్యకండి. వాళ్ళను నిరుత్సాహపరకండి అని మాత్రమే వ్యావ హారికోద్యమ నిర్వాహకులు కోరారు. పాఠశాలల్లోనూ కళాశాల స్థాయిలోనూ నిర్బంధ గ్రామ్యానికి ప్రవేశం కల్పించడమే వ్యావహారికవాదుల ఉద్యమ పర మార్థమని గ్రాంథికవాదులారోపించారు. అందువల్ల ఆ ప్రయత్నాలకు విఘాతాలను కల్పిస్తూ గ్రాంథికాభిమానులు గొప్ప ఆందోళన సాగించి కృతకృత్యులైనారు. "కృతకభాషలో రచించిన గ్రంథాలేకాని వ్యావహారిక భాషలో రచించినవి బడులలో చదువకూడదని పరిషత్తువారు పట్టుపట్టి ప్రభుత్వమువారిచేత శాసనము చేయించి నారు." (మిథ్యాపవాదము. పుట 26) అని రామ్మూర్తి పంతులుగారు వ్యథ చెందారు.

ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ వ్యావహారిక భాషలో రచితమైన పుస్తకాలు పాఠ్యాలుగా అభ్యనుజ్ఞ పొందితే తెలుగు భాషా సాహిత్యాలు గుర్తించలేనంతగా పతనావస్థను పొంది అనాగరికమై

వివేక భ్రష్టసంపాతానికి ఉదాహరణమై సర్వనాశనం జరుగుతుందని గ్రాంథిక భాషావాదులు అపోహచెందారు. జయంతి రామయ్య పంతులుగారివంటి పెద్ద మనిషి, గొప్ప పండితుడు, న్యాయాధిపతికూడ ఈ విషయమై ఎంత అపార్థానికీ భయాందోళనలకు గురి అయినాడో తలచుకుంటే ఎంతో విచారం కలుగుతుంది. ఆ రోజుల్లో దేశీయులెవరైనా పొందగలిగిన అత్యంత ఉన్నతిని న్యాయశాఖలో పొంద గలిగిన ఘనత తెలుగువారిలో జయంతి రామయ్య పంతులు గారికే దక్కిందని చెపుతారు. చెన్నపట్నంలోనే ప్రథమస్థాయి న్యాయనిర్వహణాధికారి పదవిని ఆయన అధిష్ఠించారు. 'ధర్మాసనంబందుండి ఆంగ్లేయులకు కూడా తగవు తీర్చినయట్టి ధర్మమూర్తి' అనే ప్రశంసను కూడా పొందారు. అయినా గ్రాంథిక వ్యావహారిక వివాదవిషయంలో ఆయనతీర్పు సబబైనదిగా కన్పించదు. పక్షపాత యుతంగావుంది. ఈ గ్రామ్యవాదుల ఉద్యమం తెలుగు దేశానికి ఫ్రెంచి విప్లవాన్ని మించిన విధ్వస్తకారణమవుతుందని ఆయన వ్రాశారు. శిష్ట వ్యావహారిక మన్నమాటనే ఆయన వినిపించుకోలేదు. ఆయనగారేకాదు. ఆ పక్షంలో వాళ్ళెవ్వరూ తత్త్వజిజ్ఞాసతో రామ్మూర్తి పంతులుగారి సిద్ధాంతాన్ని అర్థం చేసుకోవడానికి యత్నించలేదు. రామ్మూర్తి పంతులుగారే ఇట్లా వ్రాశారు. "కల్పలతా సంపాదకులు బ్రహ్మశ్రీ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనులవారికి మేము కొనియాడుచున్న వ్యవహారిక భాష యిష్టమయినది కాదని కొందరు భ్రమపడుతున్నారు. సాంఖ్యాయనులవారు వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజములో చేరినవారే. వారికి అనిష్టమైనవి అపశబ్దాలున్నూ గ్రామ్యములును; అవి మాకూ అనిష్టమే. శిష్టుల నోటను అట్టివి రావు-హాస్యానికితప్ప. హాస్యమందవి ఉచితమే. వావిలకొలను సుబ్బారావుగారేమి, పానుగంటి లక్ష్మీనరసింహారావు గారేమి, కూచి నరసింహంగారేమి, చిలకమర్తి లక్ష్మీనరసింహం గారేమి, కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారేమి, జయంతి రామయ్యపంతులుగారేమి, కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారేమి, రామ్మూర్తి పంతులుగారి వాదాన్ని సరిగా బోధపరచుకోలేదనవలసి వస్తుంది.[1] పూర్వకవులుగాని,అర్వాచీనకవులుగాని లోకాన్ని ప్రమా

---

1. "భాషాతత్త్వ జిజ్ఞాస భాషాచరిత్ర జిజ్ఞాస మన ఆంధ్రపండితులకు లేనేలేదు. లోకములోని శిష్టుల వాడుకనుబట్టి లౌకికభాషకు అనుశాసన మేర్పడవలెనని అనేకులకు తెలియదు. కనుక మనతెలుగు భాషకు తెలుగు గ్రంథములకు ఇట్టి దౌర్భాగ్యము పట్టినది. ఉపదేశకులు, మార్గదర్శకులు, ఆచార్యులు తత్త్వదూరులయినప్పుడు లోకమునకు అపరిమితమయిన హానికలుగునని మనము జ్ఞప్తియందుంచుకోవలెను. భాషాతత్త్వమెరుగనివారు భాషాపండితులు కాజాలరు. అట్టివారు తాము మోసపోయి ఇతరులను మోసపుచ్చి లోకమునకు చాలా కీడు చేస్తున్నారు. దురుద్ధిచేత కాదు అజ్ఞానముచేత.—పండిత భిషక్కుల భాషాభేషజం, పు. 121.

ణంగా అంగీకరిస్తూ ప్రయోగించిన శబ్దాలను తప్పులనవద్దని ఆయన కోరారు. పూర్వ,అర్వాచీన లాక్షణికులు, పండితులు తప్పులన్న పదప్రయోగాలనెన్నిటినో రామమూర్తి పంతులుగారు పూర్వకవి ప్రయోగాల ద్వారానే సమర్థించిచూపారు. ముఖ్యంగా భారత కవుల ప్రయోగాలు శిరోధార్యాలేకదా. యని, ప్రాసస్థానాల్లో బద్ధమైనవే మాకు కావాలని పండితులు మొండిపట్టు పట్టుకొని కూచుంటారు కాబట్టి సాధ్య మైనంతవరకు అటువంటి ప్రయోగాలేచూపారు. తమ బాలకవి శరణ్యంలో సుమారు నూటఅరవై పూర్వ కావ్యాలనుంచి భారతం మొదలుకొని గోపీనాథ వేంకటకవి రచనలవరకూ ఆయా ప్రయోగాలనుచూపి లక్షణ గ్రంథాల వ్యాకరణసూత్రాల అసమగ్రతను ఎత్తిచూపారు. ఆధునిక కవుల పదప్రయోగ వైచిత్రిని ఆధారం చేసుకొని భాష ఎటువంటి మార్పులకులోనవుతూ వచ్చిందో శాస్త్రీయంగా నిరూపించారు.

ఆధునిక తెలుగుదేశంలో తెలుగుభాష విషయమై తెలుగు సాహిత్య విషయమై, స్వరతత్వ శబ్దతత్వ నిరూపణ పూర్వకంగా కృషిచేసిన పండితుడు మరి ఒకరులేరు. ఆయన్ను మించగల వారిమాట ఎందుకు ?

ఈ వ్యావహారిక భాషోద్యమంలో ఆయన ఏకాంగి వీరుడిలాగా పోరాడ వలసివచ్చింది. పందొమ్మిది వందలపదిదాకా ఆయనకేఉద్యమంతో ఏమీ సంబంధంలేదు. పందొమ్మిది వందలనభైలో ఆయన పరమపదించారు. ఈ ముప్పై సంవత్సరాల కాలం ఆయన పండిత వీరులతో పోరాడవలసి వచ్చింది. పది సంవత్సరాలలోనే ఆయన పక్షం చాలా బలపడింది. ఆకాలంలోని గొప్ప పండితులెందరో రామ్మూర్తి పంతులుగారి వాదాన్ని సమర్థించారు. పేరికాశీనాథ శాస్త్రి, తాతా సుబ్బరాయశాస్త్రి, వాసా సూర్యనారాయణశాస్త్రి, వజ్ఝల చినసీతా రామస్వామిశాస్త్రిగారి వంటి మహాపండితులు రామ్మూర్తి పంతులుగారి ఉద్య మానికి బాసట అయినారు. ఆటుతర్వాత తరంలో వేటూరి ప్రభాకరశాస్త్రి, వేటూరి శివరామశాస్త్రి, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి వంటి పండితులెందరో ఆయన వాదాన్ని సమర్థించారు. చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు పూర్తిగాసమర్థించారు.వేదం వేంకటాయశాస్త్రిగారివంటి పండితప్రభువు ఆయన వాదాన్ని ప్రత్యాఖ్యానం చేయలేక పోయినారు. ఈ విషయాన్ని నిరూ పించడమెలా? అంటే-ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజానికికాని, మిథ్యాప వాదానికికాని-ఈరెండూ వేదం వేంకటాయశాస్త్రిగారిని గురించే, ఆయనగారి విమర్శలోని ఔద్ధత్యాన్ని, అనౌచిత్యాన్నిగూర్చి, అసామంజస్యాన్నిగూర్చి రామ్మూర్తి పంతులుగారు ప్రతి విమర్శచేసిన రచనలు-వేదం వేంకటాయ శాస్త్రిగారు తమ సమాధానం ఏమిటో ప్రకటించలేదు. ఈ తన విమర్శకు వేంకటాయశాస్త్రిగారి సమాధానం వుంటే తాముశిరసావహించి తమపత్రికలోనే

ప్రకటిస్తామనికూడా రామ్మూర్తిపంతులుగారు శాస్త్రిగారికి తెలియజేశారుట. రామ్మూర్తి పంతులుగారి విమర్శ వెలువడింతర్వాత ఇంచుమించు తొమ్మిది సంవత్స రాలు వేంకట్రాయశాస్త్రిగారు జీవించివున్నా, పండితభిషక్కుల భాషాభేషజం, మిథ్యాప వాదాలలో తమపై రామ్మూర్తిపంతులుమోపిన అభియోగాలకు వెంక ట్రాయశాస్త్రిగారు సమాధానంచెప్పలేదు. అసలు గమనించవలసిన ఇంకొక విషయంకూడా వుంది. అంతరాంతరాలలో వేదంపండితులవారు రామ్మూర్తి పంతులుగారి వాదానికి సుముఖులే. రామ్మూర్తి పంతులుగారి వాదాన్ని, సిద్ధాం తాన్ని వెంకట్రాయశాస్త్రిగారు సమర్థించారనికూడా రుజువుచేయవచ్చు. వేంక ట్రాయశాస్త్రులవారు సాటిలేని మేటి పండితులు కాబట్టి రామ్మూర్తి పంతులుగారి సిద్ధాంతంలోని ఔచిత్యం వారు వెంటనే గ్రహించగలిగారు. "ఔచిత్యము సర్వో త్కృష్ట ప్రమాణము" అని వేంకట్రాయశాస్త్రిగారు తమ గ్రామ్య భాషా ప్రయోగనిబంధనం ప్రారంభించడం గమనార్హం. వెంకట్రాయశాస్త్రులవారు వ్యావహారిక భాషావాదాన్ని అంగీకరించారనడానికి ప్రబలతరమైన ఆధారం ఒకటి వుంది. అది ఏమంటే, శాస్త్రులవారు 1898 వ సంవత్సరంలో కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి ఆంధ్ర ప్రసన్నరాఘవంపై చాలా తీవ్రమైన విమర్శ ప్రకటించారు. పరిమాణంలో మూలగ్రంథాన్ని మించిపోయింది. ఈ విమర్శ ముద్రణలో మూడువందల ఇరవైనాలుగు పుటల పరిమాణం ఆక్రమించింది. ఈ ఆంధ్రప్రసన్నరాఘవ విమర్శలో వెంకటరత్నంపంతులుగారికి తెలుగు రాదని, సంస్కృతం తెలియదనీ విమర్శిస్తూ 2,568 తప్పులు చూపారు శాస్త్రి గారు. ఈ విమర్శను పురస్కరించుకొనే రామ్మూర్తిపంతులుగారు పండిత భిషక్కుల భాషాభేషజాన్ని వెలువరించారు. అటుతర్వాత మరిపదిహేను సంవత్స రాలకు అంటే 1913 వ సంవత్సరంలో వెంకట్రాయశాస్త్రులవారు శృంగార నైషధానికి సర్వంకష వ్యాఖ్యను వెలువరించారు. ఈవ్యాఖ్యానంలో శ్రీనాథకృత లక్షణ విరుద్ధ ప్రయోగాలను శాస్త్రిగారు సమర్థించే ప్రయత్నం కొంతలో కొంత చేస్తూ లక్షణ గ్రంథాలలోనూ వ్యాకరణాలలోనూ అవ్యాప్తి, అతివ్యాప్తులుండ వచ్చునని అంగీకరించారు. ఆ తర్వాత మరి పదమూడు పధ్నాలుగు సంవత్స రాల తర్వాత ప్రకటించిన ఆముక్తమాల్యద సంజీవనీ నామకవ్యాఖ్యానంలో శ్రీకృష్ణదేవరాయలవారి లక్షణ విరుద్ధ ప్రయోగాలన్నింటినీ ఆయనకు పూర్వు లైన, అర్వాచీనులైన మహాకవుల ప్రయోగాలఆధారంతో సమర్థించి నిష్కృష్టం చేశారు. ఇది ఎంత ఆహ్లాదకరమైనవిషయం. లోకాన్ని పరమప్రమాణంగా వేంకట్రాయశాస్త్రులవారు స్వీకరించడం, సువ్విపాటలను కూడా శ్రీకృష్ణదేవ రాయలవారి ప్రయోగసమర్థనం విషయంగా ఆయన స్వీకరించిచూపారు. అన్నిటికన్నా పరమానందకరమైన విషయం, శ్రీకృష్ణదేవరాయలవారు "వ్యావ

హారికాంధ్రభాషాపరినిష్ఠితుడు" అని శాస్త్రిలవారు కవిరాయలవారికి యోగ్యతా పత్రాన్నిచ్చి భూషించారు. చతుర్థాశ్వాసంలో నూట ఇరవైనాలుగో పద్యాన్ని కాలునిదున్న అనేపద్యంప్రసక్తంచేస్తూ వ్యావహారిక భాషాప్రయోగమిది అంటారు శాస్త్రులవారు. ఇంతేకాదు. అనిరుద్ధచరిత్రం. దశావతారచరిత్రం, బద్దెననీతిసార ముక్తావళి, కళాపూర్ణోదయం, నృసింహపురాణం, భోజరాజీయం, మనుచరిత్ర, పారిజాతాపహరణం, కువలయాశ్వచరిత్ర, కాశీఖండాలనుంచి ఆముక్తమాల్యద ప్రయోగాలను సమర్థించారు శాస్త్రులవారు. "ఇట్టిరూపము శిష్టసమ్మతము; ఇట్లు అనేక మహాకవి సమ్మతమగుటంబట్టి యాడజ్ఞోపమును సాధువుగా గొనందగును; ఇది ఎట్లుసాధువు ? ప్రాచుర్యముచేత సాధువు అని సమాధానము; అనేక మహాకవి ప్రయోగవిద్ధము; ఆంధ్ర కవుల సమాసశాస్త్రోల్లంఘనములో చేరుచున్నది; వీనిని మహాకవులెందరో ప్రయోగించారు; వాఙ్మయమున నెమకుదుమేని ఈ పదసముచ్ఛయమునకు ఇంకనెన్ని ప్రయోగములు దొరకునో? దీనిని ఆంధ్ర మర్యాదనుట ఎట్లు ?" ఈవిధంగా సాగింది వేంకట్రాయశాస్త్రులవారి వ్యాఖ్యానం మరి వారు రామ్మూర్తిపంతులుగారి వాదాన్ని సమర్థించారుకారు అనడం ఎట్లా ?

"లోకము, లోకముతోపాటు వారున్ను మారిపోయినా వారి శబ్దశాస్త్రము మారదు. లోకవ్యవహారము ఎలాగున్నా శబ్దాలు శాస్త్రములో చెప్పినట్టే ఉండ వలెనట" అని రామ్మూర్తి పంతులుగారి విమర్శకు గురిఅయిన పండితులవలె కాకుండా వేదం వేంకట్రాయశాస్త్రిగారు సంజీవని వ్యాఖ్యానం రచించేనాటికి వ్యావహారిక భాషావాదాన్ని సమర్థించేవారే అయినారు. మరిరెండు సంవత్సరాలకే వారు స్వర్గతులైనారు. లేకుంటే రూపకాలలో పాత్రోచిత భాషను అంగీకరించి నట్లే పఠన పాఠనాదుల్లో వ్యావహారికాన్ని కూడా అంగీకరించే వుందురు. కనీసం వ్యావహారికం అపరిహార్యమూఅపరిత్యాజమూ అని అయినా నిర్ద్వంద్వంగా ప్రకటించి వుండేవారు.

"బలాత్కారముగా నయినా ప్రజలందరికీ చదువువచ్చేటట్టు చేస్తేనేకాని స్వరాజ్యవ్యవహారము సాగదు. ప్రజలందరూ గ్రాంథికాంధ్ర భాషాపండితులు కాలేరు. వాడుకభాష వారికి నేర్పితే చాలును. వాడుక భాషలోనే అన్ని విషయము లను గురించి కావలసినంత జ్ఞానము సంపాదించవచ్చును" అన్నది రామ్మూర్తి పంతులుగారి హితోపదేశం. ఇంకా వారిట్లా అన్నారు.

"అది లోకమునకు హితమయినదనే నమ్ముతున్నాను. అన్ని దేశముల లోను సదాచారముగ నున్నదే నేనుపదేశిస్తున్నాను. మన తాతలనాటి వరకున్ను మనదేశమందు కూడా బహుకాలము మనపూర్వులు అట్లే ఆచరించినారు. అందుకు నిదర్శనముగా లిఖిత పుస్తక భాండాగారములందు వ్యావహారిక భాషలో రచిం

చిన గ్రంథములు నానా విషయములను గురించి పండితులు వ్రాసినవే వేల కొలదిగా నున్నవి".

"ఆంధ్రులను విద్యావంతులను చేయడానికి నా మతము అంగీకరించే ట్లయితే ఒక మాసము రోజులలో సాధ్యమవుతుంది. ముందుగా వ్యావహారిక భాషలో మీ కరపత్రాలనన్నిటిని అచ్చొత్తించండి. ఆ తరవాత తెలుగు అక్ష రాలూ గుణింతమూ ప్రతివారికీ నేర్పడానికి గ్రామానికొక ప్రచారకుణ్ణి ఏర్పాటు చేయండి. అక్షరాలూ గుణింతమూ మామూలు తెలివితేటలు గలవాడు నేర్చుకోవ డానికి వారము పదిరోజులకన్నా ఎక్కువ పట్టదు. ఎప్పుడైతే అక్షరాలూ గుణిం తమూ వచ్చాయో ఆ క్షణమునుంచీ మీ కరపత్రాలు మొదలయినవి చదువుకో గలుగుతాడు. ఇంతకన్న దేశములో విద్య వ్యాపింపచేయడానికి సులభమార్గము లేదు. మీరీ పనికి పూనుకోవలెను. ఈ విధముగా బాల్కను రాష్ట్రాలలో యుద్ధము అయిపోయిన తర్వాత చేసినారు. నేను ఆ విషయమంతా చదివినాను. బాల్కను రాష్ట్రాలలో ఆరు మాసాలలో విద్యాశూన్యత అంతా తొలగిపోయింది.

దీన్నిబట్టి ఆలోచిస్తే నాటి సంప్రదాయ పండితుల మొగ్గు జమిందారీ వ్యవస్థవైపూ రామ్మూర్తిపంతులుగారి వాదం ప్రజాస్వామిక వ్యవస్థవైపూ అనడం తేటతెల్లం కావడంలేదా? ప్రజాస్వామిక వ్యవస్థలో అది సువ్యవస్థీకృతమయ్యే దాకా ఎన్ని దోషాలు, ఎన్ని లోపాలు వున్నప్పటికీ ఫ్యూడల్‌వ్యవస్థకన్నా ఎన్నో రెట్లు వాంఛనీయమన్న విషయం బుద్ధిమంతులు ఒప్పుకొంటారు.

వాస్తవానికి రామ్మూర్తి పంతులుగారు నిర్వహించిన వ్యావహారిక భాషో ద్యమం ధర్మాలు, ఆశయాలు ప్రజాసామాన్య విద్యా విజ్ఞాన వికాసం ఉద్దేశించి వాటినే లక్ష్యంగా పెట్టుకోగా పండితులు ఆయన వాదంవల్లదేశానికి హాని కలుగు తుందని ప్రచారం చేయడం అవిమృశ్యకారితయేకదా!

వాక్య నిర్మాణంలో వాక్య సంయోజనంలో, వాక్యాంత విరామ సంద ర్భంగా ఒక చట్రంలో, ఒక ఆకృతిలో, ఒక శైలిని అనుసరించడమే గ్రాంధిక మనీ, విషయాన్ని విశదంగా స్పష్టంగా విన్యసిస్తూ సూటిగా ప్రాసంగిక రీతికి చేరువుగా ఉద్దిష్ట విషయానికి అక్షరాకృతి కల్పించడం గ్రామ్యమనీ నిర్ణయించడం పరిహాసాస్పదం కాదా!.

శబ్ద సాధుత్వా సాధుత్వాలు వ్యాకరణ నియమ నిబంధనలూ లక్షణ గ్రంధాల అను శాసనాలూ ఇవన్నీ ఇలా వుండగా గ్రాంధిక భాషాభిమానులు వ్యావహారిక భాషోద్యమానికి అనివార్యమైన దోషంగా మాండలిక పద ప్రయో గాన్ని, ఆ పద ప్రయోగ అపరిహార్యతను చూపడం పరిపాటి. రచయిత శక్తి సామర్థ్యాలను బట్టి ఉద్దిష్ట విషయాన్ని బట్టి తన శైలిని రూపొందించుకొంటాడు.

గ్రాంథిక శైలినే అనుసరించేవారికైనా, పద్య కావ్యరచనచేసే వారికే అయినా మాండలిక పదప్రయోగం తప్పేదికాదు. పదప్రయోగమే కాదు పదవాక్య స్వరూప సంధానం కూడా ఆయా రచయితల ప్రాంతీయభాషా నైసర్గిక వ్యవస్థను వ్యక్తంచేస్తూ ఉండడం సహజం. శబ్దరత్నాకరంలో బహుజన పల్లివారి అర్థ వివరణలలో దక్షిణాది తెలుగు నుడికారం కనపడుతుంది. వేదం వెంకట్రాయ శాస్త్రిగారి రచనలలో నెల్లూరి మాండలికం వాసనలు అనుభవైకవేద్యం. పుదూరి సీతారామశాస్త్రిగారి పెద్దబాల శిక్షలో నెల్లూరు, మద్రాసు నుడికారం చేరింది. అది ఒకప్పుడు నిఖిలాంధ్ర దేశంలోనూ ప్రాథమిక తరగతులకువాచక పుస్తకంగా వుండేది. వీరేశలింగంపంతులు రచనలలో గోదావరి మాండలికం వుంటుంది. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి కథలు-గాథలులో గోదావరి మాండలిక భాష ప్రయుక్తం. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి సృజనాత్మక ప్రతిభ అంతా తత్ప్రాంతీయ శిష్ట వ్యావహారిక ప్రయోగ వైభవమే. అయినా ఆయన సాహిత్యం రసాస్వాదనం కలిగించడం లేదని ఎవరైనా అనగలరా? విశాఖ, విజయనగర ప్రాంతీయమైన పదప్రయోగ బాహుళ్యంగల 'కన్యాశుల్కం' అఖిలాంధ్ర దేశాన్ని అలంకరించిందిగదా! అదిన్నీకాక వ్యక్తంచేయవలసిన అభిప్రాయాన్నిబట్టి, విషయగౌరవాన్ని బట్టి, లోకంలో వినిమయంలో ఉన్న పదాన్ని వదిలిపెట్టిన సమానార్థకాన్నో, పర్యాయపదాన్నో సద్యఃస్ఫూర్తితో ఎంత గొప్ప రచయిత అయినా ప్రయోగించడం కష్టం.

"వాడిక తప్పించుకోవలెనంటే ప్రాణాలు బిగబెట్టుకొని వ్రాయవలెను."

"వాడికలో నున్న శబ్దము ఎంత అపరిహార్యమో ప్రకటించిన వారైనారు" అని రామ్మూర్తి పంతులుగారు కూచి నరసింహం పంతులు, శ్రీపాద కృష్ణ

మూర్తి శాస్త్రిగారల ప్రయోగాలను చూపుతూ వ్యాఖ్యానించారు[1]

1873 వ సంవత్సరంలో చిన్నయసూరిది అక్షరగుచ్ఛమనే పుస్తకం ప్రకటితమైంది. ఇది బాలశిక్ష వంటిది. ప్రాథమిక తరగతులలో చదువుకొనే బాలబాలికలకు నీతులు బోధించే పుస్తకం. ఇందులోని భాష మాండలిక పద ప్రయోగ సహితంగానే వుంది[2].

"చదువవలసిన పుస్తకములన్ని మరువక యెత్తుకొని దఱితప్పక బడికి బొమ్ము"

"పోయి తరగతిలో నీ తావున నిండు కుదిరిక గలిగి కూర్చుండుము"

"ఒజ్జలు పాఠము లడుగు చుండగాగాని చెప్పుచుండగాగాని పరాకులేక వినుము"

"ఒజ్జల సెలవులేక తరగతి విడిచి యెట్టిపనికిగాని పోకుము."

"తోడి బాలకులతోడ జగడము చేయక యెప్పుడును మైత్రిచేయుము" మచ్చుకివి కొన్ని వాక్యాలు. అందులో కొన్ని ప్రయోగాలు మాండలికాలే. పుస్తకాలు యెత్తుకొని బడికిపోవడం, నిండు కుదిరిక, సెలవులేక, జగడము చేయక మొదలైనవి. అన్నిటికన్నా చిత్రం. పరాకు అన్న పదానికి శబ్దరత్నాకరంలో తత్పరత, ప్రమాదము అని రెండర్థాలు మాత్రమే ఉన్నాయి. చిన్నయసూరి ఉద్దిష్టార్థాన్ని లోకంనుంచే గ్రహించాడన్నమాట. పరాకు సేయుట పాడిగాదురా

1. "శ్రీ జయంతి రామయ్య పంతులుగారి వలెనే నేనును గ్రాంధికభాషయందపార మైన యభిమానము గలవాడను" అని ప్రకటించుకొన్న ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు,రామయ్యపంతులుగారి బాల్యవిద్యాభ్యాసాన్ని గురించి చెబుతూ "ఆదినములలో పలకలు పలకపుల్లలు లేనికారణమున తాళపత్రములపై నినుప గంటములతో వ్రాయుచుండెడివారు 'అన్నాడు(జయంతిరామయ్య పంతులుగారిని గూర్చిన సంస్మరణోపన్యాసం తెలుగు వైతాళికులు సం3-1979 ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీప్రచురణ)

'పలకపుల్ల' అనే ప్రయోగం అచ్చంగా మాండలికం ఉత్తరాంధ్రలో. పుడక అని అంటారు. తక్కిన ఆంధ్రదేశమంతా బలపమని ప్రచుర వ్యవహారం. కాలికి బలపం కట్టుకోవడం అనేది నుడికారం, చిలకమర్తి వారు కూడా తమగణపతి నవలలో బలపమనే అన్నారు. హంసవింశతిలో బలపమనే ఉంది. గోదావరి మాండలికంలో పలకపుల్ల అనికూడ వ్యవహారంలో ఉండి వుంటుంది. కాబట్టి మాండలిక ప్రయోగం వ్యావహారిక భాషావాదానికి అపకారాపాదకంకాదు. శ్రీపాదకృష్ణమూర్తిగారివంటిగొప్ప పండితకవి మహాభారతాంధ్రీకరణంలో అనేక మాండలిక పదాలను ప్రయోగించి ఆయాచోట్ల ఆయా పదాలకు అర్థవివరణం చేసినట్లు విమర్శక వాఖ్యాతలు తెలిపారు.

2. చిన్నయసూరి అక్షరగుచ్ఛము శ్రీ నిడుదవోలు వెంకటరావు 5-10-1980 ఆంధ్రపత్రిక ఆదివారం సారస్వతానుబంధం.

పరమపురుష వరదా-అని త్యాగరాజ స్వామి అనుగ్రహించి ఉంటాడు. త్యాగ రాజ స్వామిని కాదంటారు గ్రాంధికులు!. "దేశభాషలో తమకేమీ సంబంధము లేనట్టు దేశభాష గుడ్డి పండితులకు గుత్తకిచ్చివేసి, తాము కళ్ళుమూసుకొని ఊరుకొన్న నాగరకులు మరి ఏదేశమందైనా క్రీ.శ. ఇరవైయో శతాబ్దమందు న్నారా? ఏమి కర్మము? ఏమి పాపము! తెలుగు భాషకు తెలుగువారికి ఏమి ఇంత దుర్గతి పట్టినది! దేశస్థులభాష, దేశమందున్న శిష్టులభాష గ్రామ్యమట? పండి తులకైనా బాగా రానిది గ్రాంథికభాషట! అయ్యో! దేశభాషా! నిన్నుతృణీక రించడముచేత గదా నూటికి పదిమందైనా తెలుగక్షరాలు వచ్చినవాళ్ళు దేశములో లేకపోవడము, చదువు నేర్చిన వాళ్ళయినా తెలుగు పుస్తకము ముట్టుకోకపోవ డము ఇంగ్లీషు పుస్తకాలే ఎప్పుడూ చదవడము సంభవించినది. ఇకనైనా తెలుగువారు కండ్లువిప్పి చూతురా!" (భాషాభేషజం పు. 84) అని రామ్మూర్తి పంతులుగారు బాధపడ్డారు.

తెలుగువాళ్ళు కన్నువిప్పరు. ఎందుకు విప్పుతారు! కళ్ళుమూసుకొని కాల క్షేపం చేస్తూవుంటేనే తమకు సుఖంగా కాలం జరిగిపోతున్నది. లేకుంటే రామ్మూర్తి పంతులుగారీ వాక్యాలురాసి అరవై సంవత్సరాలు గడిచిపోయినవి. కదా! అయినా ఆయన పుస్తకాలు విశ్వవిద్యాలయాలలో అస్పృశ్యాలు. ఇప్పుడు అస్పృశ్యత పాటించకూడదన్న విషయాన్నైనా తెలుగు విద్వాంసులు గమనిం చారు కాని వ్యావహారికభాషకు మాత్రం వెలి ఇదివరలోలాగానే వుంచారు. నూరు సంవత్సరాలకు మించి అప్పకవీయాన్నీ, బాల వ్యాకరణాన్నీ చదువుతున్నారు. చదివిస్తున్నారు. కాని విశ్వవిద్యాలయాల అత్యుత్తమస్థాయి తరగతులలోనైనా గిడుగువారి గ్రంథాలను అధ్యయనం చేయించరు. దురదృష్టం. అప్పకవీయం వల్ల, బాలవ్యాకరణంవల్ల సాహిత్య విద్యార్థుల అభివ్యక్తి సామర్థ్యం కొంచెం కూడా వికసించదు. గిడుగువారి గ్రంథాలు చదివితే భాషాసాహిత్యాలను గూర్చి మేలిమి అయిన పరిజ్ఞానం కలుగుతుంది. భావవ్యక్తీకరణ సామర్థ్యం తప్ప కుండా పెంపొందుతుంది. వ్యాకరణమంటే ఏమిటో, లక్షణ గ్రంథాల అధికార పరిధులేమిటో, తెలుసుకోగలుగుతారు విద్యార్థులు. పాలనాభాషగా ఉన్నతవిద్యా బోధన మాధ్యంగా తెలుగు అత్యంత శక్తిమంతమైన పటిష్ఠమైన సాధనంగా రూపొందవలసిన ఈ సమయంలో మన ఇదివరకటి నిఘంటువులు, వ్యాకరణాలు అంతగా సహాయకారులుగావు. పండితులము కాము అనుకొనే వారి గ్రాంథిక భాష ఇప్పుడు ఉపయోగపడదు. ఆ గ్రాంధికభాషా స్వరూపాన్నైనా వారు ఇదమిత్థంగా నిర్ణయించలేరు.

"ఒకరికి సాధువైనది మరొకరికి అసాధువు. అంతా పండితులే. అంతా విమర్శకులే. వారిలో వారికేమి వివాదాలు పుట్టినప్పుడు ఎవరిమాటలు లోకులు

పాటించవలెనో తెలియదు." (మిథ్యాపవాదం-పు. 46) అని పాతకాలపు పండితులను గూర్చి రామ్మూర్తిపంతులుగారు వ్యాఖ్యానించారు. ఇది అక్షరాలా యథార్థం. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిని విమర్శిస్తూ కవి సార్వభౌములైన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు "వీరి కవిత్వములో గ్రామ్యము గ్రాంధికమును తూచివేసినట్లుండును" అని విమర్శించారు. గ్రామ్యానిదే ప్రాథమ్యం అన్న విషయాన్ని కవిరాజులు విస్మరించలేదు. ఈ శతాబ్ది ప్రథమపాదం గడిచేవరకు ఇంచుమించుగా సాహిత్య విమర్శఅంతా పరస్పర దోషారోపణలతోనే సాగింది.

తెలుగు భాషాసాహిత్యాల పూర్వపుణ్యంవల్ల తెలుగువారి అదృష్టం వల్ల గిడుగు రామ్మూర్తి 1863 వ సంవత్సరం ఆగస్టునెలలో 29 వతేదీ జన్మించారు.

గిడుగువారి స్వస్థలం గోదావరి జిల్లాలోని అమలాపురం తాలూకా ఇందుపల్లి గ్రామం ఎనిమిది తొమ్మిది తరాల కిందట నుంచీ వారు ఇందుపల్లిలో స్థిర నివాసం ఏర్పరచుకొన్నారు. పద్దెనిమిదో శతాబ్ది ప్రారంభంనుంచి గిడుగువారు ఇందుపల్లిలో నివాసంగా వుంటున్నట్లు తెలుస్తున్నది. ఆగ్రామం కరణీకం గిడుగువారిదే.

వీరి మూలపురుషులలో ఇప్పటికి తెలిసినంతవరకు గిడుగు నూకరాజుగారు పద్దెనిమిదో శతాబ్ది ప్రారంభంలో ఇందుపల్లిలో వుండేవారని తెలుస్తున్నది. వీరి వంశంలో జోగిరాజుగారు, వీరి ఏడుగురి కుమారులలో మూడోవారైన అంతర్వేది అనే ఆయనకు సుబ్బయ్యగారు ఏకైక పుత్రుడు. ఈయనకు ముగ్గురు కుమారులు. వెంకయ్య, వీర్రాజు, మాణిక్యం గారలు. ఇందులో మధ్యవారైన వీర్రాజుగారికి వెంకట రామమూర్తి ఏకైకపుత్రులు. మళ్ళీ రామ్మూర్తిగారికి నలుగురు కొడుకులు. రామ్మూర్తి పంతులుగారి పెద్దకొడుకైన సీతాపతిగారు, మా తాతగారి తాతగారి తాతగారి నుంచి మా వంశవృక్షం మాకు తెలుసు అని రాశారు. అంటే సీతాపతిగారి తాతగారి తాతగారి తాతగారే నూకరాజుగారు సత్సంప్రదాయాలను పాటిస్తూ లౌకికమైన పేరు పెంపులను గడిస్తూ సాటివారిలో ఘనులన్న కీర్తిని సంపాదించుకొన్నారు గిడుగువారు. కస్తూరి శివశంకరశాస్త్రిగారనే గొప్ప సంస్కృత విద్వాంసులు రాజమహేంద్రవరంలో సంస్కృత పండితులుగా ఉద్యోగించినవారు తమ చిన్నతన మంతా ఇందుపల్లిలోనే గడిపినవారు. గిడుగువారి బంధుజాలంలోనివారు, గిడుగువారిది చాల పవిత్రమైన కుటుంబం. ఇందుపల్లిలో గిడుగువారి ఇళ్లలో విద్యాదానం, అన్నదానం అవిచ్ఛిన్నంగా సాగుతుండేవి అని రాశారు తమ స్వీయచరిత్రలో.

1852 వ సంవత్సరంలో గోదావరికి ఆనకట్ట నిర్మించకముందు ఇప్పటి ఉభయగోదావరి జిల్లాలలో కూడా మెట్టభూముల వ్యవసాయమే వుండేది. నీటి

సౌకర్యం ఉండేదికాదు. వర్షాలు అనుకూలంగా కురిసినప్పుడు పంటలు పండవల సినవి గాను లేకుంటే ఎండవలసినవిగాను వుండేవి అని వీరేశలింగం తన స్వీయచరిత్రలో రాశారు. ఆరోజుల్లో తరచుగా అనావృష్టి, దుర్భిక్షం, కరువు కాటకాలవల్ల ప్రజలు బాధలుపడుతూ వుండేవాళ్ళు.

గోదావరికి ఆనకట్టకట్టి కాలువలు నిర్మించక పూర్వం గిడుగు వీర్రాజు గారు ఉద్యోగాన్వేషణ నిమిత్తం ఇందుపల్లిని విడిచి విశాఖపట్నం ప్రాంతాలకు తరలి వెళ్ళారు. ఆనాటి విజయనగర సంస్థానంలో ఆయనకు సముద్దారు పని దొరికింది. అంటే రెవిన్యూ ఇన్‌స్పెక్టరు ఉద్యోగం.

ఉద్యోగం దొరికి జీవితం స్థిరపడినతర్వాతనే ఆయన వివాహం చేసు కున్నారు. ఆయన ఇల్లాలు పోడూరి సీతాపతిగారి కుమార్తె వెంకమ్మగారు. విజయ నగరం ఉత్తరాన వంశధారానదీ తీరంలోని ముఖలింగ క్షేత్రానికి సమీపంలో ఉన్న పర్వతాలపేటలోనే గిడుగు రామ్మూర్తి జన్మించారు. అక్కడే ఆయన శైశవం గడిచింది. వీరి చిన్నతనంలో విక్రమదేవవర్మగారు సహాధ్యాయి. బాల్య సఖులున్నూ. పన్నెండేళ్ళు వయసువచ్చే వరకూ రామ్మూర్తి గారు పర్వతాల పేటలోనే విద్యాభ్యాసం చేశారు. రామ్మూర్తి పంతులుగారికి ఇద్దరు చెల్లెళ్ళు ఉండే వారు. ఆయనపుట్టిన మూడేండ్ల తర్వాత ఒకచెల్లెలు, మరి ఆరు సంవత్సరాల తర్వాత ఇంకోచెల్లెలూ పుట్టారు. ఆయనపెద్దచెల్లెలు చాగంటివారి కోడలు. రెండో చెల్లెలు కాశీపట్నంవారి కోడలు.

రామ్మూర్తి పంతులుగారికి ఎనిమిదోఏట విజయనగరంలో ఉపనయనం జరిగింది. తండ్రి వీర్రాజుపంతులుగారు భారతభాగవతాలపట్ల ఎంతో అభిమానం కలవారు. పన్నెండేళ్ళ వయసు వచ్చేసరికే రామ్మూర్తికి తెలుగు భారతమంతా బాగా పరిచయమైంది.

1875 వ సంవత్సరంలో వీర్రాజుగారికి చోడవరం బదిలీ అయింది. ఆయన అక్కడకు వెళ్ళి ఉద్యోగంలో స్థిరపడక ముందే స్వర్గతి చెందారు. అప్ప టికి రామ్మూర్తిగారికి పన్నెండేళ్ళవయసు. మరివేరే ఆస్తిపాస్తులు, అండదండలు లేవు. రామ్మూర్తిగారి తల్లి వెంకమ్మగారు కొడుకుని, ఇద్దరు కూతుళ్లను వెంట బెట్టుకొని విజయనగరం చేరి ధైర్యంతో నిబ్బరంతో సంసారం నెట్టుకొనివచ్చింది. ఇందుపల్లిలో ఉన్న కొబ్బరితోటల నుంచి కొద్దిగా రాబడి వస్తుండగా ఎంతో కష్ట పడి జాగ్రత్తగా ఆ పిల్లలను పెంచి పెద్దచేసింది ఆ దొడ్డ ఇల్లాలు. పెద్దకూతురి వివాహం వీర్రాజుగారే చేశారు. రామ్మూర్తి చదువు సాగాలి. రెండోపిల్ల పెళ్ళి కావాలి.

విజయనగరంలో హైస్కూలులో చేరాడు రామ్మూర్తి 1875లో. హైస్కూలు తరగతులలో గురజాడ అప్పారావు రామ్మూర్తికి సహపాఠి. ఆ నాటి విజయనగర కళాశాల ప్రధానోపాధ్యాయులైన చంద్రశేఖరశాస్త్రి గురజాడ అప్పారావును, గిడుగు రామ్మూర్తిని ఎంతో అభిమానిస్తూ ప్రత్యేకించి ఇంటి దగ్గరకూడా పాఠాలు చెపుతూవుండేవారు. లోయర్ ఫోర్త్, అప్పర్ ఫోర్త్, ఫిఫ్త్, మెట్రిక్యులేషన్ క్లాసులు నాలుగూ పూర్తిచేసుకొని 1880 వ సంవత్సరం రామ్మూర్తి పంతులు స్కూలు చదువు పూర్తిచేశాడు. పైచదువులు చెప్పించటం నాచేతకాదు, ఏదైనా ఉద్యోగంలో ప్రవేశించి సంసారనిర్వహణం చేయవలసిందే అని చెప్పింది తల్లి. 1878 వ సంవత్సరంలోనే రామ్మూర్తిపంతులుకి వివాహం కూడా అయింది. భీమునిపట్నంలో కందికొండ రామదాసు గారనే ఆయన ఇతరులతో కలసి వాటాదారుగా ఓడవ్యాపారం చేస్తుండేవారు. రామదాసు గారి కూతురు అన్నపూర్ణమ్మగారిని రామ్మూర్తిపంతులుకిచ్చి పెళ్ళిచేశారు.

1880 వ సంవత్సరం మెట్రిక్యులేషన్‌లో కృతార్థత సంపాదించి రామ్మూర్తి విశాఖపట్నం వెళ్ళి కలెక్టరాఫీసులో ఉద్యోగం కోసం ప్రయత్నించాడు. ఆరునెలలు ఉమ్మేదువారీగా పనిచేసిన తర్వాత రెవెన్యూ ఇలాకాలో ఏమీ ఖాళీలు లేవు ఏంచెయ్యం? అన్నారు అధికారులు. విద్యాశాఖవారికి దరఖాస్తు పంపుకొన్నాడు రామ్మూర్తి. విజయనగరానికి సమీపంలో ఉన్న కోనాడలోనూ గంజాం జిల్లాలో పర్లాకిమిడిలోనూ ఉపాధ్యాయ ఉద్యోగానికి ఖాళీలున్నాయి. కోనాడలో మిడిల్ స్కూలు ఉపాధ్యాయపదవికి జీతం పాతిక రూపాయలు. పర్లాకిమిడిలో జమీందారుగారి ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయ పదవి జీతం ముప్ఫై రూపాయలు. ఏ ఉద్యోగం కావాలో కోరుకోవల్సిందని విద్యాశాఖాధికారులడిగారు. రామ్మూర్తి పంతులుగారి తల్లికి, కొడుకు కోనాడలో బడిపంతులుగా వుండడమే ఇష్టం. అయినా రామ్మూర్తి పర్లాకిమిడి ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయుడిగా చేరడానికే ఉత్సహించాడు. బంధువులందరికీదూరంగా ఉండవలసివచ్చినా మన్యప్రాంతమైనా రాకపోకలకు కష్టమైనా వెళ్ళి పర్లాకిమిడిలో రాజావారి ఉన్నతపాఠశాలలో రామ్మూర్తి గారు ఉపాధ్యాయులుగా చేరారు. ఐదు రూపాయలు నెలకు ఎక్కువ జీతం రావడమంటే ఆరోజుల్లో స్వల్పవిషయం కాదు. ఆర్థికమైన సమస్యలు ఇబ్బందులు రామ్మూర్తికి తెలియనివికావు.

1880 వ సంవత్సరంలో ఆయన ఉద్యోగంలో చేరారు. అప్పటికాయనకు నిండా పదిహేడు సంవత్సరాలకూడా లేదు వయసు. ఆ సంవత్సరమే రెండో చెల్లెలి పెళ్ళికూడా చేశారు. ఇంకా తమ ఇల్లాలు కాపరానికి రాలేదు. తల్లిని, అత్తారింటికింకావెళ్ళని రెండో చెల్లెల్ని తీసుకుని పర్లాకిమిడి వెళ్ళి అక్కడి వాస్తవ్యులైనారు పంతులుగారు.

పర్లాకిమిడిని 1936 వ సంవత్సరంలో వదిలిపెట్టారు. వ్యాసుల వారు కాశీని వదిలిపెట్టినట్లు. ఆ సంవత్సరం కొత్తగా ఏర్పడుతున్న ఒరిస్సారాష్ట్రంలో పర్లాకిమిడిని చేర్చడం తెలుగువాళ్ళు పర్లాకిమిడి తాలూకాను ఒరిస్సారాష్ట్రంలో చేర్చకూడదని ఆందోళన సాగించారు. అయినా అక్కడి తెలుగువాళ్ల కోర్కె ఫలించలేదు. అధర్మంగా అన్యాయంగా తెలుగువాళ్ల హక్కులకు భంగకరంగా పర్లాకిమిడిని ఒరిస్సా రాష్ట్రంలో చేర్చినందుకు నిరసనగా రామ్మూర్తి పంతులు గారు పర్లాకిమిడిని పరిత్యజించి రాజమండ్రి వచ్చేశారు.

పర్లాకిమిడిలో పంతులుగారు యాభైఆరు సంవత్సరాలు నివసించారు. అక్కడ ఇల్లు కట్టుకున్నారు. పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు. సంస్థానాధిపతుల ప్రాపకాన్ని గౌరవాన్ని కూడా పొందారు. అయినా ఏనాడూ ఆత్మ గౌరవానికి పీసమెత్తు వ్యతిరేకతను కూడా సహించేవారు కారు. చాలా పట్టుదల గలవారు. తాము సంకల్పించిన విషయంలో తాము నమ్మిన సిద్ధాంతంలో అవసరమైనప్పుడైనా అనివార్యమైనప్పుడైనా రాజీధోరణిని ఎంతమాత్రమూ అంగీకరించేవారుకారు. పర్లాకిమిడి హైస్కూలులోనూ, ఆ తర్వాత ఆ హైస్కూలు కళాశాలగా వృద్ధిచెందినతర్వాతను మొత్తం ముప్పై ఒక్క సంవత్సరాలు ఆ విద్యా సంస్థలో అధ్యాపకత్వం నిర్వహించారు పంతులుగారు. ఇంగ్లీషు బోధించడానికి పాశ్చాత్యులైన కాండ్లర్, ఆలివ్‌వంటి మహా విద్వాంసులు వచ్చి అక్కడి కళాశాలలో ఉద్యోగం చేశారు. మంగు శ్రీనివాసరావుగారు కళాశాల ప్రధానాధ్యాపకులుగా ఉండేవారు. రామ్మూర్తి పంతులుగారితో సంప్రదించకుండా ఆయన కళాశాల వ్యవహారాలేవీ నిర్వహించేవారుకారు. ఆ కళాశాలకు ప్రధానాధికారి రామ్మూర్తిపంతులే ఆయన అధికారానికి మాటకు ఎదురుండేవి కావు. ఆయన మకుటంలేని మహారాజు.

ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడిగా చేరినా ఆయన మనస్సంతా ఉన్నతవిద్యా యోగ్యతలు సంపాదించడంపైనే కేంద్రీకృతమైఉండేది, గురజాడ అప్పారావులాగా తానుకూడా ఎఫ్. ఎ, బి. ఏ. కావాలని ఎంతో ఉత్సహించేవారు. అయితే మారుమూల ఏజన్సీ ప్రాంతంలో దూరంగా ఉండడంవల్ల ఆయన కోర్కె వెంటనే ఫలించిందికాదు. అదిన్నీకాక వారిదృష్టి సవరభాషను నేర్చుకోవడంమీద మగ్నమై వుండటంవల్ల కూడా పై పరీక్షలు చదవడానికి పూనుకోలేదువారు. అయినా 1892 నాటికి బి. ఏ. పరీక్షలో రెండుభాగాలు అంటే సంస్కృతమూ, ఇంగ్లీషు పూర్తిచేశారు. 1894 సంవత్సరంలో పర్లాకిమిడి ఉన్నత పాఠశాలను ద్వితీయశ్రేణి కళాశాలగా రూపొందించాలన్న కోర్కె రాజా వారికి కలిగింది. రామ్మూర్తి పంతులు బి. ఏ. పూర్తిచేస్తేనే కాని కళాశాలలో

అధ్యాపకత్వానికి అర్హులుకారు. అందువల్ల ఆయన తదేకదీక్షతో చరిత్రను అధ్యయనంచేసి 1896వ సంవత్సరం చెన్నరాష్ట్రానికంతకీ ప్రథమశ్రేణిలో ద్వితీయుడిగా బి. ఏ. పరీక్షలో కృతార్థులైనారు. ఈ పరీక్షకోసం రాత్రి తెల్లవార్లూ చదువుతూనే వుండేవారని రామ్మూర్తి పంతులుగారి కుమారులు సీతాపతిగారూ, శిష్యులు కాళ్ళకూరి సూర్యనారాయణగారు పంతులుగారి జీవిత చరిత్ర రాస్తూ పేర్కొన్నారు. రాష్ట్రమంతటికీ సర్వ ప్రథముడిగా కృతార్థ సాధించలేకపోయినామని పంతులుగారు చాలా విచారించారుట. వీరితోపాటు పరీక్షకుకూర్చుని ఆయేడు సర్వ ప్రథముడిగా కృతార్థులైన ఆర్. నారాయణయ్యర్ ఐ. సి. ఎస్. కూడా అయి హైకోర్టు జడ్జిపదవి అలంకరించినట్లు రామ్మూర్తి పంతులు జీవిత చరిత్ర రచించిన కాళ్ళకూరి సూర్యనారాయణగారు రాశారు. తాము కళాశాలలో చదివిన ప్రత్యక్ష విద్యార్థిగాకాక స్వయంగా చదువుకొని పరీక్షరాసిన విద్యార్థి కాబట్టే తమకు సర్వ ప్రాథమ్యస్థానం రాలేదని రామ్మూర్తి పంతులుగారు బాధపడ్డారుట.

హైస్కూలు తరగతులకు బ్రిటిషుదేశ చరిత్రం, హిందూదేశ చరిత్రం బోధించేవారు పంతులుగారు. కళాశాల తరగతులు వచ్చిన తర్వాత గ్రీసు, రోముదేశ చరిత్రలు ఇంటర్మీడియట్ తరగతులకు బోధించేవారు. చెన్న రాష్ట్రమంతటిలోనూ రామ్మూర్తి పంతులుగారిలో గ్రీసు రోముదేశ చరిత్రలు బోధించే అధ్యాపకులు మరి ఏ కళాశాలలోనూ లేరని ఆ రోజుల్లో అనుకొనేవారని వీరి శిష్యులైన తాపీధర్మారావు తమ స్వీయచరిత్రలో రాశారు. రామ్మూర్తి పంతులుగారికి విద్యార్థుల పట్లవుండే ప్రేమాభిమానాలు వారిపట్ల ఆయనచూపే ఆదరణ, కోపగించుకున్నారా వాళ్లపట్ల కనపరచే సాధింపు స్వభావం, తాపీ తమ స్వీయచరిత్రలో విపులంగా రాశారు. చిలుకూరి నారాయణరావుగారు రామ్మూర్తి పంతులుగారి శిష్యులే. పంతులుగారి సంస్మరణ సంచిక ప్రతిభలో 'నాగురువు'గా రంటూ రామ్మూర్తిపంతులను గూర్చి రాసిన విషయాలు పంతులుగారి పట్టుదల స్వభావాన్ని మహనీయతను చక్కగా వెల్లడిస్తున్నాయి.

రామ్మూర్తిపంతులు సవరభాషా విషయంలో చేసిన కృషి జగద్విదితం. నాగరకతకు దూరమై కొండల్లోకోనల్లో జీవిస్తున్న ఆదిమజాతి ప్రజల విద్యా విజ్ఞాన వికాసాలకోసం ఆయన తన జీవితాన్నంతా అప్పగించారు. వాళ్లకోసం తమ శక్తియుక్తులను కాలాన్ని ధనాన్ని వినియోగించారు. సవర భాషా సముద్రాన్ని చుళుకించిన అగస్త్య మహర్షివారు. ఇటీవలి కాలంలో అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయనుంచి సవర భాషావాక్య నిర్మాణంపై పరిశోధన చేసిన స్టాన్‌లేస్టరోష్టా అనే విద్వాంసుడు తమ పరిశోధన వ్యాసాన్ని "ముండార కుటుంబ భాషాతత్త్వ పరిశోధకులలో అగ్రగణ్యులైన రామ్మూర్తి పంతులుగారి

స్మృత్యర్థం అంటూ అంకితం చేయడం రామ్మూర్తి పంతులుగారి సవర భాషా కృషి ప్రపంచ వ్యాప్తంగా మన్నన పొందటానికి నిదర్శనం. ఆనాడు పారిస్ విశ్వవిద్యాలయంలో భారతీయ భాషా విద్వాంసుడైన (మహారాష్ట్రం బోధించే వారుట) యూల్స్‌బ్లాక్ రామ్మూర్తి పంతులుగారి సవర భాషాకృషి నెంతగానో మెచ్చుకున్నారు. లండన్ విశ్వవిద్యాలయాచార్యులైన స్ట్రేజర్ ప్రపంచ ప్రఖ్యాత భాషాశాస్త్రవేత్త డేనియల్‌జోన్సు, భారతీయ భాషా కుటుంబ పరిచయ సర్వస్వం కూర్చిన సర్ జార్జి గ్రియర్‌సను భారతీయ పురాచారిత్రక లిపి విజ్ఞానశాఖా ప్రధానాధికారి అయిన హూల్జ్ పండితుడు, భారతీయ భౌగోళిక జాతులు తెగలు గూర్చి అనేక సంపుటాలు ప్రచురించిన థర్‌స్టన్ పండితుడు, భారతదేశ చరిత్రను రచించిన విఖ్యాత పండితుడు విన్సెంట్‌స్మిత్, రామ్మూర్తి పంతులు గారి భాషా చారిత్రక పురాతత్త్వ కృషివల్ల లబ్ధి పొందినవాళ్లే. పంతులుగారి కృషిని ప్రశంసించినవాళ్లే.

సవర భాషలోని పదజాలాని కంతటికీ ప్రకృతి ప్రత్యయ విభాగంచేసి శోధించారు పంతులుగారు. ఆ భాషాతత్త్వాన్నంతా సాధించారు. సవర భాషకు సంబంధించి వ్యుత్పత్తి సహితమైన రెండు నిఘంటువులు కూర్చారు. భాషా బోధినిని ప్రసాదించారు. సవర భాషలోని అనేక పదాలకు ప్రత్యయాలకు దాని సజాతీయభాషలైన గుటోబ్, పరేంగ్ ఖాసీ భాషలతో తులనాత్మక పరిశీలన చేసి పద పట్టికలు కూర్చారు. ఈ పనిని పంతులుగారు తప్ప మరెవ్వరూ చేయ లేరు. ఇట్టి శబ్దశాస్త్ర పారంగతులు హిందూదేశంలో మరి ఒకరులేరు" అని వడ్డాది అప్పారావుగారు పంతులుగారి స్మృత్యంక సంచిక ప్రతిభలో పేర్కొనడం పంతులుగారి కీర్తిమూర్తికి సరియైన నివాళి. వారితో పెద్దలుకాని పిన్నలు కాని ప్రసంగిస్తున్న సందర్భంగా వారంటూ వుండేవారుట. "నాకు సంస్కృతము రాదు. నేను పండితుడను కాను. నేను వైయాకరణిని కాను. మల్లెపువ్వుల పరిమళాన్ని కూడా అధఃకరించే వినయ సౌరభం కాదా ఇది! పంతులుగారు పతంజలి వంటి వ్యాకరణ జ్ఞానం కలవారు. వారు జీవించివున్న ఆ చివరి సంవత్సరాలలో కూడా నిత్యం కాశికను, కాశికా వివరణను, పంజికను, మహాభాష్యాన్ని పరిశీలిస్తూనే వుండేవారట. వారి సంస్కృత వ్యాకరణ పాండిత్యం అపారం. వారికి సిద్ధాంత కౌముదిలోని పంక్తులు, అనేక సూత్రాలకు వ్యాఖ్యానంలోని పంక్తులు ముఖస్థమై వుండేవి. భాష్యంలోని పస్పశాహ్నికం చాలాభాగం హృత్కవిలి. అని వడ్డాది అప్పారావుగారు పంతులుగారిని చివరరోజులలో బాగా ఎరిగివున్న వారు రాశారు. కంపారిటివ్ ఫైలాలజీలో ఆయనకున్న పాండిత్యం అసదృశమైనది. ఆయనతో సాటిరాగల పండితులెవరూ ఆరోజుల్లో లేరంటే అతిశయోక్తి కాదేమో అంటూకూడా అప్పారావుగారు రాశారు. పంతులుగారు కొద్ది నెలల్లోనే

పరమపదిస్తారనగా న్యాసంలోని 'యే లోకయాత్రా హేతవో భాషాశబ్దాః తై రేవ లౌకికత్వం ప్రసిద్ధం' అనే వ్యాఖ్యానాన్ని ప్రస్తావిస్తూ లౌకికశబ్దానికి అంతబాగా నిర్వచనం చేసిన వారు మరి ఒకరు లేరని అమితానంద భరితులైనారట.

1935 వ సంవత్సరం జనవరి 1వ తేదీన విశాఖపట్నం ఎ.వి.ఎన్ కళాశాలలో సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారి అధ్యక్షతన జరిగిన సభలో రామ్మూర్తి పంతులు తమ బాల్యసఖులు ఆనాటి జయపుర సంస్థానాధీశ్వరులు అయిన విక్రమదేవవర్మ గారికి కృతి ఇచ్చారు తమ ఇంగ్లీషు-సవర నిఘంటువును. ఆయన ఆనాటి జమిందారులను, సంస్థానాధీశ్వరులను ఏనాడూ ఆశ్రయించలేదు. తమ విన్యాసాలను సిద్ధాంతాలను త్రికరణ శుద్ధిగా ప్రకటించేవారు.

1919 వ సంవత్సరం సెప్టెంబరు నెలలో ప్రారంభించి ఒక్క సంవత్సరము పాటు తెలుగు పత్రికను మాసపత్రికగా వారు నిర్వహించారు. తెలుగు దేశపు సహాయ సహకారాలు అందవలసినంత అందక ఈ ప్రయత్నం వారు విరమించుకోవలసి వచ్చింది.

1933 వ సంవత్సరంలో రాజమహేంద్రవరంలో పంతులుగారి అభిమానులు అనుయాయులు వారి సప్తతి తమ జన్మదినోత్సవాన్ని అత్యంత శోభాయమానంగా గొప్ప వేడుకగా మూడురోజులపాటు నిర్వహించారు. ఆ ఉత్సవ సభలో పంతులుగారికి వ్యాస సంగ్రహం అనే పేరుతో అభినందన సంపుటం సమర్పించారు. ఇందులో 46 వ్యాసాలున్నాయి. దేశీయలు విదేశీయుయి అయిన కవులు కళాకారులు మహాపండితులు ఈ వ్యాససంగ్రహాన్ని తమ రచనలతో అలంకరించారు. ఇటువంటి విలువైన అభినందన సంపుటి అంతకు పూర్వంగాని ఆ తర్వాత ఇప్పటి వరకుగాని వెలువడలేదంటే అతిశయోక్తికాదు. ఈ సందర్భంగానే పంతులుగారి రచనలు వ్యాసావళి, బాలకవిశరణ్యం, ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజం, గద్యచింతామణి (సంకలనగ్రంథం) సప్తతి తమ జన్మదినోత్సవాభినందన సంఘంవారు ప్రకటించి పంతులుగారికి బహుకరించారు. తెలుగుదేశంలో ఒక భాషాసాహిత్య వేత్తకు జరిగిన సత్కారాలలో ఇది అపూర్వమైనది. అత్యంత ఘనమైనది అని పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు వర్ణించారు. పంతులుగారి గ్రంథాలను ఆయన గారికి సమర్పించిన అభినందన సంపుటి వెండిపెట్టెలో వుంచి ఆయనకు బహూకరించినట్లుగా శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు తమ ప్రబుద్ధాంధ్రలో ఆ సభావృత్తాంతాన్ని అమితోత్సాహంతో వర్ణించారు.

రామ్మూర్తి పంతులుగారు సుమారు మూడు దశాబ్దాలపాటు వ్యావహారిక భాషోద్యమానికి నేతృత్వం వహించారు. కందుకూరి వీరేశలింగంపంతులుగారిని కూడా తమ వాదానికి సుముఖులనుగా చేసుకొన్నారు. వీరేశలింగంగారు అధ్య

క్షులుగా తామూ జయంతి గంగన్నగారూ కార్యదర్శులుగా వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజాన్ని నెలకొల్పారు.

1911 వ సంవత్సరంతో ప్రారంభమైంది వీరి ఉద్యమం. 1940 వ సంవత్సరం పంతులుగారు పరమపదించారు. 1915 వ సంవత్సరంలో రాజమహేంద్రవరంలో రామ్మూర్తి పంతులుగారి ప్రసంగం సాగనీయకుండా వారిని అల్లరిపాలు చేశారట. ఆ సభలో శ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగార్కొరే వీరి వాదాన్ని సమర్థించారుట. 1916 లో కొవ్వూరులో జరిగిన ఒక సారస్వతసభలో వీరి వాదాన్ని కొంత వరకు పండితులు అంగీకరించారు. 1925 లో తణుకులో జరిగిన సాహిత్యపరిషత్తు వార్షికోత్సవసభలో పంతులుగారు సకల సాక్ష్యాధారాలతో సుమారు ఐదు గంటలసేపు మహోపన్యాసం చేసి తమ సిద్ధాంతం సభా సమ్మతంగా స్థాపించారు. 'గ్రామ్యం కాని వ్యావహారికాంధ్ర భాషలో పూర్వ సంప్రదాయాన్ని అనుసరించి గ్రంథాలు రచించవచ్చు' అనే తీర్మానాన్ని సభవారితో ఆమోదింపజేశారు. ఈ తీర్మానం ఆమోదించడంతో ఆంధ్ర సాహిత్య పరిషత్తు నిర్వాహకులు చాలా ఆందోళన చెంది మరుసటి సంవత్సరం నుంచీ వ్యావహారిక భాషావాదులెవ్వరూ తమ సభలకు రాకుండానూ, వారికి పరిషత్తు సభ్యత్వం లేకుండానూ కట్టుదిట్టాలు చేసుకున్నారుట.

1938 వ సంవత్సరంలో ఆంధ్రవిశ్వకళాపరిషత్తు రామ్మూర్తి పంతులుగారికి కళాప్రపూర్ణ బిరుదాన్నిచ్చి తనను తాను గౌరవించుకుంది. అంతకు పూర్వం పాతిక సంవత్సరాలనాడే ప్రభుత్వం వారికి రావుసాహెబ్ బిరుదాన్నిచ్చి సత్కరించింది. ప్రభుత్వంవారు రామ్మూర్తి పంతులుగారికి కైజర్ ఇ హింద్ పతకాన్ని ఇచ్చి గౌరవించారు.

పంతులుగారు వినయ సంపన్నులు. నాకు సవరభాషను గురించి తెలిసినంతగా తెలుగుభాషను గురించి తెలియదని అనేవారుట. వీరేశలింగం పంతులుగారికి రాసిన ఉత్తరంలో మీసేవకుడు వినయ పూర్వకంగా నమస్కరించి రాస్తున్నాడనీ మీ విధేయుడు సేవకుడు నమస్కరించి శెలవు తీసుకుంటున్నాడనీ ఆయన రాశారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిల వారికి రాస్తూ వినయ పూర్వకంగా నమస్కరిస్తున్నాననీ, తాను అభినవాంధ్ర భారతి దాసానుదాసుడననీ తమ విధేయుడననీ రాసుకున్నారు. శ్రీపాద కృష్ణమూర్తిగారు తాము గ్రామ్యభాషా విధ్వంసకులమనీ వజ్రాయుధం ఎత్తినామనీ ప్రగల్భించినా పాత తాటాకుముక్క తగిలితే మీ వజ్రాయుధం వెయ్యిముక్కలవుతుందని రాశారే కాని అనుచితభాషణం చెయ్యలేదు. వీరివిమర్శలు మమ్మల్ని కూడా తాకాయి. మహాగజాః పలాయంతే మాసగంతేమిటి? అని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి 'గిడుగాపిడుగా' అని రామ్మూర్తి పంతులుగారి పాండిత్యాన్ని కొనియాడారు. ఆయన పాండిత్య మహోదధి అని అభివర్ణించారు. ఏమైనా అభి

మానమంటూ మిగిలిన ఏ పండితుడైనా, కవియైనా తన బిరుదాలూ పతకాలూ అన్నీ రామ్మూర్తి పంతులుగారికి దోసిలొగ్గి సమర్పించుకొని మళ్ళీ ఆయన అనుగ్రహించి ఇస్తే పుచ్చుకోవలసిందేనని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు రామ్మూర్తి పంతుల పాండిత్యాన్ని ప్రశంసించారు. తెలుగుసరస్వతి నోములపంట రామ్మూర్తి పంతులని విశ్వనాథ గిడుగు పాండిత్యాతి శాయితను స్తుతించారు. రామ్మూర్తి పంతుల వాదాన్ని అర్థంచేసుకొని దురర్థంకలిగించి తెలుగువాళ్ళు ఎంతో నష్టపోయినారని విశ్వనాథ బాధపడ్డారు.

"We believe in the uplift of masses. Is there not here this reform of laaguage the surest means of spreading light among the poor and needy? Is not our beautiful living tongue a true vehicle for our message? our little ones are ctarved for good literature. our women hunger for pure imaginative books. Education is not limited to the school room. Good literature, which inspires good thoughts is needed beyond in the world." అని తెలుగు పత్రిక ప్రారంభ సంచికలో పంతులుగారు హితవు చెప్పడం అపార్థం చేసుకోవడం వారిపట్ల అపచారంకాదా ?

పంతులుగారు గొప్ప మానవతావాది. కరుణార్ద్ర హృదయులు. పసిపిల్లవాడివలె అచ్చ స్వచ్ఛమైన వినిమర్శల మనస్కులు. సవరలను ఉద్ధరించాలన్న తపనతో వారికి చదువుకున్నందుకు కూలి ఇచ్చి భోజనంపెట్టి చదువుచెప్పిన వారు. ప్రభుత్వం సాయంచేయడానికి ముందుకు రాకపోయినప్పటికీ వారికై బడులుపెట్టి చదువుచెప్పి ఉపాధ్యాయులను తర్ఫీదుచేసిన మహాత్ముడు. తెలుగు సవర, సవరతెలుగు నిఘంటువులను, సవరల సంప్రదాయిక విజ్ఞానాన్ని, కథలు గాథలను సంకలితంచేసినవారు. సవరభాషకు లిపిని కల్పించినవారు. శబరుల భాషకునిజంగా ఆయన వాగను శాసనుడే.

కళాశాలలో ఆయన బోధనను గూర్చి పాటింపజేసే క్రమశిక్షణను గూర్చి ఆయన దగ్గర చదువుకున్న విద్యార్థులు కథలు గాథలుగా వర్ణించారు. తమక్లాసు అయిపోయినా సరే వారి పాఠం గంటల తరబడి కొనసాగవలసిందేనట. తోటి ఉపాధ్యాయులెవ్వరూ ఆయన దృష్టిని మరల్చడానికి సాహసించేవారు కారట. విద్యార్థులందరూ తన్మయులై వినేవారట.

తెలుగు భాషా సాహిత్యాలు, సవరభాషా సాహిత్యాలు ఈ భూమి మీద ఉన్నంతకాలం రామ్మూర్తి పంతులుగారి కృషి స్మర్తవ్యంగానే వుంటుందనడంలో సంశయంలేదు.

ఆంధ్రసామ్రాజ్య విజయధ్వజాంకమైన
ఉత్తరపుసరిహద్దున ఉదయమంది
దక్షిణపు పొలిమేరన స్తమయమాయె
నీమహాంశసమస్తాంధ్రనిబిడమగుచు

(రాయప్రోలు)

---

## అనుబంధం

గిడుగు వాదాన్ని సమర్థించిన కొందరు కవిపండితప్రకాండులు :

కందుకూరి వీరేశలింగం
తాతా సుబ్బరాయశాస్త్రి
పేరి కాశీనాథ శాస్త్రి
వాసా సూర్యనారాయణ శాస్త్రి
బంకుపల్లి మల్లయ్యశాస్త్రి
వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి
మల్లాది సూర్యనారాయణ శాస్త్రి
పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి
తిరుపతి వెంకట కవులు
అక్కిరాజు ఉమాకాంతం
తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి
వేలూరి శివరామ శాస్త్రి
దీపాల పిచ్చయ్యశాస్త్రి
కురుగంటి సీతారామయ్య
శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి
చిలుకూరి నారాయణరావు
వేటూరి ప్రభాకరశాస్త్రి

గిడుగు వాదాన్ని వ్యతిరేకించిన ప్రముఖ విద్వాంసులు కొందరు :

జయంతి రామయ్యపంతులు
వావిలకొలను సుబ్బారావు
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
చిలకమర్తి లక్ష్మీనరసింహం
కూచి నరసింహం
పురాణపండ మల్లయ్యశాస్త్రి

పానుగంటి లక్ష్మీనరసింహం
కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి
అకొండి వ్యాసమూర్తి శాస్త్రి

గిడుగువాదాన్ని అంగీకరిస్తూనే వాదంకోసం ప్రత్యాఖ్యానంచేసిన విపక్షిద్వరులు

వేదం వేంకట్రాయ శాస్త్రి
పూండ్ల రామకృష్ణయ్య
కొమర్రాజు లక్ష్మణరావు మొ॥ వారు.

ఆకర సూచిక


1. గిడుగు వేంకట రామ్మూర్తి జీవితచరిత్రము : డా॥ గిడుగు సీతాపతి–ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ_1945.
2. శ్రీ గిడుగు రామ్మూర్తి పంతులు జీవితము : ప్రొఫెసరు కాళ్ళకూరి సూర్యనారాయణ – వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ _1955.
3. మహాకవి-మహాపురుషుడు గురజాడ అప్పారావు : సెట్టి ఈశ్వరరావు – ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం, బెజవాడ – 1945.
4. స్వీయచరిత్ర : డా. గిడుగు వెంకట సీతాపతి–78 వ జన్మదినోత్సవాభినందన సంఘ ప్రచురణం _ 1962.
5. వసుచరిత్ర విమర్శనము : వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి. వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ _ మలిముద్రణం _ 1965.
6. ఆంధ్రపండిత భిషక్కుల భాషా భేషజం : గిడుగు వేంకటరామ్మూర్తి పంతులు. తృతీయముద్రణం – 1976. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ.
7. బాలకవి శరణ్యం-గిడుగు వెంకటరామమూర్తి తృతీయ ముద్రణం 1969. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్-విజయవాడ.
8. ఆంధ్రభాషాసర్వస్వనియమకతిపయములు : వేదం వేంకటరాయశాస్త్రి
9. వ్యాసావళి : గిడుగు వెంకటరామ్మూర్తి - 1933.
10. గద్యచింతామణి : సం. గిడుగు వెంకటరామ్మూర్తి – 1933.
11. ప్రతిభ : గిడుగు సంస్మరణ సంచిక _ 1940.
12. ఆంధ్రభాషానుశాసనం : మల్లాది సూర్యనారాయణశాస్త్రి – 1926.
13. వ్యాస సంగ్రహం: గిడుగు వెంకటరామూర్తి సప్తతి తమ జన్మదినోత్సవాభినందన సంపుటం – 1933.

14. చెల్లపిల్లవారి చెరలాటము : శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి – 1936.
15. కథలు-గాథలు : తిరుపతి వేంకటకవులు(3భాగాలు) 1959,60.
16. తెలుగు : గిడుగు వెంకటరామ్మూర్తి సంపాదకత్వంలో వెలువడిన మాసపత్రిక. 1919 వ సం॥
17. ప్రకీర్ణోపన్యాసములు : పానుగంటి లక్ష్మీనరసింహారావు – శ్రీ విద్యా నిలయ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము - 1918.
18. దేవీ భాగవతం : తిరుపతి వేంకటకవులు.
19. ఆముక్తమాల్యద సంజీవినీవ్యాఖ్యానం—వేదం వెంకటరాయశాస్త్రి-1927.
20. సాహిత్యోపన్యాసాలు - గి.వెం. రామ్మూర్తి స్మారకోపన్యాసం : గి.వెం.సీతాపతి - ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి ప్రచురణ - 1964.
21. మహోదయం : కె.వి. రమణారెడ్డి - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ - 1968.
22. రాలు–రప్పలు : తాపీ ధర్మారావు స్వీయచరిత్ర – విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ - 1980.
23. నా వాఙ్మయ మిత్రులు - టేకుమళ్ళ కామేశ్వరరావు - 1966.
24. ప్రబుద్ధాంధ్ర : శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి నిర్వహించిన మాసపత్రిక - 1934.
25. కృష్ణాపత్రిక : 1938, 1962, 63.
26. జయంతి - విశ్వనాథ ప్రభృతుల సంపాదకత్వంలో వెలువడిన మాస పత్రిక - 1927.
27. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువిమర్శనం - గి.వెం.రామ్మూర్తి_1939
28. ఆంధ్ర రచయితలు- మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి-సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి – 1950.
29. గిడుగు వెంకటరామ్మూర్తి జీవితచరిత్ర-జి.వి.రామ్మూర్తి-ఆంధ్రప్రదేశ్ సమాచార,పౌరసంబంధశాఖ ప్రచురణం - 1976.
30. గ్రామ్యభాషాప్రయోగ నిబంధనం - వేదం వేంకటరాయశాస్త్రి–1934 వేదం వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, మద్రాసు - రెండవకూర్పు.
31. చిన్నయసూరి అక్షరగుచ్ఛం - ఆంధ్రపత్రిక ఆదివారం (4-10-80) సారస్వతానుబంధం.
32. గృహలక్ష్మీకంఠాభరణం– పసుమర్తి కృష్ణమూర్తి -గి.వెం.రామ్మూర్తి గారి పీఠిక - 1935.

33. సాహిత్య కల - కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి - శ్రీపతి ముద్రణాలయం, కాకినాడ - 1937.
34. ఆంధ్రగ్రంథాలయం - 1940 మార్చి, జూన్ నెలల సంచిక.
35. వజ్రాయుధం – శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి సంపాదకత్వంలో వెలువడిన మాసపత్రిక - 1925 మార్చినెల.
36. Memorandum on Modern Telugu
G.V. Rama Murthy-1913.
37. Note on the compilation of a comprehensive Ethymological Dictionary of the Telugu language
J. Ramayya Partulu-1912.
38. A Defence of literary Telugu-J.Ramayya-1913.
39. Mahakavi Gurazada Appa Rao-A monograph.
Dr. G.V. Sitapati - Sagar Publications, Esamiah Bazar, Hyderabad-1978.
40. History of Telugu literature - G. V. Sitapati, Sahitya Akademi - New Delhi - 1968.

# ముట్నూరి కృష్ణారావు.

## డా॥ ముదిగొండ శివప్రసాద్

మాన్యుడు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి జీవితాన్ని పరిశీలించటానికి ముందు మనం ఆనాటి భారత స్వాతంత్ర్య సంగ్రామం వెనుక దాగిఉన్న ఒక మహత్తర శక్తిని గుర్తించవలసి ఉంది. భారత జాతీయ కాంగ్రెస్ ప్రారంభింపబడిన దినములలోనే శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, స్వామి రామతీర్థ, దయానందుడు ఈదేశంయొక్క పునరుద్ధానానికి తీవ్రంగా కృషిచేయటం మనం గమనించవచ్చు. తరువాతనే జాతీయ స్వాతంత్ర్య సంగ్రామం రాజకీయంగా ప్రారంభమయ్యింది. అలాగే తరువాతి కాలంలో జరిగిన పోరాటంలో కూడా గోఖలే, తిలక్, గాంధీజీ వంటి ప్రముఖుల జీవితాలను పరిశీలించి చూచినట్లైతే పైకికన్పడే వారి రాజకీయపోరాటం వెనుక అంతర్లీనంగా ఆధ్యాత్మిక శక్తి స్పష్టంగా గోచరిస్తుంది. వారికి రాజకీయములొక సాధనమేకానీ సాధ్యంకాదు. శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి జీవితం ఈ ప్రధానాంశం మీద ఆధారపడి ఉంది.

శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు 1879 వ సంవత్సరంలో జన్మించారు. స్వస్థలం సాగర తీరప్రాంతమైన మచిలీపట్నం. అప్పటికే బందరు తెలుగునాట సుప్రసిద్ధమైన సాంస్కృతిక కేంద్రంగా ప్రసిద్ధి చెందింది. అనాదిగా గ్రీకు రోమక పారసీక దేశాలకు మచిలీపట్నం నుంచి వస్త్రాలు మొదలైనవి ఎగుమతి

చేస్తూ ఉండేవారట. అట్లా ఆర్థికరంగంలోనే కాక సాంస్కృతిక కళా రాజకీయ రంగాలలో కూడా బందరు మొదటి నుంచి ముందజ వేసింది. అటువంటి వీర గడ్డమీద జన్మించినవాడు మన కథానాయకుడు. దురదృష్ట వశాత్తు చిన్నతనం లోనే శ్రీ కృష్ణారావు తన తల్లిదండ్రులను కోల్పోయారు. అందువలన పిన తండ్రి శ్రీ రామస్వామిగారు ఆయనను దగ్గరకు తీసి విద్యాబుద్ధులు నేర్పించారు. శ్రీ కృష్ణారావు బందరు హిందూ హైస్కూల్లో మెట్రిక్యులేషన్ వరకు చదివి తరువాత నోబుల్ కళాశాలలో చేరాడు. అప్పుడు నోబుల్ కళాశాలలో బ్రహ్మర్షి శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ఉపాధ్యాయులుగా పని చేస్తున్నారు. శ్రీ కృష్ణారావు జీవితానికి అదొక అపూర్వ వరమయ్యింది. బంగారానికి తావి అబ్బినట్లు జన్మ సిద్ధంగానే మేధావి తాత్వికుడు ఐన శ్రీ కృష్ణారావుకు కులపతి సాంగత్యం వన్నె తెచ్చిపెట్టింది. 1862 వ సంవత్సరంలోనే శ్రీ వెంకటరత్నం నాయుడుగారు బందరులో జన్మించారు. 1891 తరువాత ఆయన బందరు నోబుల్ కళాశాలలో ఆంగ్ల భాషోపన్యాసకులుగా చేరారు. అప్పటికే ఆధ్యాత్మిక తత్వంలో శ్రీ కులపతి జీవితం పరిపక్వమైంది. కాకినాడ ఆనాడు మరొక ప్రధాన సాంస్కృతిక కేంద్రం. అక్కడ బ్రహ్మ సమాజం బాగా వ్యాప్తిలో ఉంది. వెంకటరత్నం నాయుడుగారు కాకినాడలో చేరక ముందే ఏకేశ్వరో పాసన భావనను కలిగి ఉండేవారు. కాకినాడకు వెళ్ళిన తరువాత బ్రహ్మసమాజ సభ్యులై మానసిక ధ్యానం, విగ్రహారాధన నిరసనం, ఏకేశ్వరోపాసనా, సర్వ మత సమానత్వం వంటి ధర్మాలను ప్రబోధిస్తూ పడుపువృత్తిని, అంటరాని తనాన్ని నిర్మూలించటం కోసం కంకణం కట్టుకున్నారు. కులపతి జీవితంలో సాగిన మహోద్యమానికి బందరు రూపురేఖలు దిద్దింది. సరిగ్గా ఆసమయంలోనే గురువుకు తగిన శిష్యుడు లభించాడు. ఉపాధ్యాయుడుగా ఉన్న కులపతి తన శిష్యుడైన కృష్ణారావులో ఉన్న తాత్విక దృష్టిని తేలికగానే గుర్తించాడు. దానితో కులపతికి కృష్ణారావు ప్రీతిపాత్రుడైనాడు. శ్రీ కృష్ణారావు గురువుగారితో కలిసి బ్రహ్మసమాజ ప్రార్థనా సమావేశాలలో పాల్గొనడము, సుదీర్ఘమైన ఉత్తేజకర మైన ధర్మోపన్యాసాలను వేదికలమీద చేయడం మొదలుపెట్టాడు. శ్రీ కృష్ణా రావు చేసే ప్రసంగాలలో వాక్యాలు సుదీర్ఘంగా ఉండేవి. తాత్వికంగాను కవితా మయంగానూ ఉండేవి. ఆశువుగా సాగే ఈ ప్రసంగాలను విని మేధావులు ముగ్ధు లయ్యేవారు. ఈవిధంగా కృష్ణారావు జీవితంలోని తొలిదశను తీర్చిదిద్దిన ఘనత శ్రీ కులపతికి దక్కింది. కృష్ణారావులోని తాత్విక చింతన సాహిత్య సౌరభం జాతీయ దృష్టి ముప్పేటలుగా అల్లుకొని జ్యోతిర్మయమైనాయి. త్రివేణివలె సంగ మించాయి.

తరువాత విద్య కొరకు శ్రీ కృష్ణారావు మద్రాసుచేరాడు. అక్కడ క్రిష్టి

యన్ కళాశాలలో విద్యార్థిగా ఉన్నదినాలలో బ్రిటీషువారు జరుపుతున్న దౌర్జన్యాలు భారతదేశం పరాధీనమై వేయేండ్లుగా పొందిన దీనస్థితి ఆయన హృదయాన్ని కలచివేశాయి. ఆ దినాలలో శ్రీ బిపిన్‌చంద్రపాల్ న్యూ ఇండియా అనే పత్రికను ప్రచురిస్తూ ఉండేవారు. న్యూ ఇండియా ఆనాడు భారత స్వాతంత్ర్య సంగ్రామ శంఖారావం పూరిస్తూ ఉండేది. విద్యార్థిగా ఉన్న మన ముట్నూరి శ్రద్ధగా ఆ పత్రికను చదివేవాడు. ఈదశలో కృష్ణారావుని న్యూ ఇండియా పత్రిక తీర్చిదిద్దింది అనడంలో సందేహంలేదు. భవిష్యత్తులోని కృష్ణాపత్రిక నిర్వహణకు కావలసిన పాత్రికేయం, తదనుభూతి, సంకల్పం ముట్నూరికి న్యూ ఇండియా ప్రసాదించింది. తరువాత కృష్ణారావు విద్యాభ్యాసం ముగించుకొని బందరు వచ్చాడు. బందరు రావడమేమిటి కృష్ణా పత్రిక బాధ్యత ఆయన భుజస్కంధాలమీద పడటమేమిటి ఒకేసారి జరిగాయి.

ఇంతకూ ఈ కృష్ణా పత్రికేమిటి ? దీని కథా కమామీషు ఏమిటి ? నిజానికి కృష్ణాపత్రిక ఒక పత్రికకాదు. ఎనభై సంవత్సరాల తెలుగువారి సాంస్కృతిక సాహిత్య కళా రంగాలకు దర్పణం. అదొక పత్రికకాదు. ఒక ఉద్యమం. సావర్కార్ రచించిన '1857' పుస్తకాన్ని గుండెలకు హత్తుకొని స్వాతంత్ర్య పిపాసువులైన జాతీయ యోధులానాడు ఉరికంబాలకు ఎదురుగా వెళ్ళి ఉరిత్రాడులను పూలదండలుగా ధరించినట్లే కృష్ణా పత్రికను చేతిలోపట్టుకొని తెలుగునాట యువకులు ఉత్తేజితులై ముందుకు నడిచి బ్రిటీషువారి లాఠీలకు, గోలీలకు ఎదురుగా తమ గుండెలను నిలిపారు. ఇలా తెలుగునాట ప్రచండ జాహ్నవిని ప్రవహింపచేసిన, ప్రసరింపచేసిన కృష్ణా పత్రిక జననం గంగోత్రివద్ద బిందువులు బిందువులుగా ప్రారంభమైన గంగానదివలెనే విచిత్రమైనది. 1892 వ సంవత్సరంలో బందరులోని దేశభక్తులైన కొందరు యువకులు తమ సంస్కరణాత్మక జాతీయ భావాలను ప్రకటించుకోవడం కోసం తమ జిల్లాకు పరిమితంగా ఉండే ఒక వార్తా పత్రికను నడపాలని నిశ్చయించుకున్నారు. ఈనాటి కృష్ణా గుంటూరు జిల్లాలుకలిపి ఆనాడు ఒకే కృష్ణా మండలంగాఉండేది. కృష్ణామండలం కృష్ణానదీ తీరం కష్ణాపత్రిక అప్పుడే ప్రారంభమైన "కృష్ణాజిల్లా సంఘం" పేరున గల సంస్థకు ప్రచార సాధనంగా కృష్ణాపత్రిక ఉపయోగపడింది. జిల్లాలోని ప్రముఖులు ముందుకు వచ్చి ఉత్సాహంగా చేయూతనిచ్చి విరాళాలు అందించారు. ఈ దశలో కృష్ణాపత్రికకు దేశభక్త శ్రీకొండావెంకటప్పయ్యపంతులు, ప్రముఖులైన శ్రీదాసు నారాయణరావుగారలు సంయుక్త సంపాదకులుగా ఉన్నారు. పత్రిక క్రమంగా జిల్లావార్తలను ప్రచురిస్తూ తమ మండలంయొక్క అవసరాలను తీరుస్తూ ముందుకు సాగి క్రమంగా ఆంధ్ర ప్రాంతంలోని వార్తలను ప్రచురిస్తూ ముందుకుపోయి జాతీయావసరాలను కూడా తీర్చే విధంగా దేశీయ సమస్యలవైపు తన దృష్టిని

ప్రసరించింది. ఈదశలో ముట్నూరికృష్ణాపత్రికకు సహసంపాదకుడైనాడు. అప్పటికి పత్రిక వయస్సు ఒక సంవత్సరం మాత్రమే. కృష్ణాపత్రిక ఆనాటినుంచి కృష్ణామండల పత్రికగా కాక శ్రీ కృష్ణారావుగారి పత్రికగా తన పేరును సార్థకం చేసుకుంది.

సహాయ సంపాదకునిగా శ్రీ ముట్నూరి కృష్ణాపత్రిక బాధ్యతను స్వీకరించి సహజసుందరమైన తన తెలుగుశైలితో పత్రికను తీర్చిదిద్దుతుండగా గుంటూరు మండలం కృష్ణామండలం నుంచి రాజకీయంగా విడివడిపోయింది. అప్పుడు 1905 వ సంవత్సరంలో కొండా వెంకటప్పయ్యగారు గుంటూరు వెళ్ళిపోయాడు. ఆనాటి నుంచి పత్రికయొక్క బాధ్యతను ముట్నూరే నిర్వహించ సాగారు.

ఇంతలో బెంగాల్ విభజన జరిగింది. వందేమాతరం ఉద్యమానికి వంగ దేశం నాంది పలికింది. శ్రీ బిపిన్ చంద్రపాల్ దానికి నాయకత్వం వహించారు. అరవిందఘోష్ అనుచరుడై నిలచాడు. బాలగంగాధరతిలక్ ఉద్యమానికి తన ఆశీస్సులను అందచేశాడు. జాతీయ భావాలతో ఉర్రూతలూగుతున్న ముట్నూరి హృదయాన్ని వంగదేశం ఆకర్షించింది. వెంటనే బెంగాల్ వెళ్ళి బిపిన్ చంద్ర పాల్‌ను కలుసుకున్నాడు. పాల్ ముట్నూరిని ఆశీర్వదించాడు. భుజం తట్టాడు. పాల్ వెంట కృష్ణారావు పర్యటన సాగించాడు. బ్రిటిషువారిని పారద్రోలవలసిన అవసరము అందుకు కావలసిన వ్యూహము మొత్తము కృష్ణారావు పాల్ నుండి నేర్చుకున్నాడు. భావుకుడుగా దేశభక్తుడుగా వంగభూమికి వెళ్ళిన కృష్ణారావు విప్లవవీరుడుగా తిరిగి తెలుగు దేశానికి వచ్చాడు. శ్రీ బిపిన్ చంద్రపాల్ కృష్ణారావు సారథ్యంలో ఆంధ్రదేశ పర్యటన జరిపారు. పాల్ తిరిగి వెళ్ళగానే ముట్నూరి కృష్ణారావు ఏకాంతంగా తన గదిలోకూర్చున్నాడు. భవిష్యత్తులో తన కర్తవ్య మేమిటి ? కత్తి పట్టాలా ? కలం పట్టాలా ? పుష్పదంతుడు శివ మహిమ్నస్తవంలో చెప్పిన శ్లోకం గుర్తుకువచ్చింది.

" త్రయీ సాంఖ్యం యోగం
పశుపతి మతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః
పథ్య మితిచ
రుచీనాం వైచిత్ర్యాత్
ఋజు కుటిల నానా పథ జుషాం
నృణామేకో గమ్యః
త్వమసి పయసా మర్ణవ మివ "

వేదమతము సాంఖ్యము యోగము. పాశుపతము వైష్ణవము. ఇలా భిన్న

భిన్నములైన మతములు ఉపాసనా, మార్గములు ఎన్నో ఉన్నాయి. కానీ ఇవన్నీ వ్యక్తులయొక్క అభిరుచులలోని బేధము వలన ఏర్పడినవి మాత్రమే. కొన్ని సరళమైనవి కొన్ని వక్రమైనవి కానీ అన్ని మతములు చేర్చేచోటు ఒకటే. అన్ని నదులు సరళముగాను, వంకర టింకరగానూ, ఎగుడు దిగుడుగాను ఎలా పయనించినా చివరకు వెళ్ళి ఒకే సముద్రములో లీనమైపోయినట్లు అన్ని ఆరాధనా మార్గములునూ చివరకు ఓ పరమేశ్వరా నిన్నే చేరుకుంటాయి అని దీనిభావము. స్వామీ వివేకానందుడు చికాగోలో జరిగిన విశ్వమత మహాసభలో ఈ శ్లోకాన్నే తన తొలినాటి ప్రసంగంలో ఉదహరించాడు. కృష్ణారావుకు జ్ఞాననేత్రం వికసించింది. ఈశ్లోకార్థం ఆయన తన జీవితానికి సమన్వయం చేసుకున్నాడు. దేశంకోసం ఎందరో ఎన్నో మార్గాల పోరాడుతున్నారు. విప్లవకారుల నుంచి సామాన్యులవరకు అందులో ఉన్నారు. మార్గాలు వేరైనా అందరి గమ్యం ఒకటే. అది స్వాతంత్ర్యం కత్తి పట్టి రంగంలోకి వెళ్ళాలా ? కలంపట్టి గదిలోకూర్చోవాలా ? విప్లవవీరులతో కలిసి కొందరు ఆంగ్లేయులపై బాంబులు విసిరి పట్టుబడి బలిదానంచేసేకన్నా జాతిని నిరంతరం జాగృతిచేస్తూ చైతన్య వంతంగా చివరివరకూ జీవించడం మేలని కృష్ణారావు నిశ్చయించుకున్నాడు. అందువలన ఆయన కత్తిని పట్టలేదు. కానీ తన కలాన్నే కత్తిగా మార్చి కృష్ణాపత్రికా సంపాదకత్వాన్ని 1907 నుంచి పూర్తిగా తానే నిర్వహించాడు. తరువాత పత్రికకు తానే స్వయంగా యజమాని అయినాడు. అక్కడినుంచి ప్రారంభమయ్యింది శరపరంపరగా వెలువడే కృష్ణాపత్రిక సంపాదక వ్యాసావళి. అదొక రచనకాదు. మహోద్యమం. స్వాతంత్ర్య సంగ్రామం. నిర్విరామ కర్మయోగం. ఏ వారానికి ఆ వారం కృష్ణాపత్రికకోసం ఆంధ్రులు ఎదురుచూచేవారు. పత్రిక రాగానే పల్లెటూరిలో రచ్చబండమీద కూర్చొని ఒకరు చదువుతుంటే మిగిలిన వారంతా చుట్టూ నిలబడి విని గంభీర హృదయాలతో దేశభక్తి సౌరభాన్ని నింపుకొని వెళ్ళిపోయేవారు. ఈవిధంగా కృష్ణాపత్రిక తెలుగునాట ఒక మహోద్యమానికి దారితీసింది.

ఇంతలో రాజకీయంగా గాంధీ మహాత్ముడు భారతదేశానికి నాయకత్వం వహించాడు. కృష్ణారావు మహాత్ముని శాంతిసేవలో ఒక వీరసైనికుడైనాడు. వెళ్ళి మహాత్ముని పాదాలను స్పృశించాడు. గాంధీజీ కృష్ణారావు కన్నులనుచూచి అందులో వెలుగుతున్న ఆధ్యాత్మిక దీధితిని గమనించి చిరునవ్వుతో శ్రీభోగరాజు పట్టాభి సీతారామయ్యతో "చూడు పట్టాభి ! కృష్ణారావు కళ్ళలో ఆధ్యాత్మిక జ్యోతులు వెలుగుతున్నాయి. ఈయనను బయటికి తీసుకురావాలి. తనంత తాను రాడు ప్రయత్నించాలి" అన్నారు. ఐతే కృష్ణారావు రాజకీయ రంగస్థలం మీద ప్రత్యక్షంగా దర్శన మివ్వడానికి ఒప్పుకోలేదు. తెరవెనుక నిలబడి వేలాది

స్వాతంత్ర్య యోధులను నడిపించడానికి కావలసిన కదన గీతాన్ని కృష్ణాపత్రిక ద్వారా ఆలాపించాలని నిశ్చయించు కున్నాడు. నాటి నుంచి కృష్ణాపత్రిక ధోరణి పూర్తిగా మారిపోయింది. అప్పటి వరకు కృష్ణారావు కొంత వ్యంగ్యము, కొంత చమత్కారము, కొంత కళ, కొంత శాస్త్రము, కొంత సాహితీ సౌంద ర్యము ఇవన్నీ కలబోసిన రంగుల హరివిల్లుగా కృష్ణా పత్రికలో కన్పడేవాడు. కానీ ఆనాటి నుండి కృష్ణాపత్రిక ఒక స్వాతంత్ర జయభేరి. కదన కాహళి జాతీయ సమైక్యతా సమర శంఖారావంగా మారిపోయింది.

కృష్ణాపత్రిక ఒక పత్రికకాదు. స్వాతంత్ర్యోద్యమం. పత్రికా కార్యా లయం ఒక గదికాదు. రహస్య వీరులకు స్థావరం. అర్థరాత్రి పన్నెండు గంట లకు అక్కడ రాజకీయ నాయకుల సమావేశాలు జరుగుతూ ఉండేవి. ప్రభుత్వ గూఢచారులు గుంపులు గుంపులుగా వచ్చేవారు. సత్యాగ్రహానికి సంబంధించిన నిర్ణయాలు కార్యాలయంలోనే తీసుకుంటూండేవారు. వందలాది వీరులు చెర సాలలను అలంకరించేవారు. కేవలం యోధులను జైళ్ళకు పంపడమేకాదు. కృష్ణారావు తాను స్వయంగా మార్గదర్శకత్వంహించి జైలుకెళ్ళాడు. జైలు కూడా ఆయనకొక పాఠశాలయే. అప్పుడు తనతోపాటు జైలులో ఉన్న బెజ వాడ గోపాలరెడ్డి వంటి వారికి సంస్కృత కావ్యాలు పాఠంచెప్పారు. స్వదేశం స్వభాష స్వధర్మం వీటి పునరుద్ధరణమే ఆనాడు జాతీయోద్యమానికి అర్థం. అందుకని సంస్కృతం చదివినా, చదివించినా హిందీ నేర్చినా నేర్పించినా వేదాంతం అభ్యసించినా బోధించినా అంతా జాతీయోద్యమంలో భాగమే. అర వింద యోగికి మహాత్మాగాంధీకి లోకమాన్య తిలకునికి తమ తమ జైలు జీవి తాలు ఆధ్యాత్మిక సాధనకు ఉపయోగపడినట్లే కృష్ణారావుకూడా తన కర్మయోగ సాధనలో ఒక భాగంగా చెరసాలను స్వీకరించాడు. నాటి నుండి కృష్ణారావు సంపాదకీయాలలో లోతు ఎక్కువైంది. బరువు పెరిగింది. కాగితం కొరత వలన పత్రిక కొద్ది పుటలలోనే వస్తున్నా అందులోని భావాల బరువు వలన సర్క్యులేషన్ పెరిగిందేకానీ తరగలేదు.

కృష్ణాపత్రిక ప్రజలను ఉర్రూతలూగించినట్లే ప్రభుత్వాన్ని గజ గజ వణికించింది. కృష్ణారావుగారి వ్యాసాలను ఆంగ్లంలోకి అనువదించి లండనుకు పంపవలసిందిగా అధికారులు మద్రాసుకు ఉత్తరువులు జారీచేశారు. ఈ అను వాద బాధ్యత చెన్నాప్రగడ భానుమూర్తిగారిపై పడింది. ఆయన ప్రభుత్వ అను వాదకుడు. భానుమూర్తి ఎవరోకాదు. బందరు నోబుల్ కాలేజీలో కృష్ణారావు చదువుకునేటప్పుడు ఆయనకు పాఠంచెప్పిన గురువు. అందుకని కృష్ణారావుగారి సంపాదకీయాలు ఎలా అనువదించాలో అలా అనువదించి వాటిని భానుమూర్తి లండనుకు పంపుతూ ఉండేవాడు. ఇలా ఉండగా ఉన్నవ లక్ష్మీనారాయణ

పంతులుగారు ఒకసారి కృష్ణారావు సంపాదక వ్యాసాన్ని ఒకదాన్ని ఆంగ్లంలోకి అనువదించి ఇంగ్లీషువారి కళ్ళు తెరిపించే నిమిత్తం బ్రిటనులోని ఒకపత్రికలోని ప్రచురణకై పంపించాడు. అందలి వేడికి బ్రిటీషుప్రభుత్వం హడలి పోయింది.

ఎవరీ కృష్ణారావు? అని విచారణ మొదలుపెట్టారు. చివరికి నేరం భాను మూర్తి మీదికి వచ్చింది. "ఇంతటి తీవ్రమైన వ్యాసాన్ని నీవు బ్రిటీషు ప్రభుత్వ అనువాదకుడుగా ఉండి ఎందుకు అనువదించి పంపలేదు?'' అని మద్రాసు గవర్నరు గద్దించి అడిగాడు. అప్పుడు భానుమూర్తిగారు ''అయ్యా లోగడ నేను చాలా వ్యాసాలు అనువదించి పంపాను. కానీ ప్రభుత్వం వాటిని గమనించలేదు. అందుకని ఈ వ్యాసం అనువదించటం మానివేశాను. నిజం చెప్పాలంటే కృష్ణారావుగారి వ్యాసాలన్నీ ఇంత వేడితోనే ఉంటాయి. అవి అగ్నిగర్భాలు. పైకి సున్నితంగా చమత్కారంగా ఆంగ్లేయులను పొగిడినట్లుగా వాక్యాలుంటాయి. కానీ వ్యంగ్యంగా ఉండే వాక్యాలలోని లోతులు గమనించినవారికి కృష్ణారావు ఎంత తీవ్రంగా వ్రాస్తున్నాడో కన్పడుతుంది. ఏమైనా నా రాజీనామా లేఖను స్వీకరించండి. నేను ఇక ఈ పనిని వదులుకుంటున్నాను" అనేసరికి గవర్నరు నివ్వెరపోయాడు.

ముట్నూరి వ్యాసాలకు ఇంతటి పదును ఎలా వచ్చింది. ఆయన ఆఫీసును దర్బారు అంటుండేవారు. రాయలవారి భువనవిజయంలో కృష్ణరాయలవలె ఈ దర్బారులో కృష్ణారావు సమున్నతమైన ఉష్ణీశంతో తేజోవంతమైన నేత్రాలతో కూర్చొని ఉండేవాడు. ఆయనకెదురుగా చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, భోగరాజు పట్టాభిసీతారామయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, రావూరి వేంకట సత్యనారాయణ రావు వంటి దిగ్గజాలెందరో కూర్చొని ఎన్నో విషయాలు ముచ్చటించుకుంటూ ఉండేవారు. ఏదైనా ఒక ప్రధాన సమస్య ఉన్నప్పుడు అది చర్చలోకి దిగేది. ముట్నూరి మౌనముద్రాలంకారుడు. మితభాషి. అంతా వినేవాడు, ఒకదీప్తి, స్ఫూర్తి వచ్చేవి. ఆ తరువాత ఆయన కలం కత్తివలె సాగేది. రసరమణీయ మాధుర్యమైన మణిహారములు పూలహారములు ఒకసారి విసరగా ప్రళయ పర్జన్యగర్జ భీకరరావములతో చంద్రహారప్రహారాలను ఒకొకసారి విసిరేది. ఏ వ్యాసం వారు వ్రాసినా అది సర్వసమగ్రంగా సుందరంగా ఉండేది.

ముట్నూరి చేతిలోనికి పత్రికాధిపత్యం వచ్చిన తరువాత అది కేవలం ఒక రాజకీయ పత్రికగానో, ప్రాంతీయ పత్రికగానో నడిచిందని చెప్పడానికి వీలు లేదు. కళాసాహిత్య సౌందర్యాలన్నీ అందులో తొణికిసలాడుతూ ఉండేవి. అంతటి రసజ్ఞుడు భావుకుడు 20 శతాబ్దంలోని తెలుగు పత్రికా సంపాదకులలో మరొకడు లేడనడం నిర్వివాదాంశం. భాస వ్యాస కాళిదాసాదుల ప్రాచీన కవితా సౌందర్యసౌరభాలను తన హృదయంలో రంగరించుకోవడంతో పాటు, రవీంద్రా

రవింద, బాలగంగాధరుల కవితా తాత్త్విక కర్మయోగాలనుకూడా జీర్ణించుకున్న మహనీయుడు ముట్నూరి. సంపాదక వ్యాసాలే కాకుండా రవీంద్ర సాహిత్యాన్ని తెలుగు పఠితలకు, సుపరిచయం చేసే వ్యాసాలు కూడా కృష్ణాపత్రికలో ఆయనే వ్రాస్తుండేవాడు. అరవిందుడు పాండిచ్చేరి వెళ్ళి ఆశ్రమాన్ని స్థాపించి ఆర్య పత్రిక నడుపుతూ ఉండేవాడు. ముట్నూరి దాన్ని భక్తిశ్రద్ధలతో పఠిస్తూ ఉండేవాడు. ఆర్యలోని అరవిందుని తాత్త్విక ధోరణి ముట్నూరిలో అంతర్నిహితంగా ఉన్న ఆధ్యాత్మిక శక్తుల జాగరణకు, నిరంతర స్ఫూర్తికి ఎంతగానోతోడ్పడింది. అందుకే కృష్ణారావు ప్రతివ్యాసం ఒక ఉపనిషత్సందేశం వలె ఉండేది. ఇలా నాలుగు దశాబ్దాలు ముట్నూరి కలం ముందుకు సాగింది.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు ముట్నూరిని చూచి, "ఈయన ఒక ఋషి. కనిపించని కవి" అన్నాడు. నిజమే ఆయన వ్రాసింది వచనమే అయినా ఏ వాక్యానికి ఆవాక్యం మధుర కవిత్వ శోభితం. 'గద్యం కవీనాం నికషం వదంతి' అని మనం అంగీకరిస్తే ముట్నూరి గద్యం ఒక పద్యం. వేదాలలో కవి అంటే ఋషి అని అర్థం ఉన్నదికదా.

ముట్నూరి సంపాదక వ్యాసాలే కాక 'లోవెలుగులు' అనే శీర్షికతో ఎన్నో వ్యాసాలు కృష్ణాపత్రికలో ప్రచురించాడు. ఈ వ్యాసాలను తరువాతి కాలంలో "లోవెలుగులు" అనే పేరుతోనే ఒక పుస్తకంగా తీసుకురావడం జరిగింది. అలాగే 'సమీక్ష' అనే పేరుతో ముట్నూరి రచనలు, మరొక వ్యాససంకలనంగా కూడా వెలువడింది. కృష్ణాపత్రిక నిర్వహణ ముట్నూరి తరువాత కొన్ని చేతులు మారి 1960 లో బ్రహ్మశ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారి నేతృత్వంలోకి వచ్చింది. అప్పటినుంచి దాదాపు ఒక దశాబ్దం పత్రిక ఉజ్జ్వలంగానే నడిచి 1970 తరువాత నీరసించి ఇటీవలే మూతపడింది. శర్మగారి ఆధ్వర్యంలోనే కృష్ణాపత్రిక తన వజ్రోత్సవాన్ని వైభవోపేతంగా హైదరాబాదులో జరుపుకున్నది. అప్పుడు కృష్ణాపత్రికలో సహసంపాదకులుగా పనిచేస్తున్న డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ (ఈ వ్యాసరచయిత) తో పాటు ప్రస్తుతం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న శ్రీధరబాబు గారలు కలిసి ముట్నూరి వ్యాసాలను పాత కృష్ణాపత్రికల నుండి పునరుద్ధరించి సంపుటాలుగా తీసుకొని వచ్చారు. ఇవేకాక ఇటీవల ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధిపతులు కృష్ణాపత్రికతోనే కాక శ్రీ ముట్నూరి కృష్ణారావుగారితో కూడా అత్యంత సన్నిహిత సంబంధం కలిగిన డాక్టర్ దావూరి వేంకట సత్యనారాయణ రావుగారిని పరిష్కర్తగా చేసి ముట్నూరి కృష్ణారావు వ్యాసాలు అనేపేర మరొక గ్రంథాన్ని వెలువరించారు. ఇవన్నీ ముట్నూరి సాహితీ వైభవానికెత్తిన శృంగార నీరాజనాలు మణిదీపాలు.

కర్మయోగి ముట్నూరి 1945 లో పరమపదించినా ఆయన ఊహలు జ్ఞాపకాలు తెలుగు పాఠకులను ఈనాటికీ జాగృతం చేస్తూనే ఉన్నాయి.

# 2

ముట్నూరి రచనలను విశ్లేషం చేయడానికి ముందు అందులోని ప్రధాన అంశాలను గమనింపవలసి ఉంది. ప్రతి రచనలోనూ ఆయన వ్యక్తిత్వం ప్రస్ఫుటంగా గోచరిస్తూ ఉండేది. ప్రతి వాక్యమూ వాణీ వీణా నిక్వాణం వలె ఝుమ్మంటూ ఉండేది. ప్రతి అక్షరం వెనుకా ఆయన తాత్వికదృష్టి సత్య శివ సుందరాత్మక దర్శనము కళ్లకు కడుతూ ఉండేవి. చమత్కారము, వ్యంగ్యము, చిన్న చిన్న సెలయేరులై ప్రవహిస్తూ ఉండేవి.

ఆయన రచించిన వ్యాసాలను మనం ప్రధానంగా మూడు భాగాల కింద విభజించవచ్చు. కొన్ని ఆనాటి వర్తమానసమస్యలను దృష్టిలో పెట్టుకొని చేసిన రచనలు. మరికొన్ని మహాపురుషులమీదనూ మహాకృతులమీదనూ ముట్నూరి చేసిన వ్యాఖ్యానాలు. కలం కుంచెతో గీసిన బొమ్మలు. (Pen Portraits). మిగిలినవి శాశ్వతము సార్వకాలికము సార్వదేశికము ఐన పరమ సత్యాలను ప్రతిపాదించే విశ్వజనీనమైన రచనలు. వీనిలో కొన్ని రాజకీయమైనవి కొన్ని వేదాంత సంబంధమైనవి ఇంకొన్ని తాత్వికమైనవి. మరికొన్ని కావ్యపరిమళంతో గుబాళించేవి మనకు దర్శనమిస్తాయి. ముట్నూరి వ్యాస బృందావనంలో, సుందర నందనవనంలో మల్లెలు మొల్లలు విరజాజులు సంపెంగలు, పారిజాతాలు ఎన్నెన్నో పుష్పాలు. ఎన్నెన్నో వర్ణాలు. ఎన్నో పరిమళాలు.

వ్యక్తులను కేంద్ర బిందువులుగా చేసుకొని ముట్నూరి చేసిన రచనలలో లోకమాన్య బాలగంగాధరతిలక్, శ్రీనివాసశాస్త్రి, కేశవచంద్రుడు, రెడ్డినాయుడు సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు, శ్రీ వేమూరి రామకృష్ణరావు, వల్లూరి సూర్య నారాయణరావు. సి.ఆర్.దాస్, రామకృష్ణ పరమహంస వంటి వ్యక్తులు ప్రతి బింబిస్తారు. లోకమాన్య బాలగంగాధర తిలక్ అస్తమించినప్పుడు ముట్నూరి వ్రాసిన వ్యాసం ఆనాటి లక్షలాది భారతీయుల హృదయతీక్షణతకు ప్రతిస్పందన "లోకమాన్యుడు ఒట్టి రాజకీయ సంస్కర్త కాదు. కేవల రాజకీయోద్యమము నందు నిర్మాణశక్తి ఎక్కడ కలదు. లోకమాన్యుడు జాతీయ నిర్మాత.నిక్కము. నేడెవరి నామము ఆసేతు హిమాచలము సంస్మరింపబడుచున్నది. తిలకుని జీవి తము భారతవర్షమునంతనూ ఇముడ్చుకొనగలిగెను. ఇందుకై లోకమాన్యుడు తన మహారాష్ట్రత్వమును వదులుకొనలేదు. హిందూమతమును విడనాడలేదు.... హిందూ ధర్మసాధన చింతనలు వానియందు ప్రస్ఫుటమయ్యెను........మహా రాష్ట్రీయ నిర్మాణమున భారత జాతీయ నిర్మాణ రహస్యము వ్యక్తమయ్యెను.

మహారాష్ట్రము లోకమాన్యుని కేంద్రము. భారతరాష్ట్రము దాని పరిధి. విశ్వము నకు భారత వర్షము కేంద్రము". ఈ వాక్యాలు లోకమాన్య తిలకుడు అస్తమించి నప్పుడు కృష్ణారావు తన ఆగస్టు 7 వ తేదీ 1920 సంచికలో వ్రాసిన సుదీర్ఘ మైన సంపాదక వ్యాసంలోనివి. తిలక్ యొక్క కర్మయోగంలోని రహస్యాన్ని కృష్ణారావు చక్కగా ఆనాడే అంచనా వేయగలిగాడు. "రాజ్యాంగము నా స్వరూపము కాదు. వేదవేదాంగాది దర్శనముల అధ్యయనమే నా పరమావధి. కానీ భారతవర్షము ప్రస్తుతము అస్వాభావికావస్థ యందుండుటచే నేను రాజకీయ క్షేత్రమునందు పనిచేయుట ఆపద్ధర్మముగానెంచి కార్యాసక్తుడనై యుంటినని పండిత పరిషత్తులో లోకమాన్యుడు ఆనాడు చేసిన ప్రకటనను కృష్ణారావు ఈ సంపాదకీయంలో ఉదహరించాడు. ఈ మాటలు అటు తిలక్ వ్యక్తిత్వానికి ఇటు కృష్ణారావు జీవితానికి కూడ సరిగ్గా సరిపోతాయి. ఆర్షధర్మం మీద ప్రేమగల తిలక్ రాజకీయాలను సాధనంగా స్వీకరిస్తే ఆధ్యాత్మిక చింతనగల కృష్ణారావు కాలాన్ని తన సాధనంగాచేసుకున్నాడు. తిలక్ వలెనే కృష్ణారావు కూడా పత్రికను ఆశ్రయించాడు.

1926 వ సంవత్సరం ఢిల్లీలో స్వామి శ్రద్ధానందను మహమ్మదీయు డొకడు కాల్చి చంపాడు. ఆ సమయంలో కృష్ణారావు డిసెంబరు 25 సంచికలో వ్రాసిన 'బలిబలి' అనే సంపాదకీయవ్యాసం హృదయాన్ని ఎంత రగిలిస్తుందో మనస్సును అంత సంశయింప జేస్తుంది. "రోషమునకిది తరుణముకాదు. ప్రతీ కార వికారములకు తావులేదు. దేశమునందు ఐక్యము కూర్పజాలనందుకు లజ్జిం పుడు. జాతీయ నిర్మాణ కార్యమును వదలి బాహ్య వికారములకు లోబడినందుకు పరితపింపుడు. కొన్నిళ్ళ వ్యామోహమున చిక్కి చిత్త విక్షేపము నొందినందుకు దుఃఖింపుడు. ఇప్పుడైనా దేశముయొక్క దౌర్బల్యమును అనైక్యమును అసహ నమును, విద్వేషమును తలపోసి కర్తవ్యాంశమునకు కడంగుడు, కులతత్వ పిశాచములను మతవైరములను పారద్రోలి దేశైక్యమును కూర్చుటకు గౌహతీ కాంగ్రెసు ఎట్టి కార్యక్రమమును నిర్ణయించునో అని లోకము ఎదురుచూచు చున్నది. దైవమీ తరుణమున తోడ్పడును గాక.'' ఈ వాక్యాలు కృష్ణారావు కృష్ణాపత్రికలో వ్రాసి ఇప్పటికి 55 సంవత్సరాలు ఐంది. నేటికీ ఇందులోని ప్రత్యక్షరం మన వర్తమాన పరిస్థితులకు యథాతథంగా వర్తిస్తూనే ఉందికదూ.

ఒక్కొక్కచోట కృష్ణారావు రచనలు మెత్తని చెప్పుతో కొట్టినట్లుంటాయి. పైకి ఇంగ్లీషువారిని ఏమీ అననట్లే కనపడ్డా ప్రతివాక్యమూ వ్యంగ్య మర్యాదతో దెబ్బకొడుతూ ఉంటుంది. 1936 వ సంవత్సరానికి ముందు ఎడ్వర్డురాజు నౌకా విహారార్థం ఆడ్రియాటిక్ సముద్రతీరానికి వెళ్ళాడు. ఆయన వెంట ఉన్నవారిలో మిసెస్ సిమ్సన్ అనే అమెరికన్ యువతికూడా ఉంది. ఎడ్వర్డు వెంట ఈమె

రుమేనియా, యుగోస్లేవియా, టర్కీ, దేశాలుకూడా పర్యటించింది. రాజుగారితో పాటు ఆమె ఆటలలో, విందులలో, యాతలలో, క్రీడలలో కూడా పాల్గొన్నది. అమెరికన్ పత్రికలు ఈ విశేషాన్ని వర్ణిస్తూ త్వరలో ఈమె బ్రిటిషు రాణి కానున్నదని సూచించాయట. దీనిపై కృష్ణారావు 1936 డిసెంబరు 12 వ తేదీన "రాజ్యత్యాగమా" అనే సంపాదకీయం వ్రాస్తూ "అప్పటికినీ బ్రిటిషు పత్రికలు ఈ సందర్భమును గురించి ఒక్క మాటయును వ్రాయలేదు. బ్రిటిషు పత్రికల నిగ్రహము అత్యద్భుతము" అని మెత్తగా వాత పెట్టాడు. "ఈమె 1916 లో అమెరికన్ సేనానాయకులలో ఒకరైన స్పెన్సర్‌ను వివాహమాడిందట. ఆ తరువాత కెప్టెన్ ఆర్నెస్ట్ సింప్సన్ అనే లాయర్‌ను వివాహమాడిందట. ఆయనకూ విడాకులిచ్చి ఇప్పుడు ఎడ్వర్డు యువరాజును వివాహమాడాలని అనుకున్నది. ఈ సందర్భంలో క్యాంటర్‌బరీ ఆర్చి బిషప్ ఎడ్వర్డు తల్లి మేరీ రాణి మొదలైన వారందరూ ఆందోళన వెలిబుచ్చారు. అప్పుడు కృష్ణారావు వరుసగా రెండు సంపాదకీయాలు వ్రాసాడు. మొదటి సంపాదకీయం "ఎడ్వర్డు ప్రభువు రాజ్య పదవికొరకు తాను వలచిన పడతిని నిరాకరించునా, దుర్భరము. రాజ్యమా ? రమణియా? లోకము ప్రత్యుత్తరము కొరకై నిరీక్షించుచున్నది. రమణియే అని వారి సమాధానము'' అని వ్యంగ్యంగా ఎడ్వర్డు యువరాజును ఎగతాళిచేశాడు. ఇది చదవటానికి ఎంత చమత్కారంగా ఉన్నదో వ్రాయడానికి అంత సాహసం అవసరమని గ్రహింపవచ్చు. ఆ ప్రక్క వారంలోనే 'ప్రేమవిజయమా' అనే సంపాదకీయం వ్రాస్తూ ఎడ్వర్డు చార్యలను సున్నితంగా విమర్శిస్తూ "రమణి కొరకు రాజ్యము వదలివేసినంత మాత్రాన ఎడ్వర్డు మహాప్రేమికుడు అనుటలో అర్థములేదు. అయ్యేది ధర్మబాహ్యమైన కామాంధతయో లేక లోకమంతకూ దాంపత్య ప్రణయముయొక్క మహిమను చాటగల ప్రేమవిజయమో కాలమే నిర్ణయింపవలసి యుండును." అని కృష్ణారావు ఆవ్యాసాన్ని ముగించాడు.

అలాగే అంబేత్కర్ హిందూధర్మాన్ని విమర్శించినపుడు కృష్ణారావు చక్కని సంపాదకీయం వ్రాశాడు. అందులో అంబేత్కరును ఏమీ విమర్శించ లేదు. కానీ అంబేత్కర్ మనస్తత్వాన్ని బాగా విశ్లేషణ చేశాడు. "హిందూ ధర్మంపై తిరుబాటు 1935 అక్టోబరు 19 వ తారీఖునాడు వ్రాసిన సంపాదకీయం. అంబేత్కరు గాంధీజీ ఇరువురూ అస్పృశ్యతా నివారణకోసం పాటుబడినప్పటికీ ఇరువురి దృక్పథాలలోని భేదన్ని సున్నితంగా వివరించి చూపాడు. గాంధీజీ అంటరాని వారలను హరిజనులని గౌరవించాడు. అంబేత్కరు వారిని బౌద్ధమతంలోకి మార్చాడు. ఇలా ఎందుకు మార్చాడు. క్రైస్తవులుగానో మహమ్మదీయులుగానో మార్చవచ్చునుగదా. దీనికి కృష్ణారావు చేసిన విశ్లేషణ ఇక్కడ ఉంది.'' ఈ మధ్య మళయాళ దేశములో కొన్ని హరిజన పల్లెలు బౌద్ధ

ధర్మమును స్వీకరించినట్లు ప్రకటించబడినది. అంబేత్కరు గారికి ఏ మతమున శరణ్యము గానున్నదియును ఎవరికినీ తెలియదు. క్రైస్తవ మతమందు క్రైస్తవ నిగ్రోల విషాదగాథలు వారు వినియే యుందురు. మహమ్మదీయ మతమనెదరా ఎట్టి అసహనము ఆమతము పెంచుచున్నదియు పంజాబు కథలు చెప్పుచున్నవి. కావలసినది మత సంస్కరణముగానీ అన్యమతావలంబనముగాదు! అని ఇందులో కృష్ణారావు వ్రాశాడు.

ముట్నూరి రచనలలో ఎంతటి శాస్త్రీయ విశ్లేషణా తాత్విక దృక్పథము రాజకీయ పరిజ్ఞానము కనపడుతుందో అంతటి కవితాసుగంధము గుబాళిస్తూ ఉంటుంది. కాళ్ళగజ్జెలు, అందియలు గల్లుగల్లున మ్రోయ పరికిణీ అంచులు నేల జీరాడ ముద్దులొల్క మోములో తీయదనాలు వెదజల్లు పాటలతో పరుగుపరుగున వచ్చిన ఈ చిన్నికన్నె ఎవరు? తొక్కుపల్కులు తప్పటడుగులు ఇప్పుడిప్పుడే చాలించి పేరంటానికి బయలుదేరే యీడువచ్చిన ఈ కన్నె ముత్తైదువ మా బందరు పౌరుల పిలుపుకు సంబరపడి దీవెనల నందుకొన ఏతెంచినది. నవ్య సాహిత్య పరిషత్తుకు బాలారిష్టాలు గడిచి ఆరేండ్లు నిండినవి. తెలుగునాడు నాలుగు మూలలు జనముద్దుగ తిరిగి ఫలాని పిల్ల కావద్దా అనిపించుకొని మాట, మన్నన, నడక, నాగరికత, నేర్చుకొని పేరంటమునకు వచ్చిన ఈ పడుచుకు సాహితీ ప్రియులు రసజ్ఞులు కవిబాంధవులు నిండోలగము దీర్చియుండ మా బందరు పౌరులు వేడుకతీర పసుపు కుంకుమలిచ్చి కానుకలొసగి అచిరకాలములో నీ కన్నె పట్టమహిషి యగుగాక యనిదీవించెదరు గాక" ఈ వాక్యాలు ముట్నూరి 1938 ఫిబ్రవరి 12వ తేదీన రచించిన 'పేరంటము' అనే సంపాదక వ్యాసంలోనిది. ఇందులో మచిలీపట్నం యొక్క సాంస్కృతిక వైభవాన్ని ప్రశంసించారు. ముట్నూరి రచనలలోని భావావేశాన్ని ఉద్వేగాన్ని మనం రథోత్సవము (1937 ఫిబ్రవరి 13) అనే వ్యాసంలో గమనించవచ్చు. ఈరథము వేరేదీ కాదు. భారతజాతీయ కాంగ్రెసు రథమే. "అదుగో! కింకిణీ సమలంకృత మైన త్రివర్ణ పతాకాంచలములు దవ్వుల గాన్పించుచు చేర బిలుచు చున్నవి. అదిగో దేవి స్వర్ణరథ నేమిధ్వానము, సమీపించుచున్నది. అదిగో రథ మధ్య మున కాంతి తేజముతో వెలుగుచున్న ఆ తల్లి దివ్యమంగళ స్వరూపము. రమ్ము కృష్ణవేణీ! రమ్ము!రావే పినాకినీ! గౌతమీ ఆలసించెదవు సుమా! ఏమే తుంగభద్రా జాగు సేయకుము. దేవి రథము దాటిపోవుచున్నది. ఏదీ! ఆంధ్రప్రభ అని ఆ విశ్వజనని దరహాస సుందరవదనయై అడుగుచున్నది. రండు పావన త్రిలింగ రక్షితమై పుణ్యనదీ మాతృకాపాలితమైన మహాంధ్ర జనతా మహీయస్నేహాంజలి సమర్పింపుడు. జయభారత జననీ! జయ ఉదయాస్తాచలసేతు శీతనగ పరివేష్టిత పుణ్యవసుంధరా! జయ! జయ! ప్రజమయీ కాంగ్రెసు పీఠవాసినీ! జయవాత్సల్య

మయీ? జయ ప్రసన్నమూర్తీ! జయ అస్మచ్చిత్తాబ్జగేహా!" ఇలాంటి భావోద్రేక కవితామయ వాక్యాలు ముట్నూరి రచనలలో ప్రతిచోటనూ మనకు గోచరిస్తాయి. ముట్నూరిది జాతీయదృష్టి. చేతిమగ్గముల దురవస్తను చూచి ఆయన గాంధేయ దృష్టితో 1929 మార్చి 30 వ తేదీన ఒక చక్కని వ్యాసాన్ని రచించినాడు. మిల్లు వ్యాపారంలో సౌఖ్యమున్నట్లు కనపడ్డా దానివల్ల భారతీయ కుటీర పరిశ్రమలు ఎలా దెబ్బతింటున్నాయో చేతి మగ్గములను పునరుద్ధరించి బలపర్చవలసిన అవసరం ఎంతఉందో ఆయన స్పష్టమైన వాక్యాలలో నిరూపించి భారత జాతీయ ఆర్థిక విధానాన్ని బలపరిచాడు. "మిల్లునూలువచ్చి రాట్నములను పూర్తిగా త్రోసివేసినట్లు మిల్లుబట్టల మూలమున చేతిమగ్గములును చాలవరకు మూలబడెను. లోకాభ్యుదయమునకు మిల్లులే పరమ సాధనములని నమ్ముచుండిన నవీన సంస్కారులెల్లరు చేమగ్గములను క్రీగంటనైన చూడకుండిరి. ................అరువది డెబ్బది సంవత్సరముల క్రిందటి వరకు తాము చేనూలుతోనే బట్టలు నేయుచుంటిమను మాటను కూడ మరచిరి. నూరు సంవత్సరముల క్రిందట చేనూలుతో మగ్గములపై తయారుచేసిన సెల్లాలు లక్షల కొలది ఇగ్లండునకు ఎగుమతి చేయుచుండిన బందరు రేవు నేడు సీమ బట్టల దిగుమతి దారులకు నిలయమై వెలయుచున్నది...............పట్టణస్థులతో పాటు పల్లెటూరి జనము వ్యాపారస్థులతోపాటు పాటకపు జనముమ పలుచని సీమబట్టల రుచి మరిగిరి. ప్రజల రుచులు మిల్లుబట్టలపై తిరిగిన పిమ్మట నేతబట్టకిక స్థానమెక్కడ ? ఈ విధంగా జాతీయ విద్య, జాతీయ పరిశ్రమలు, జాతీయ ప్రభుత్వము, జాతీయ భాష వంటి వానిని ముట్నూరి తన రచనలలో నిత్యమూ ప్రోత్సహిస్తూ ఉండేవాడు. మనవారు సంస్కృత భాష యెడల చూపిస్తున్న నిరాదరణను ఆయన తీవ్రంగా విమర్శిస్తూ 1925 అక్టోబరు 31వ తేదీ ఒక చక్కని సంపాదకీయ వ్యాసం వ్రాశాడు. ఆ సంవత్సరం బందరులో సంస్కృత సాహిత్యసభ జరిగింది. అందులో సంస్కృత భాషాధ్యయనాన్ని గురించి వక్తలు గట్టిగా వక్కాణించారు. ఐతే వేదార్థ ప్రబోధము అన్ని వర్ణముల వారికి చేయించాలనే తీర్మానం ఒకటి చర్చకు వచ్చింది. దానిని కొందరు ఛాందసులు వ్యతిరేకించారు. అప్పుడు సభలో కొంత గందరగోళం జరిగింది. ముట్నూరి సంస్కరణాభిలాష భారత జాతీయ జీవనతత్వాన్ని గుర్తెరిగినవాడు. అందువల్లనే ఆయన వేదముల ఘనతను గుర్తించటమేకాదు. వేదములు విశ్వమానవులందరూ పఠించి తీరవలెనని గట్టిగా సంపాదకీయం వ్రాశాడు. వేదములకు అర్థం చెప్పటం కష్టమని ఒక పండితుడు ప్రతిపాదిస్తే దానిని ముట్నూరి తన సంపాదకీయంలో పరిహసించి వేదములు ఆధారంగానే అరవిందుడు తిలక్ మొదలైన విద్వాంసులు జర్మనీ ఫ్రాన్స్ ఇంగ్లండులోని ఇండాలజిస్టులు భారతీయ సంస్కృతిని అర్థంచేసుకుంటూ వేదార్థాన్ని వివరించటం ఈ సందర్భంలో ఉదాహరించాడు. "సంస్కృతమును

పేటికలలో దాచిపెట్టి పరులకంటపడకుండ చేయుచుండుట చేతనే దేవభాష మృతభాషయని పిలువబడుటకు గారణమగుచున్నది. వేదమొకరి సొత్తుకాదు. ఋషులు ఒక కాలముచే బంధింపబడువారుకారు. వేదము కాలాతీతమైన జ్ఞాన ధనము. ఆ మహాసాగరమునుండి ఎవరి యధికారమునుబట్టి వారు వారి వారి సంస్కారానుగుణ్యముగ జ్ఞానము నార్జింప గలుగుదురు. వేదపురుషునకు మైల సోకునేమో యని భయపడి వాని బూడ్చిపెట్టుటకంటె మహాపాతకము మరి యొకటి లేదు. స్వదేశములో కంటె ఖండాంతరములలో వేదమున కెక్కువ యాదరణ జూపబడుట దేశీయులకే లజ్జాకరము. ఋగ్వేదము అన్ని యూరపి యను భాషలలోనికి అనువదింపబడినది. జర్మనీలోని కీలు యూనివర్సిటీయందు వేదపీఠము నెలకొల్పబడినదని వినినప్పుడు మన దేశములోని యూనివర్సిటీ లన్నియు తలవంచకొనకుండ నెట్లుండగలవు" వేదములు మహత్తరములైనవని నవీనులకు ప్రశంసించవలసి వచ్చినప్పుడు మనపెద్దలు మాక్సుముల్లరు మాని యరు విలియమ్స్ మొదలగు పాశ్చాత్య పండితులయభిప్రాయములను ప్రకటించు కొనుచు సోదర దేశీయులు మాత్రము వానిని వినకూడదనియు చదువకూడ దనియు చెప్పుటకంటె బరిహాసాస్పదమైన విషయమేమి కలదు? ఈ విధంగా సంస్కృతభాషను సర్వులూ అధ్యయనం చేయాలని ప్రచారం చేయాలని ఆయన ప్రబోధించాడు. ముట్నూరిది సునిశితమైన దృష్టి. సూక్ష్మపరిశీలన. ఒకవ్యక్తిని గాని ఒక సిద్ధాంతాన్నిగానీ అంచనా కట్టడంలో ఆయన ఏమాత్రమూ పొరపాటు పడడు. 1936 వ సంవత్సరంలో రామకృష్ణ పరమహంస శతవార్షిక జయం త్యుత్సవం జరిగింది. ఆ సందర్భంలో ఫిబ్రవరి 29వ తేదీన ఆయన వ్రాసిన వ్యాసం చిన్నదైనా చాలా మిన్నయైనది. రామకృష్ణుని వ్యక్తిత్వం గురించి ఇంత చక్కగా అంచనాకట్టినవారు నాటికీనేటికీలేరు. రామకృష్ణుడిని సాక్షాత్తూ భగవంతుడని పూజించేవారున్నారు. ఉత్తముడైన మానవుని భగవంతునిగా మార్చి పూలుపండ్లు పెట్టి పూజచేసి తామమాత్రం సామాన్య మానవులుగా మిగిలిపోవడం మానవాళికి అనాదిగా వస్తున్న ఆచారం. దీనిని ముట్నూరి నిరసిం చాడు. ఆయనదృష్టిలో రామకృష్ణుడు అవతారంకాదు. అద్వైతి అంతకన్నాకాదు. ఇది వాస్తవం కూడా.రామకృష్ణ పరమహంస'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అనే హిందూధర్మ వాక్యాన్ని జీర్ణంచేసుకున్న పుణ్యపురుషుడు. శుష్కవాద ప్రతి వాదములలో చిక్కుకొని మతస్పర్థలు పెంచుకునే పండితమ్మన్యులకు ఈ రహస్యం తెలియదు. రామకృష్ణుడు బ్రహ్మసామాజికుల ఉపాసనలో పాల్గొని కూడా విగ్రహారాధనను వదలి పెట్టలేదు. ఒకపక్క కాళీమాతను ఎంత భక్తి శ్రద్ధలతో పూజించాడో ఏసునాథుని కూడా అంతే తత్పరతతో ఆరాధించాడు. "వీరిని (రామకృష్ణుని) ద్వైతి అనిగానీ అద్వైతి అనిగాని మాయావాది అనిగానీ కాదని కానీ చెప్పుటకు వీలులేదు. పరమహంసుడు అన్నియును అగును. విగ్రహా

రాధకుడు, బహుదేవతా రాధకుడు, ఏకేశ్వరోపాసకుడు, మాయావాది, ప్రకృతి ఉపాసకుడు, యోగి, సన్యాసి, గృహస్థుడు, సనాతనవాది, సంస్కర్త, సాధకుడు సిద్ధుడు" అన్నియును ఔతాడని శ్రీ కృష్ణారావు చెప్పాడు. రామకృష్ణుడు ముముక్షువయ్యును జన్మరాహిత్యమును ఆశించలేదు. నిజమే మోక్షంకూడా పెద్ద కామనయేకదా. రంతిదేవుడేమన్నాడు? "స్వామీ నాకు ధనకనకవస్తు వాహ నాదులు వద్దు. స్వర్గము వద్దు. చివరకు మోక్షమువద్దు. దీన దుఃఖితుల సేవలో ఇలాగే జన్మ జన్మలు జీవితం గడిపే అదృష్టం నాకు ప్రసాదించు" సరిగ్గా రామకృష్ణ పరమహంస కూడా ఈ విధంగానే ప్రార్థించాడు. సకల జీవరాసుల లోనూ వ్యాపించి ఉన్న భూతాధినాధుని పతితుల శరణ్యమగు ఆ పతితపావనుని బీదల కల్పతరువగు ఆ దరిద్రనారాయణుని సేవింపగల్గితినేని నేనెన్ని పర్యా యము లైనను పుట్టుచు, గిట్టుచు దుఃఖసాగరమును ఆనందముతో ఈదుటకు వాంఛింతును. రామకృష్ణుని ఈహృదయాన్ని కృష్ణారావు అర్థంచేసుకొని ఆవిష్క రించాడు. కృష్ణారావుకూడా మహా తాత్వికుడే కాబట్టి మహాత్ముల మార్గాలు స్పష్టంగా విశ్లేషించ గలిగాడు. గాంధీగారిని దేవునిక్రింద పూజించటము కస్తూరి వల్లభాయనమః ఓం 'షోకలాలి మిత్రాయనమః ఓం' అని అష్టోత్తరాలు వ్రాయ డము మనం చూచాము. బాలగంగాధర తిలక్‌కు శంఖ చక్ర గదా పద్మాలు పెట్టి విష్ణుమూర్తి పదవ అవతారంగా గుడికట్టడం మన కళ్ళ ఎదుటనే జరిగింది. కృష్ణారావు ఇలాంటి వాటిని నిరసించాడు. మహాత్ముని 'అవతార రహస్యం' అనే సుదీర్ఘమైన వ్యాసంలో (1929 ఏప్రియల్ 6) మహాత్ముడు అవతారపురుషుడని లోకోద్ధారకుడని ఎట్లు నమ్మగలము? భక్తుడుకావచ్చును, త్యాగి కావచ్చును. ధైర్య శాలి కావచ్చును, రాజకీయాందోళకుడు కావచ్చును. సంఘ సంస్కర్తయైనను కావచ్చును. అంత మాత్రముచేత నీతడు అవతార పురుషుడను దివ్యనామమును బడయుటకు అధికార మెక్కడ? దానికిప్రమాణమేమి? పదిమంది కూడి అనినంత మాత్రమున అవతార పురుషుడు కాగలడా? నిజమే ఈ బిరుదము నొకరిచ్చుటకు గాని ఒకరు పుచ్చుకొనుటకు గాని అధికారము లేనిమాట నిజము. అవతార పురుషుడనిన నేమియని తర్కవితర్కములు చేయనారంభించిన యెడల అ వివాద మునకంత ముండజాలదు. శబ్దజాలము మహారణ్యము గమ్యము చేర్చలేని వట్టి విభ్రమణములకే కారణమగును. ఆ నామము వివాదగ్రస్తమై మహాత్ముని సుస్వ రూపమును వెల్లడించుటకు బదులు మసుగు చేయుటకు కారణమగునెడల దానిని వదిలివేసి వానినొక మహాపురుషునిగనే భావించి ఈ విషయమును బరిశీలించె దము. చందన తరువు నే పేరుతో పిలిచినను దాని పరిమళము మారదు" అని వ్రాస్తూ మానవునిలోని మహనీయతను చాటాడేకాని గొప్పవారిని దేవుళ్ళుగా చేసి గుడికట్టి కొబ్బరికాయకొట్టి తన బాధ్యత తప్పించుకునే ధోరణిలో జీవించలేదు. కృష్ణారావు బ్రహ్మసమాజ ప్రభావం ఒకవైపు, అరవిందుని మహా మానవతావాదం

మరొకవైపు పడుగుపేకలవలె అల్లుకున్నాయి. ఓతప్రోతమై సాగిన ఈ కలనేత వస్త్రమే ఆధ్యాత్మికతత్వపు కలంకారీ అద్దకంతో మచిలీపట్నపు మంచి వస్త్రంగా మారింది. కృష్ణారావు జాతీయ సమైక్యతావాది. దేశంమొత్తం భావాత్మకంగా సమైక్యం కాకుండా ఏమీ సాధించలేమని అట్టివారికి స్వాతంత్ర్యం లభించదని ఆయన స్పష్టీకరించాడు. "భారతజాతి భారతజాతి, అని ప్రగల్భించుచున్నాము. దీనిని మూలమంట ఛేదించు రాష్ట్ర వైషమ్యములు నేడు తల ఎత్తినవి. రాష్ట్రమునకు రాష్ట్రమునకుగల ప్రయోజనములు యోగక్షేమములు పరస్పర విరుద్ధములని మనం నమ్మేయెడల ఇక జాతీయ ఐక్యమును గురించి మాట్లాడుట వ్యర్థము. అంతఃకలహములలో చిక్కుకున్న ప్రజలుగల ఏ దేశమును ఉన్నతస్థితికి వచ్చినట్లు చరిత్రలో ఎచ్చటనూ కన్పట్టదు. స్వార్థము స్పర్థలకు ఆకరము భిన్న స్పర్థలకు నెలవైన దేశీయులు పరదేశీయులచే శాసింపబడక తప్పదు. వారికి స్వాతంత్ర్యము అప్రాప్యము" అని ముట్నూరి 1936 మార్చి 21 వ తేదీ కృష్ణా పత్రికలో రాశాడు. ఇది వ్రాసిన 45 సంవత్సరాలు తరువాత కూడా ఈ వాక్యాలు సజీవంగా సప్రయోజనంగా ఉన్నాయి అని అంటే ఋషితుల్యులైన రచయితలు క్రాంత దర్శనులనే వాక్యం నిజమౌతున్నదిగదా. ముట్నూరి ఎంతటి కవియో అంతటి తాత్వికుడు. ఎంతటి మేధావియో అంతటి బహుప్రజ్ఞాశాలి, జాతి ద్వేషాలను గురించి, గ్రీకు రిపబ్లిక్ గురించి, లెనిన్ గురించి, వర్ణవిద్వేషాల గురించి (నీగ్రో సమస్య) ఎంతటి రాజకీయ పరిజ్ఞానంతో వ్రాశాడో అంతకన్నా మిన్నయైన ప్రజ్ఞతోనే ఆధ్యాత్మిక విషయాల గురించి ఆంధ్ర శిల్పకళా లక్షణములను గురించి, లలిత కళలను గురించి వక్కాణించాడు. శిల్పకళలోని సమయ సాంకేతిక సంప్రదాయ జనితరూపాలు బాహ్య జగత్సత్యవాదం (Symbolism Realism) ఆదర్శవాదం (idealism) శిల్పసమయరీతులు (Conventions) వంటి శాస్త్రీయ విషయాలను గురించి ఎంతో సూక్ష్మంగా పరిశీలన జరిపి ఆంధ్ర శిల్పమంటూ ప్రత్యేకమైన ఒక శిల్పం లేదని రీతులు వేరైనా అఖిల భారతీయ శిల్పాత్మ ఒక్కటేనని చాటాడు. (1936 ఫిబ్రవరి 22 వ తేదీ వ్యాసం).

ముట్నూరి జాతీయ హృదయాన్ని ఆయన వరుసగా రచించిన జాతీయ విద్య అనే మూడు వ్యాసాలలో చూడవచ్చు. జాతీయ విద్య అంటే మన చదువులు చదువుకోవడం మాత్రమే కాదు మనదైనదంతా పునరుద్ధరించుకోవడం. అది ఆర్థిక సాంఘిక సాంస్కృతిక కళా రాజకీయరంగాలన్నిటికీ వర్తిస్తుంది. మన వేషములు నిర్మించు గృహాలు, వాడుకొను ఉపకరణములు, ఆడుకొను ఆటలు ప్రకటించు అభినయములు అన్నీ పాశ్చాత్యమయములైనాయని కృష్ణారావు విచార పడ్డాడు. మేడువా భవంతులుపోయి బంగళా పంపిణీలు వచ్చినవి.

పంచపాత్రలు అబుకూరాలు, జారీచెంబులు పోయి గ్లాసులు టీ కప్పు మాదిరులు వచ్చినవి. ద్వారబంధములపై పద్మములు చెక్కకూడదు. ధోవతులకు బోడ సరపు అంచులు పనికిరావు. కలంకారీ అద్దకములు పోయి సీమచీటీ గుడ్డలు వెలసినవి. నాటకశాలల యందలి తెరపైకూడ గ్రీకురోమను మూర్తులెక్కినవి. తుదకు శిశువులాడుకొను బొమ్మలు కూడ సీమనుండియో జర్మనీ నుండియో దిగుమతి కావలెను. ఇయ్యది ఆర్థిక విషయముకాదు. విద్యాధికుల చూపులో రసజ్ఞతలో, విపరీతములైన వికారములు కలుగుటచే భారత కళాలక్ష్మి స్పృశించిన ప్రతి వస్తువు, ప్రతి యలంకారము విద్యాధికుల బుద్ధికి నిషద్ధమైనది" (1926 వ సంవత్సరము అక్టోబరు 2 వ తేదీవ్యాసం). స్వాతంత్ర్యం రావడానికి ఇరవై సంవత్సరాల ముందు వ్రాసిన ఈ వ్యాసం స్వాతంత్ర్యం వచ్చిన ముప్ఫై సంవత్సరాల తరువాత కూడా మనకు యధాతధంగా అన్వయిస్తూనే ఉన్నది కదూ.

తెలుగులో ఈ శతాబ్దంలో చక్కని వచన రచన చేసిన శబ్దశిల్పులు కొందరు ఉద్భవించారు. వారిలో కృష్ణారావు, పానుగంటి, రాళ్ళపల్లి నాదృష్టిలో ప్రముఖులుగా చెప్పుకో దగినవారిలో కొందరు. ముగ్గురిలోనూ వ్యంగ్యము హాస్యము అంతర్లీలమై ఉంటుంది. ముగ్గురివాక్యాలు మనలకు గిలిగింతలుపెడుతూ ప్రబోధాత్మకంగా ముందుకు నడిపిస్తాయి. ఐతే రాళ్ళపల్లి వాక్యాలు లాలిత్యాన్ని పుణికి పుచ్చుకుంటే పానుగంటి శైలిలో వాడి వేడి ఎక్కువ పాలులో ఉంటుంది. కృష్ణారావు వాక్యాలు మనలను ఎక్కువగా ఆలోచింపచేస్తాయి. మన హృదయకవటాలు తెరిచేందుకు తోడ్పడతాయి. మన "లోవెలుగు" లను దర్శించుకునేందుకు సహాయపడతాయి. కృష్ణారావు ఒకతాత్వికుడు, ఒకకవి, కళామర్మమెరిగిన ద్రష్ట. స్రష్ట. అన్నిటికన్నా మిన్నగా నూటికి నూరు పాళ్ళ జాతీయవాది. డాక్టరు రావూరు వేంకట సత్యనారాయణరావుగారు "మరియొక కృష్ణారావు జన్మించునా? అతడిట్ట సంపాదకీయములు రచించునా? కృష్ణాపత్రిక వెలుగు తిరిగి తెలుగు నేలపై ప్రసరించునా? ఇదీ నా సందేశము." అనే ఈ వాక్యాలతో ఏకీభవిస్తూ ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను.

# విశ్వనాథ సత్యనారాయణ.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

## శిల్పమార్గ ప్రవర్తకుడు

'Cricism, as I understood it, is the endeavour to discriminate between experiences and to evaluate them' అని ఐ. ఏ. రిచర్డ్స్ అన్నాడు. కావ్యానుభూతుల వివేచనం, వాని అనుశీలనం సాహిత్య విమర్శస్వభావం. అనుభూతి అనే పదం విస్తృతార్థంలో వాడబడింది. ఒకకావ్యాన్ని చదువుతున్నప్పుడు సహృదయుడు పొందే అనుభవం పరంపరా రూపంగా ఉండవచ్చు, లేదా కావ్యం మొత్తం చదివినతరువాత అది యిచ్చే పర మార్థరూపమైన ఒకఅనుభవమూ కావచ్చు. రెండువిధాలా అనుభూతులూ ఉండ వచ్చు. వానిని గుర్తించటం, అనుశీలించటం తారతమ్యాన్ని వివేచించటం, తాత్పర్యాన్ని సంవదించటం విమర్శలక్షణ మౌతుంది. అనుభూతి సాహిత్యాని కున్న విలువ. అనుభూతిని అధ్యయనంచేయటం విలువలకు విలువకట్టటం. విలు వలకు విలువలుకట్టే విద్య శిల్పం. కవి కావ్యంలో సృజనాత్మక చైతన్యంతో విలువలను కల్పించి శిల్పిస్తాడు. విమర్శకుడు వివేచనంతో విలువలను వివేచించి శిల్పాన్ని అనుశీలిస్తాడు. అందువలననే రిచర్డ్స్ To set up as a eritic is to set up as a Jubge of values" అని అన్నాడు. విశ్వనాథ ఎంతటి కవియో అంతటి విమర్శకుడు. 'కవిసమ్రాట్'గా ఒకవైపు "విమర్శకచక్రవర్తి"గా మరోవైపు గుర్తింపబడినాడు. ఆయనకు విలు

వలకు విలువలను కల్పించే కవితాశిల్పం తెలుసు. విలువలకు విలువలను కట్టే విమర్శ శిల్పం తెలుసు. ఆంధ్రసాహిత్యవిమర్శ ప్రస్థానంలో విశ్వనాథవారిది శిల్పమార్గం. దానికి ఆయన మార్గదర్శి, మహర్షి.

## ముచ్చటైన మూడుమార్గాలు

ఒక సాహిత్య విమర్శకుని స్థానాన్ని నిర్దేశించటంలో పరిగణింపవలసిన ప్రధానాంశం- ఆయన ఏకావ్యాలమీద విమర్శ సాగించా డనే దానికంటే ఆ విమర్శ నేపద్ధతిలో ప్రస్తరించాడన్న వివేచనం. ప్రవృత్తినీ, ప్రవర్తననూ బట్టి విమర్శను విశ్లేషణం చేయటం విజ్ఞలోకం పాటిస్తున్న విధానం. ఆంగ్ల సాహిత్య విమర్శను ప్రవృత్తి ననుసరించి జార్జి వాట్సన్ మూడువిధాలుగా సంభావించడం ప్రసిద్ధం. అవి– 1. Legislative criticism 2. Theoretical Criticism 3. Descriptive criticism. ఈవిభాగాన్ని మన తెలుగుసాహిత్య విమర్శకుకూడా అనువర్తింప చేసికోవచ్చు. దేశీయమైన పేర్లుకూడా పెట్టుకో వచ్చు. అలా అయినప్పుడు ఆమూడువిధాలనూ 1. కావ్యలక్షణం 2. కావ్య మీమాంస 3. కావ్యానుశీలనం అని పిలుద్దాం. కావ్యలక్షణం ప్రధానంగా లక్షణ గ్రంథరచనకు సంబంధించింది. ఇది పఠితలకంటె కవులనే ఉద్దేశించి రచించే సాహిత్యప్రమాణప్రవచనం. ఇది అనువర్తితవిమర్శ(applied criticism)కు ఆదర్శసూత్రాల నందించగలదే కాని, అనుశీలనప్రవృత్తిని ప్రవచింపదు. కావ్య మీమాంస లక్షణగ్రంథా లందించే శాశ్వతప్రమాణాలకంటె ప్రక్రియ కనువైన సాపేక్షప్రమాణాలను కావ్యతత్త్వసమాలోచనంలో సృష్టించుకొనే స్వాతంత్ర్యాన్ని భజిస్తుంది. ఈరెండింటికంటె ఆధునిక మైనదీ, ఆదరణీయ మైనదీ కావ్యాను శీలనం. ఇందులో కావ్యార్థాల ఔచిత్యవిచారం, కావ్యాంగసార్థక వివేచనం, కావ్యతత్త్వసౌందర్యాలసందర్శనం, కావ్యార్థాలసమన్వయం అనే అంశాలు ప్రధానపాత్ర నిర్వహిస్తాయి. జార్జి, వాట్సన్ మాటల్లో —"Descriptive criticism is always about some perticular text whether of the ctiticism own or of another, and the critic, instead of laying down general rules or theoring in general terms, analysis the work in hand, traces the influcnces that have given rise to it, and then discusses it critically item by item". కావ్యం కవికర్మ యైన సౌందర్య సృష్టి. సహృదయుడు దాని భోక్త, విమర్శకుడు కావ్యకళాసౌందర్యతత్త్వానుశీలి యైన వక్త. కావ్యానందం విమర్శకు డందించే అనుశీలనంవల్ల అర్థవంతమై ఆలోచనామృత మౌతుంది. ఈ స్వభావాన్ని ముద్రించుకొని ప్రవర్తిల్లేదే ఆధునిక సాహిత్య విమర్శ.

తెలుగులో కావ్యానుశీలనాన్ని కమనీయంగా ఆవిష్కరించి ఆధునిక

సాహిత్యవిమర్శకు వినూత్నమార్గాన్ని అందించినవారు డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు. వారి కవిత్వతత్త్వవిచారం ఈ ప్రస్థానానికి నిర్దిష్టమైన బాటలు వేసింది. విశ్వనాథ సత్యనారాయణగారేఈవిషయాన్ని గుర్తించారు. "ఈరోజుర్లో కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్త్వవిచారము వ్రాసి విమర్శన పథాల్లో గొప్పదృక్పథం కలిగించి నవ్యసాహిత్యానికి కొత్తబోదెలు తవ్వారు"- అని వారు పేర్కొనటం గమనింపదగిన అంశం. విశ్వనాథలో ఉన్న విశేష మేమంటే – ఆయన క్రొత్తను గుర్తిస్తాడు. కాని, దాన్ని గ్రుడ్డిగా అనుకరించడు; దాన్ని పరిశీలిస్తాడు, పరిష్కరిస్తాడు, పరిపూర్ణతను భావిస్తాడు, ప్రయోగంగా ప్రస్తరిస్తాడు. దానితో ఒక ప్రత్యేకతను సాధించుకొంటాడు. కట్టమంచి వారి కావ్యానుశీలనం విశ్వనాథ సాహిత్య విమర్శకు ప్రవృత్తిని ప్రసాదించినా, ఆయన ప్రస్తారం ఒక విశిష్టవ్యక్తిత్వంతో ముందుకు సాగింది.

## ఉద్యమాల ఉన్మీలనం

ఈఅంశాన్ని ఇదమిత్థంగా నిరూపించేముందు సాహిత్యవిమర్శప్రవర్త నాన్నిబట్టి వివేచింపదగిన విమర్శోద్యమాల స్వరూప స్వభావాలను వింగడింప వలసివస్తుంది. దీనికి కొంత చారిత్రకపరిణామ వాస్తవ పరిశీలనం అవసరం.

తెలుగులో అనువర్తితసాహిత్యవిమర్శకు వీరేశలింగం పంతులుగారి యుగంలోనే పునాదులు వేయటం జరిగింది. నన్నయనుండీ, వీరేశలింగంపంతులు గారిదాకా ఆంధ్రసాహిత్యవిమర్శచరిత్రలో అంధకారయుగ మని చెప్పాలి. అంటే ఆయుగంలో విమర్శ లేదని కాదు. వెలుగులోకి రాలేదు. కాలగర్భంలో కలిసి పోయింది. అయితే విమర్శకు కావలసిన వివేకబీజాలు కావ్యనిక్షిప్తం చేసి పెట్టారు ప్రాచీనాంధ్రకవులు. నన్నయాదులు తమకృతుల్లో ఏలాక్షణికవేత్తనూ స్మరింపలేదు. అట్లని వారికి కావ్యలక్షణంమీద ప్రమాణబుద్ధి లేదని చెప్పలేము. సాహిత్యజగత్తులో ఆయాకాలాల్లో ఆయానూత్నకావ్యరచనాప్రయోగాలు చేస్తూ వచ్చిన ప్రాచీనకవులు తమ ప్రయోగాలను అనుశీలించటానికి అనువైన సాపేక్ష ప్రమాణ సూత్రాలను అవతారికల్లో పొందుపరుస్తూ వచ్చారు. అంటే, మొదటి నుంచీ తెలుగుకవులకు కావ్యలక్షణ విమర్శకంటె, కావ్యమీమాంసయే మనసుకు నచ్చిన మార్గ మన్నమాట! ఈ కావ్యమీమాంసాప్రవృత్తియే మనప్రాచీనకవులు మన కిచ్చిన సాహిత్యవిమర్శ దృక్పథం.

ఈ కావ్యమీమాంసాప్రస్థానంలో కవిత్రయయుగం విమర్శకు సంబంధించి నంతవరకు సూత్రయుగంగా పేర్కొనవచ్చు. నన్నయాదుల కృతులలోని అవతారికల్లో కానవచ్చే సాపేక్షప్రమాణాల ప్రసక్తియే యీయుగంలో చెప్పుకో దగిన విమర్శ. కావ్యప్రబంధయుగాలలో కావ్యప్రయోగాలలో కవులు సాపేక్ష సూత్రాలతోపాటు వాటికి వృత్తులవంటి సాహిత్యప్రవృత్తులను ప్రస్తావించంట

కనపడుతుంది. కవులు స్వయంగానో, పాత్రలముఖంగానో ఈవృత్తులను కావ్యస్థం చేశారు. అందువల్ల కావ్యప్రబంధయుగకాలం సాహిత్యవిమర్శచరిత్రలో వృత్తియుగమని చెప్పవచ్చు.

కావ్యప్రబంధయుగాల్లోనే తెలుగులో లక్షణగ్రంథరచనం సాగింది. ఆంధ్ర లక్షణగ్రంథాల్లో వినూత్నసాహిత్యసిద్ధాంతాలు ప్రతిపాదించేవి అసలు లేవనే చెప్పాలి. అనువాదాలు బహుళం. తెలుగుతో వెలసిన నూత్నప్రయోగాల లక్షణ వివేకం చేసే ప్రవృత్తి వాటిలో మృగ్యం. తెలుగుకవుల సాపేక్ష ప్రమాణాల విచారం అందులో మందుకైనా కానరాదు. దేశీప్రక్రియల్లో కొన్నింటి స్వరూప స్వభావాలు నిర్దేశించటానికి ఎడనెడ ప్రయత్నం జరిగినా అనువర్తితవిమర్శ కది అన్వయాల నందించలేదు. అందువల్ల కావ్యలక్షణానికి సంబంధించినంతవరకు తెలుగులో సంస్కృతలక్షణగ్రంథాలే శరణ్యాలైపోయాయి. ఆంధ్రలక్షణ గ్రంథాల ప్రభావం తెలుగువిమర్శమీద గగనకుసుమమైపోయింది. ఆంధ్రకవుల ప్రయోగవైవిధ్యంలో ప్రపంచింపబడిన ప్రత్యేకత ప్రదర్శితం కాకుండా మిలిగి పోయింది. ప్రయోగాల ప్రవృత్తిని తెలిసికొనే ప్రాథమిక సూత్రపరిజ్ఞానం ప్రాచీన కవులు మన కందించినా వాటిని ప్రసరించుకొనే సాహిత్యవిమర్శ అవత రించకపోవటంచేత వీరేశలింగంపంతులుగారికి ముందున్నయుగం అంధకారయుగ మని పేర్కొనటం జరుగుతోంది.

సాహిత్యవిమర్శచరిత్రలో వీరేలింగంపంతులుగారియుగాన్ని వ్యాఖ్యాయుగ మనీ, వివరణయుగ మనీ పిలువవచ్చును. ముద్రణయంత్రసౌకర్యం వచ్చిన తరువాత సాహిత్యపత్రికలు వెలువడటం, గ్రంథప్రచురణం సాగటం ఈ యుగ చైతన్యానికి మూలశక్తులుగా నిలచాయి. మెకంజీ, బ్రౌన్ వంటి పాశ్చాత్య పండితుల పరిశ్రమలు ఈ యుగానికి దోహదాన్ని కల్పించాయి. జూలూరి అప్పయ్య, గరిమెళ్ళ వెంకయ్య, పైడిపాటి వెంకటనరుసు, ములుపాక బుచ్చయ్యశాస్త్రి, కావలిసోదరులు, మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి, రావిపాటి గురు మూర్తి వంటివారు కావ్యావాఖ్యలకు అక్షరరూపాలను కల్పించారు.

నవ్యసాహిత్యయుగోదయంలో రూపొందిన కొన్ని విమర్శోద్యమాలను గమనిస్తే ఆధునికసాహిత్యవిమర్శయుగానికి ఎలా బలమైన ప్రాతిపదికలు పడ్డాయో అవగత మౌతుంది. ఏసాహిత్యవిమర్శకైనా భూమికగా నిలిచేది పరి ష్కృరకావ్యపాఠం. దాన్ని సిద్ధంచేసే విమర్శవిధానాన్ని ఇంగ్లీషులో *Textual criticism* అంటారు. తెలుగులో దీన్ని పాఠపరిష్కారవిమర్శ. అనవచ్చు దీనికి రూపందిద్దిన మనీషి బ్రౌన్. ఆతరువాత ఆంధ్రపండితు లెందరో ఆమార్గాన్ని ఘంటాపథం చేశారు. దీనికి పోషకంగా నిలిచేది కవులచరిత్రనిర్మాణం. దానికి వీరేశలింగంగారు ప్రాణప్రతిష్ఠ చేశారు. జయంతి రామయ్యపంతులు వంటివారు

ఆబాటలో నడిచారు. కవిజీవితానికీ, కావ్యరచనకూ ఉన్నసంబంధాన్ని పరిశీలించేది కవిసాహిత్య వ్యక్తిత్వవిమర్శ(*Biographical criticism*). ఇందులో కవియొక్క భౌతిక, మానసిక, తాత్త్విక జీవిత విశేషాలను విశ్లేషించి, అవి కావ్యరచన కెలా దోహదాలై నిలిచాయో పరిశీలించే ప్రవృత్తి ప్రధానంగాఉంటుంది. మానవల్లివంటి పండితు లీపద్ధతికి నారు పోసి నీరు పోశారు. దీనికి ఆసటబాసటగా నిలిచేది చారిత్రకవిమర్శ(*Historical method of criticism*). కవికాల నిర్ణయాలు, గ్రంథపౌర్వాపర్యచర్చలు, కవిజన్మస్థలచర్చలు, పూర్వకవుల ప్రభావ పరిశీలనాలు. అనంతరకవుల అనుసరణవివేచనాలూ మొదలైనవి యీ శాఖలో పండే ఫలాలు. దీనికి అనుబంధంగా సాగేది తులనాత్మకవిమర్శ (*Comparative criticism*). ఒక్కొక్క ప్రక్రియలో వెలువడుతున్న కావ్యాల సాహిత్యప్రమాణాలను నిరూపించటానికి ఈవిమర్శ నికషోపలంలా పనికి వస్తుంది. దీనికిసమాంతరంగా సాగేది లాక్షణికవిమర్శ *Judicial criticism*. లక్షణగ్రంథాల్లో నిర్దేశింపబడిన ప్రమాణాలకు అనుగుణంగా కావ్యార్థాలను లక్ష్యలక్షణసమన్వయమార్గంలో విమర్శించే పద్ధతి యిది. వేదం వెంకటరాయశాస్త్రిగారి వంటి పండితవిమర్శకు లీమార్గాన్ని పోషించారు. దీనివెంట ఖండనమండనలు, శబ్దార్థసాధుత్వచర్చలూ, తర్కమీమాంసలూ, అలంకారచర్చలూ, మొదలైనవి బయలుదేరి సాహిత్యవిమర్శను సిద్ధాంతరాద్ధాంతరంగంగా మార్చివేశాయి. ఇవన్నీ కందుకూరి వీరేశలింగంయుగంలో సాహిత్యవిమర్శ చేసిన సాముగరిడీలు. అయినా, ఈయుగచైతన్యం సాహిత్యవిమర్శ కిచ్చిన వరాలు ఐదు. 1. పరిశోధనప్రవృత్తి 2. చారిత్రకస్పృహ 3. సాహిత్యచరిత్రనిర్మాణప్రయత్నం 4. లాక్షణికవిమర్శదృక్పథం 5. తులనాత్మక విమర్శవివేకం. ఇవి సాహిత్య విమర్శకు చేవను కల్పింపగలవేకాని జీవితాన్ని ప్రసాదింపలేవు. విమర్శకు జీవితాన్ని ప్రసాదించింది కట్టమంచి రామలింగారెడ్డిగారు.

## సజీవ సాహిత్య విమర్శ

"*Literary criticism is an art about art*" అన్నాడు వాల్టర్ పాటర్ ఈఅనుభూతిని సాహితీజగత్తుకుఅందించిన ఆధునిక సాహిత్యవిమర్శకుడు డా. కట్టమంచి. ఆయన సాహిత్య విమర్శలోని అనుశీలనలక్షణాన్ని అభివ్యక్తీకరించాడు. అది ఆనాటికి కొత్త ప్రయోగం కాబట్టి కట్టమంచివారు కావ్యానుశీలన యుగాన్ని (*Age of evaluative criticism*) ప్రవర్తింపచేశా రనవచ్చును.

కట్టమంచివారి కవిత్వతత్త్వవిచారం విమర్శలోకానికొక కనువిప్పును కలిగించింది. అంతకు పూర్వం కావ్యాన్ని విశ్లేషించే విధానం ప్రచారంలో ఉండగా వా రాగ్రంథంద్వారా కావ్యానికి విలువలుకట్టే విధానం విమర్శలో ప్రవేశ పెట్టారు. చారిత్రకస్పృహకంటె సాహిత్యమీమాంసాస్పృహను విమర్శ కెక్కువ నేర్పారు; పాశ్చాత్యప్రమాణాలను ప్రాచీనాంధ్ర కావ్యానుశీలనంలో

ప్రయోగించి విమర్శ ప్రస్తారాన్ని సాగించారు. ఈఅభినవదర్శనంలో సజీవ విమర్శ ఆవిర్భవించింది. కావ్యంలో ఆత్మభూతమైన కవితాతత్త్వం కేంద్రంగా కావ్యనిర్మాణాన్ని వివేచించాలన్న వివేకం కట్టమంచివారు తెలుగువిమర్శకు నేర్పారు. అనుశాసనంకంటె అనుశీలనం ఆధునికవిమర్శకు అనువైన పద్ధతి యని ఆయన ప్రయోగం స్పష్టంచేసింది.

కట్టమంచివారు తెలుగుకు సృజనాత్మక విమర్శను చవిచూపించారు. తెలుగులో కావ్యలక్షణాన్ని ఆలోచించే అలవాటు చేశారు. ఆయన ఎంతటి ఆంగ్ల భాషాపండితుడో అంతటి ఆంధ్రభాషాభిమాని. తెలుగులో మాట్లాడితే పొల్లుకైనా ఇంగ్లీషుపదం దొర్లేది కాదు. ఆయనవిమర్శకూడా ఆలక్షణాన్ని అలవరుచు కొన్నది ఆయన తనవిమర్శకు ప్రమాణాలన్నీ చాలవరకుఆంగ్లసాహిత్యంలో నుండి తెచ్చుకొన్నవే. కానీ, అవి ఎరువుతెచ్చుకున్న ట్లుండవు. విజాతీయాలుగా తోచవు. వారు కావ్యానుశీలనంలో ప్రమాణాలుగా ఉపయోగించే భావనాశక్తి (*Imagination*), వస్త్వైక్యం (*unity of Plot*) మొదలైనవి విదేశీయాలైనా విశ్వ జనీనాలుగా వారివిమర్శలో భాసించాయి. పాశ్చాత్యప్రమాణాలను వివరింపవలసి వచ్చినప్పుడు ఆయనరచనలో లక్షణవాక్యాలు దొర్లుతాయి. కాని, అవి అనువాదా లుగా అనిపించవు. లక్షణంకోసమే చెప్పినట్లుండవు. అనుశీలనంలో ఉపకరించే వివేకవీచికల్లా భాసిస్తాయి. అందువల్ల విమర్శకు శాస్త్రరూపంకటె కళారూపం అధికంగా అలవడింది. కళాగౌరవాన్ని పొందినవిమర్శయే సజీవసాహిత్యవిమర్శ.

## అనుశీలనంలో ఆత్మాశ్రయ ధోరణి

అనుశీలనం(*Evaluative criticism*) లో ఆత్మాశ్రయధోరణిని సంప దించటం కట్టమంచివారి ప్రత్యేకత. ఒకమహాకవిరచనను ఒకవిమర్శకుడు చదివినప్పుడు అతనిపై ఆకావ్యం వేసేప్రభావాన్నీ, అతనిలో కలిగించే అనుస్పం దనను ఆశ్రయించుకొని అతడు చేసే కావ్యానుశీలనాన్ని ఇంగ్లీషులో *Impressionistic criticism* అంటారు. తెలుగులో దీన్ని 'అభిరుచివిమర్శ' అన వచ్చు ననుకొంటున్నాను. ఆంగ్లంలో ఈవిమర్శశాఖకు ప్రవర్తకుడైన వాల్టర్ పాటర్ దాని స్వరూపస్వభావాలను వివేచిస్తూ-విమర్శకునికి కావ్యానుశీలనంలో నిర్దుష్టమైన సాహిత్యసౌందర్యసిద్ధాంతాలు ఉన్నా లేకపోయినా, అతనిదైన ఒక ప్రత్యేక దృక్పథం ఒక మనస్తత్వం కొట్టవచ్చినట్లు కనపడుతుండాలనీ, అయితే మౌలికంగా అతడు సౌందర్యసందర్శనంలో తన్మయుడయ్యే సాత్త్వికసహృద యుడై ఉండాలనీ పేర్కొన్నాడు. ఈశాఖలో కవి యెంతటివాడో విమర్శకుడూ అంతటివాడు కావచ్చు. ఇరువురికీ వారివారి దృక్పథాలు ఉండవచ్చు, కవియొక్క అభిరుచి విమర్శకుని అభిరుచితో సంవదింపకపోతే యీవిమర్శలో కవి విమర్శకు గురికావచ్చు. విమర్శకునిదృక్పథమే యిందులో పరమప్రమాణం.అందువల్ల అను

శీలనంలో ఆత్మాశ్రయధోరణి ప్రసరించి అభిరుచివిమర్శ రూపురిద్దుకోవచ్చు. కట్టమంచివారిపట్ల అచ్చంగా జరిగింది ఇదే.

కట్టమంచివారిది పాశ్చాత్యదృక్పథం. ఆయన ప్రధానంగా పరిశీలించింది పాశ్చాత్య దృక్పథంలేని ప్రాచీనాంధ్ర సాహిత్యం. అయితే, ప్రాచ్యపాశ్చాత్య కావ్యలక్షణాల్లోకూడా విశ్వజనీనాలైనవి కొన్ని ఉంటాయి. ప్రక్రియలనుపట్టి సాపేక్షప్రమాణాలు కొన్ని మారవచ్చు. పురాణాన్నీ, ఇతిహాసాన్నీ, కావ్యాన్నీ, ప్రబంధాన్నీ, భావకవిత్వాన్నీ అన్నిటినీ ఒకే దృక్పథంతో విమర్శించలేము. కట్టమంచి తనదైన సాహిత్య సంస్కారంతో ప్రాచీన కావ్యాలను, ప్రబంధాలను అనుశీలించి విలువలు కట్టే ప్రయత్నం చేశాడు. ఆయనకు ప్రమాణాలు పట్టి నంతగా ప్రక్రియలు పట్టలేదు. పాశ్చాత్యకావ్య లక్షణ ప్రమాణంతో ప్రాచీనాంధ్ర కృతులను ప్రక్రియా వివక్షలేకుండా అనుశీలించి గుణదోషవిచారం చేశా రాయన. అందువల్ల కవిత్వతత్త్వవిచారం కావ్యానుశీలనంలో అంతర్దృష్టిని ప్రవేశపెట్టినా, ప్రక్రియల ప్రత్యేకప్రతిపత్తిని వివేచింపలేక కావ్యతత్త్వానుశీలనంలో విచక్షణను కోల్పోయింది. అభిరుచివిమర్శస్పర్శవలన కలిగిన ప్రభావమే యిది. అభిరుచి విమర్శ ఆత్మాశ్రయధోరణితో సంవదించటంచేత వినేవారికి వింతరుచులను కలిగిస్తుంది కాని, విశ్వజనీనతను సర్వత్రా సాధింపలేదు.

అనటోల్ ఫ్రాన్స్ (Anatole France) ఈ అభిరుచి విమర్శను "మహాకావ్యాల మధ్య మానవాత్మ చేసే మహాసాహసప్రస్థానం" (The adventures of a soul among masterpieces) గా అభివర్ణించాడు. కట్టమంచివారు చేసిందికూడా ఇదే.

## శిల్పానుశీలనయుగం

పాశ్చాత్య విమర్శోద్యమాలలో అభిరుచివిమర్శలోనున్న ఆత్మాశ్రయ ధోరణులవలన కలిగే అనర్థాలను తొలగించటానికి ఐ.ఏ.రిచర్డ్స్ మొ॥ ఆంగ్ల విశ్వవిద్యాలయాచార్యులు ప్రస్తరించిన విమర్శపద్ధతి Practical criticism, ఇందులో కావ్యానుశీలనం వస్త్వాశ్రయరీతి (Objective method) ని అనుసరించి వర్తిస్తుంది. అందువలన విశ్వజనీనతను భజిస్తుంది. Cox and Dysen మాటలలో "It (Paactical criticism) is an opening up of the poem for what it can really be for us : a unique and fascinating experience, carefully wrought by its maker, and fully available only to those with the patience, as well as the sensibility, to recreate. It makes our pleasure more articulate and therefore more

meaningful. Emotion is enriched and extended by the exercise of thought". విశ్వనాథ సాహిత్యవిమర్శ యీలక్ష్యంతో సాగింది. కట్టమంచివారి ఆత్మాశ్రయధోరణికి అడ్డుకట్టవేసింది. వస్త్వాశ్రయ పద్ధతి ననుసరించి విశ్వజనీనతకోసం శిల్పమార్గాన్ని ప్రస్తరించింది. ఆంగ్లంలోని *Practical criticism* ధోరణిని ఆంధ్రంలో శిల్పానుశీలనంగా విశ్వనాథ మలచి తనయుగాన్ని తాను సృష్టించుకొన్నాడు. ఆధునికసాహిత్యవిమర్శలో విశ్వనాథది సాహిత్యశిల్పప్రస్థానం.

## విశ్వనాథ—విశ్వజననీనత

విశ్వనాథ ప్రస్తరించిన సాహిత్యశిల్పానుశీలనప్రస్థానాని కున్న ప్రత్యేకత ఏమిటి? - ముందు శిల్ప మంటే ఏమిటని తెలుసుకోవాలి. డా॥పాటిబండ మాధవ శర్మగారి మాటల్లో''శీలధాతునిష్పన్నము లైన శీలము, శైలి, శిల్పము తరతమ భావమున నేకార్థకములే. అనంతజన్మాభ్యాస సంస్కారము శీలము. శీలమే స్వార్థమున శైలి యగును. ఇహజన్మాభ్యాససంస్కారము శిల్పము. మహర్షుల యందు శీలమైనది మహాకవులయందు శిల్ప మగుచున్నది. అప్రయత్నఫలసిద్ధి శీలమూలకము. సప్రయత్నఫలసిద్ధి శిల్పమూలకము."లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే; ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోనుధావతి" అని భవభూతి మహాకవి చెప్పినట్లు ఆద్యులైన మహర్షులకు శీలవశమున వాక్కు నంటి యర్థము పరుగెత్తును. లౌకికసాధువులైన మహాకవులకు శిల్పవశమున నర్థము నకు అనుకూలముగ వాక్కు వర్తించును". కాబట్టి కవిచేత సప్రయత్నంగా కావ్యంలో శిల్పీకరింపబడిన కావ్యార్థాలను వివేచించి, కావ్య పరమార్థవ్యంజకాలుగా అవి ఎలా సవందింపబడినాయో నిరూపించే సంయమన సాహిత్య వ్యవసాయం ఈ సాహిత్యశిల్పసమీక్ష. "కావ్యము శిల్పముతో కూడినది. శిల్పశక్తి తగ్గని యే కావ్యమైన బర్హిగ్రాహ్యమే యగును. పాశ్చాత్య మహాకావ్యములు శిల్పభూము లగుటచేతనే యచ్చటి మతసంప్రదాయాది విషయములు మనవి కాకపోయినను వానిని బర్హిగహించుచున్నాము. రచయితల కాశిల్పదృష్టి తగ్గనిదో కావ్యము కావ్య మగును. శిల్ప మక్షరమునొద్దనుండి కావ్యమహార్థాంత మనుస్యూత మైన విషయము. ప్రపంచ మెంత యనంతమైనదో, ఎంత వివిధమైనదో కవితావిద్య యంత యనంతమైనది, యంత వివిధమైన"దని విశ్వనాథ తన శిల్పదృష్టిని పేర్కొన్నాడు.

ప్రాచ్యప్రాశ్చాత్య సాహిత్యసిద్ధాంతాల కూడలి భూమి, సమన్వయక్షేత్రం విశ్వనాథవారి శిల్పప్రస్థానం. ప్రాచ్యలాక్షణికుల రసాలంకార ధ్వనిసంప్రదాయా లను, పాశ్చాత్యుల కథానిర్మాణపాత్రపోషణాది పద్ధతులను కావ్యమహార్థ

వ్యంజకాలుగా రచనాంగములను సమన్వయించేపట్ల విశ్వనాథ నిపుణంగా శిల్ప ప్రస్థానంలో సార్థకంగా సంవదించి చెపాడు. అధునాతనాంధ్రసాహిత్యవిమర్శ క్షేత్రంలో కావ్యశిల్పసమీక్ష ప్రాణభూతంగా ప్రవర్తిల్లుతున్నది. దానికి కారణం విశ్వనాథ శిల్పప్రస్థానం సాహిత్యదర్శనంలో సాధించిన విశ్వజనీనతయే.

విశ్వనాథ శిల్పదృష్టి ఆయన చేపట్టిన సర్వసాహిత్యప్రక్రియల్లోనూ సార భూతంగా ప్రత్యక్షమౌతుంది. రసభావవిమర్శనమే ఆయన కావ్యకళాశిల్పం. విశ్వనాథ కావ్యకళకూ, విమర్శనకళకూ ఒక ప్రధానభేదాన్ని గమనింపవచ్చును. కవితల్లో, నవలల్లో కానవచ్చేవారి ఆత్మాశ్రయ ధోరణి విమర్శలో కానరాదు. వారి కావ్యశిల్పసమీక్ష కవిహృదయానుశీలనం చేస్తుంది; కావ్యపదమార్థాన్ని వివేచిస్తుంది. విమర్శలో విశ్వనాథ సహృదయవ్యాఖ్యాత. ప్రమాణబద్ధమైన అనుశీలనం పఠితను రజింపజేస్తుంది. విశ్వనాథ కావ్యానుశీలనం విశ్వజనీనతను సంవదించుకోవటంచేత పఠితను విమర్శకునిలాగానే ఆలోచింపచేస్తూ కావ్యానందాన్ని ఆలోచనామృతంగా అనుభవింపజేస్తుంది. కావ్యాత్మలో లయించిన విశ్వనాథ సాత్త్వికప్రవృత్తి సహృదయచిత్తవృత్తిలా జాలువారుతుంది కట్టమంచివారికంటె విశ్వనాథ సాధించిన విశ్వజనీనత యిది.

కట్టమంచివారినుండి విశ్వనాథ గ్రహించిన ఉత్తమవిమర్శలక్షణం తెలుగులో కావ్యలక్షణాన్ని, కావ్యానుశీలనవిధానాన్ని ఆలోచింపచేసే ప్రవృత్తి. వీరిద్దరూ సాహితీసంస్కారాన్ని పండించుకున్న వ్యుత్పన్నులు. విమర్శ చేసేటప్పుడు పూర్వలాక్షణికుల వచనాలను, ప్రమాణాలనూ ఏకరువుపెట్టి కావ్యార్థాలను సమన్వయించే లాక్షణిక విమర్శమార్గం వీ రనుసరింపలేదు. విశ్లేషణ ప్రవృత్తి ఉన్నా విమర్శకు సృజనాత్మకశక్తిని వీరిద్దరూ సంపాదించిపెట్టారు. ఇది ఏ కొద్దిమందికో అలవడ దొడ్డగుణం.

## ఐక్యత - ఏకవాక్యత

కావ్యానుశీలానికి సమన్వయం, విలువకట్టటం అనేవి రెండు పాదాలు. వాటితోనే అది ముందుకు సాగుతుంది. కట్టమంచి అభిరుచివిమర్శ పద్ధతి విమర్శ గతియొక్క స్వేచ్ఛను అవరోధిస్తుండేది. మచ్చుకు ఒక ఉదాహరణ చాలు. వస్తువులో ఐక్యత ఉండా లని కట్టమంచివారి దృక్పథం. అది కళాపూర్ణోదయానికి వర్తించినంతగా మనుచరిత్రకు సరిపోదు. అందువల్ల మనుచరిత్ర కథాశిల్పం లేనికావ్యం అనిపించవచ్చు. అలాగే అముక్తమాల్యద అతుకులబొంత కావచ్చు. విశ్వనాథ ఈదృక్పథాన్ని కాదంటాడు. ప్రతిప్రక్రియనూ, ప్రతిరచననూ కవి యేర్పచుకొన్న సాపేక్షప్రమాణాలతో సమీక్షించటం శిల్పమంటాడు. "ఏభాషలో నైనను ప్రధానముగా సంస్కృతాంధ్రభాషలయందు సర్వకావ్యముల నాకే

దృష్టితో చూడరాదు. కవిత్రయమువారి రచనను చూచినట్లు ప్రబంధకవులరచన చూడరాదు." అని విశ్వనాథ హెచ్చరిస్తాడు. "ఒకానొక కవి రచనను ఒకానొక విధముగా చదువవలె" ననెడి దృక్పథాన్ని ఆయన ప్రసారం చేశాడు. ప్రబంధ కథకు ఐక్యతకంటె ఏకవాక్యతముఖ్య మని ఆయనప్రతిపాదించాడు. ఇలా పూర్వ విమర్శకుల్లో మంచినిగ్రహిస్తూనే లోపాలను సవరించి ఆంధ్రసాహిత్యంలో వెలసిన వివిధప్రక్రియలను అనుశీలించేటప్పుడు అనుసరింపవలసిన విమర్శకసూత్రాలను వివేచిస్తూ విమర్శసాగించాడు విశ్వనాథ. ఈదృక్పథం అత్యంతాధునిక విమర్శ పద్ధతులతో విశ్వవ్యాప్తంగా సమాదరణీయం కావటం వారి విశ్వజనీనవిమర్శకు తార్కాణంగా నిలుస్తోంది.

## విమర్శన మొకదర్శనం

సాహిత్యవిమర్శకు సౌందర్యం, తత్త్వం అనేవి రెండుకళ్ళు. ఈ నేత్ర ద్వయంతో అనుశీలనం చేస్తున్నప్పుడు సమీక్షకు నిలిచేవి సౌందర్యతత్త్వం, తత్త్వ సౌందర్యం. ఈ రెండూ కావ్యపరమార్థంలో అద్వైతంగా భాసించి ఏక వాక్యతను భజిస్తాయి. విశ్వనాథ శిల్పప్రస్థానంలో ఈదర్శనం భాసిస్తుంది. "విమర్శనంలో దర్శనం అంతర్భవిస్తుంది. ఇది తాత్త్వికసత్యం కూడా. విమ ర్శనం పెద్దవృత్త మైతే దర్శనం దాని కడుపులోని చిన్నవృత్తం. విమర్శకుడు దాన్ని మరింత పెద్దది చేసి చూపుతాడు. అదియే కవియొక్క విరాటస్స్వరూప దర్శనం. దానికి పాఠకుడు సంసిద్ధుడై ఉండాలి. అంటే 'అధికారం' సంపాదించి ఉండాలి. పిండితార్థ మేమంటే విమర్శనం కూడా దర్శనమే". దర్శనం ఉత్తమ విమర్శలక్షణం; వివేచనం మధ్యమవిమర్శలక్షణం; విశ్లేషణం సామాన్యవిమర్శ లక్షణం, గమ్యం తెలిసి చేసిన ప్రస్థానం విశ్వనాథ విమర్శ విధానం.

## ప్రయోగాలూ - ప్రస్తారాలూ

విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన విమర్శక గ్రంథాలు ప్రధానంగా ఇవి. 1. నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి 2. అల్లసాని వాని అల్లిక జిగిబిగి 3. ఒకడు నాచనసోమన్న 4. కావ్యపరీమళము. 5. సాహిత్యసురభి. 6. విశ్వనాథ సాహిత్యోపన్యాసములు. 7. శాకుంతలము యొక్క అభిజ్ఞానత. 8 కావ్యానందము. 9. కల్పవృక్షరహస్యములు. 10. నారాముడు. 11. What is Ramayana to me. ఇవికాక ఎన్నో వ్యాసాలూ, పీఠికలూ, ఉపన్యా సాలూ ఉన్నాయి. ఒక విమర్శకుడుగా సాహిత్యక్షేత్రంలో తనస్థానాన్ని సంపా దించుకోవటానికి పై రచనలు చాలు.

వీరి విమర్శగ్రంథాలలో శిల్పానుశీలనానికి అన్నీ ఉదాహరణములైనా ప్రతి రచనకు ఒక ప్రత్యేకత కనపడుతుంది. తెలుగులోని మహాకవులు రచించిన గ్రంథాలలో ప్రతిదానికీ ఒక ప్రత్యేకత ఉన్నదన్న స్పృహ విశ్వనాథ విమర్శ వలన ఏర్పడుతుంది. నన్నయ కవితాగుణాలకు పట్టిన వైజయంతిక వారి నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి. ఇతిహాసకథాశిల్పం, కావ్యకథాశిల్పం, ఉపాఖ్యానశిల్పం అనేవి కథార్థాల నాశ్రయించి ఎలా వైవిధ్యంతో భాసిస్తాయో ఈ గ్రంథం చదివితే తేటపడుతుంది. సంవిధానం, పాత్రపోషణం, భావికథార్థ ధ్వని, కథార్థప్రసన్నప్రక్రియ మొదలైన సూక్ష్మశిల్పవిశేషాలే కాక శైలికి, పద ప్రయోగశక్తికి, వాక్యరచనావిచ్ఛిత్తికిఎలావ్యాఖ్యానం చేయాలో స్పష్టమౌతుంది. వీటినిమించి వస్తుధ్వని రసధ్వనిలో పర్యవసించే వైఖరి సరళసుందరంగా ఈ గ్రంథంలో అభివ్యక్తీకరింపబడింది. కథాకథనశిల్పరహస్యాలను విశ్వనాథ వివరిస్తున్నప్పుడు ఆనందవర్థనునినుండి ఆంగ్లవిమర్శకులదాకా కావ్యశిల్పానుశీలనం పాటించే ప్రక్రియలు పరమదేశీయంగా, సరళసుందరంగా సంవదింపబడటం విశేషం. ఆదికవి నన్నయ కవితాగుణాన్ని ఆధునిక వివేచనంతో వ్యక్తీకరించిన శిల్పప్రస్తారం ఈ గ్రంథం.

'అల్లసానివాని అల్లిక జిగిబిగి' అన్నది ప్రసిద్ధికెక్కిన ఒకలక్షణసూక్తి. దాన్ని సార్థకంగా సమన్వయించిన ప్రతిభ విశ్వనాథదే అని చెప్పాలి. ప్రబంధ కథకు ఏకవాక్యత ముఖ్యమని చెప్పే వివేచనం భారతీయ సంప్రదాయ సారం. ఆకథ కిచ్చిన సమన్వయం ప్రతీకాత్మక విమర్శకు (Symcolic criticism) మచ్చుతునక. సాహిత్యసిద్ధాంతాలను కథలో ప్రతీకాత్మకంగా ప్రపంచించే ఆంధ్ర కవితా పితామహుని కావ్యశిల్పాన్ని విశ్వనాథవారు శిఖరప్రాయంగా చిత్రించారు. జీవశాస్త్రసంబంధి సమన్వయం పింగళివారు సాధిస్తే జీవసంస్కార పరిణామ సిద్ధాంతంమీద ఆధారపడిన తాత్త్వికవ్యాఖ్యానంచేసి విశ్వనాథ తనవ్యక్తిత్వాన్ని ప్రదర్శించాడు.

నాచనసోముడు విశ్వనాథవారి అభిమానకవుల్లో ఒకడు. ఆత్మప్రత్యేకత సంవిధానచక్రవర్తిగా ఎలా భాసిస్తుందో వారు నాచనసోము డొక్కడన్న గ్రంథంలో నిరూపించారు. విష్ణుపారమ్యాన్ని వ్యంజింపజేసే కథాకదంబాన్ని ఎన్నుకోవటంలోనూ, వాటి నిర్వహణంలోనూ, జ్యోతిషాది శాస్త్రమహార్థాలను ప్రతీకాత్మకప్రవృత్తితో ప్రతీయమానం చేయటంలోనూ, శైలీవైశిష్ట్యంలోనూ నాచనసోముని కవితామూర్తిని విశ్వనాథవా రిందులో వ్యక్తీకరించారు. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ మొదలైనవారు నాచనసోముని కవితాగీతికి ఉత్తమ తాంబూలాన్ని యిచ్చారు. విశ్వనాథ ఆకావ్యాన్ని పరమవ్యంగ్యమైన పరమార్థప్రతిపాదన

దృష్టితో సమీక్షించి నాచనసోముని ప్రత్యేక స్థానాన్ని ప్రతిపాదించారు. ప్రతీకాత్మకవిమర్శ కీగ్రంథం మరో మణిదర్పణం.

నన్నయనాచనసోములనుగూర్చి మరికొన్ని వ్యాసాలుకూడా వ్రాశారు. అవి ఈగ్రంథతాత్పర్యాలకు ఆమ్రేడితాలు.

కావ్యపరీమళం ప్రాచీనకావ్యసమీక్షలైన వ్యాసాలసంపుటి. మనుచరిత్ర, పాండురంగమాహాత్మ్యం, పారిజాతాపహరణం, ఆముక్తమాల్యద, వసుచరిత్ర, కాశీఖండం, భీమఖండం, హరవిలాసం, భీమేశ్వరపురాణం, శ్రీకాళహస్తి మాహాత్యం, ఉత్తరహరివంశం, విజయవిలాసం- అనే కృతులమీద విమర్శన మిందులో ఉంది. ఆయాగ్రంథాలలోని ప్రసిద్ధపద్యాల నెన్నుకొని వానిశిల్ప సౌందర్యము నభివర్ణించటం ఈగ్రంథనిర్మాణస్వభావము. వ్యాఖ్యలకు శిల్పాను శీలన మనే అభినవావతారాన్ని విశ్వనాథవా రిందులో ప్రపంచించినారు. కావ్య విమర్శతోపాటు కావ్యాంగవిమర్శ ఎలా ఉండాలో నిర్దేశించే ప్రయోగమిది. ఆంగ్లంలోని *Practical criticism*లో కావ్యాంగ విమర్శ ప్రధానాంశం. దానికి శిల్పమార్గం చూపించారు తెలుగులో.

కావ్యానుశీలనం చేస్తూ కళామయంగా కావ్యలక్షణాలను రవ్వల్లా కురిపించే ప్రజ్ఞ యీప్రక్రియతో ప్రకాశిస్తుంది. కావ్యశిల్పాస్వాదన కనువైన మధుబిందువు లీపద్యశిల్పవ్యాఖ్యలు. భారతభాగవతాలలోని ప్రసిద్ధపద్యాల కిలాగే ప్రవచించిన పద్యవ్యాఖ్యలతో 'సాహిత్యసురభి' కూర్చబడింది. వృత్తిరీత్యా ఉపాధ్యాయుడై ప్రవృత్తిరీత్యా మహాకవియై విశ్వనాథ ప్రాచీనకవుల కావ్యాలలోని రహస్యాలను విప్పిచెప్పే రసవ్యాఖ్యప్రవృత్తి ఈసంకలన సంపుటాల్లో సమృద్ధిగా ఉంది.

విశ్వనాథ రసయోగి. రససిద్ధాంతానికి రమణీయ నాటకాకృతి కల్పించిన కాళిదాసు శిల్పమర్మాలను వెలికితీసే విమర్శనం "శాకుంతలముయొక్క అభిజ్ఞానత" నామసార్థక్యంనుండి, అంతఃకరణ చైతన్యంవరకూ సాగిన రసతత్త్వాను శీలనం ఇందులో గమనింపదగింది. శాపవిస్మృతి వలన దుష్యంతుడు పొందే వేదనలో, జన్మాంతర వాసనాబలంతో జీవుడు పొందే వేదనయొక్క వైచిత్రిని అభినవగుప్తుని సిద్ధాంతా న్ననుసరించి ప్రస్తరించి, రసనిష్పత్తి సూత్రానికి శిల్ప వ్యాఖ్యానం చేసి చూపించారు. ఇందులో నాటకరచనాశిల్పంలోని ధ్వనిని నిరూపిస్తున్నప్పుడు సౌందర్యతత్వం, రస భావతత్త్వాన్ని వ్యాఖ్యానిస్తున్నప్పుడు

తత్త్వసౌందర్యం వీరి విమర్శలో ప్రసరిస్తుంది. తత్త్వగంభీరమైన ఈవిమర్శ శిల్పమార్గానికి శిఖరప్రాయం.

విశ్వనాథవారి "కావ్యానందం" వర్ణనాత్మక లక్షణగ్రంథం. ఆనంద త్రయం ఆభాస అనీ, అబద్ధ మనీ భావించే భౌతికవాదుల సాహిత్యదృక్పథాలు ప్రబలుతున్న ఆధునిక జగత్తుకు అలంకారశాస్త్ర మర్యాదలను సౌందర్యశాస్త్ర సమాలోచనంగా సమర్పించిన ప్రస్తార మీగ్రంథం. ఇది వారిప్రణాళికలలో మొదటిసంపుటం. మరోమూడుసంపుటాలు పూర్తి కాకుండానే విధి వారిని మనకు దూరంచేశాడు. సూత్రలక్షణ గ్రంథాలకంటె విలక్షణంగా వివిధాంశాలపై ఆలో చనధారగా సాగిన ఈప్రక్రియ వర్ణనాత్మక లక్షణగ్రంథం అనటం న్యాయం.

విశ్వనాథ రసానుశీలన ప్రవృత్తికి ప్రత్యక్షసాక్ష్యంగా నిలిచేది వారి సాహిత్యోపన్యాసాలు. ఇందులో మొదటివ్యాసం 'కాళిదాస భవభూతులు'. ఇది తులనాత్మక విమర్శ. విమర్శకులెందరో భవభూతి ఉత్తరరామ చరిత్ర వ్రాసి కాళిదాసును మించాడని భావించటం పరిపాటి. విశ్వనాథవారు మాలతీమాధవ ప్రకరణంతోనే ఆపని సాధించాడని నిరూపించటం ఇందులోని విశేషం. ఉభయ కవుల రచనాశిల్పరహస్యాలకు ఈవ్యాసం భద్రపేటిక. ఇటువంటి తులనాత్మక పరిశీలనమే మహాభారత రామాయణ కథాస్వభావాల నాశ్రయించి మరో వ్యాసంలో చేశారు. విశ్వనాథవారు శాంతకరుణరసాలను గురించి వ్రాసిన వ్యాసం భావకుడైనవాడు రసతత్త్వవిచారం చేస్తే ఎలా ఉంటుందో దానికి ప్రమాణప్రాయంగా కనపడుతుంది. శాకుంతలము శాంతరసప్రధాన మనీ, ఉత్తరరామచరితం కరుణప్రధాన మనీ ఇందులో తేల్చారు. రసచర్చ ఎంతో గంభీరమైంది. విశ్వనాథ దాని లో అంచులు చూచే ప్రజ్ఞ కలవాడు. కానీ, కొన్నిచోట్ల అనుభూతి ఒకత్రోవా, ఆలోచన మరోత్రోవా సాగినప్పుడు రస నిర్ణయం మనసుకు నచ్చకపోయినా మేధకు మేత వేయవచ్చు నన్న సత్యాన్ని విశ్వనాథవా రీవ్యాసాల్లో ప్రదర్శించా రని అనిపిస్తుంది. వా రెత్తుకొనే విషయా లన్నీ మహావిషయాలే. కొంతదూరం ఆలోచనలో మనలిని తీసికొనివెళ్ళి ఇది మహావిషయ' మని వదలివేస్తా రొక్కొక్కసారి. అయినా, ఆమార్గాలు స్పృశించే మనీషులే తక్కువ. కొంతదూరమైనా ప్రస్థానం చేసిన, చేయించిన గౌరవం విశ్వనాథకు దక్కక మానదు.

విశ్వనాథ వ్రాసిన వ్యాసాలన్నిటిని గురించీ ఈ చిన్నివ్యాసంలో సమీక్షించటం సాధ్యంకాదు. కాని, ఒక్కమాట మాత్రం నిస్సంశయంగా చెప్పవచ్చు. విశ్వనాథ విమర్శలో ఏదో ఒకక్రొత్తవెలుగు లేని రచనమాత్రం ఉండదు. ప్రతివ్యాసం ఒకదర్శనం, ఒకప్రస్థానం.

రామాయణ కల్పవృక్షంలోని శిల్పవిశేషాలూ, వ్యంగ్యములైన మహార్థాలూ, రామతత్త్వాన్ని ఆయన దర్శించినతీరు తెన్నులూ, తీర్చిదిద్దిన కావ్యార్థ కల్పనలూ, రామాయణ తత్త్వదర్శన విశేషాలూ వివరించేవి కల్పవృక్షరహస్యములు, నా రాముడు, What is Ramayana to me. రామకథ నాశ్రయించుకొని భారతీయ కావ్యతత్త్వ వివేచనం ఎన్ని ఎత్తులకెక్కిందో. ఎన్నిప్రస్థానాలు చేసిందో వాటి కన్నింటికి సంగమతీర్థంలా సారవివేకంగా నిర్మించిన మహాకావ్యం రామాయణకల్పవృక్షం. ఒక సంస్కృతి సజీవంగా నిలిచిన శిల్పాభిరామం. విశ్వనాథ సాహితీవ్యక్తిత్వానికి పై మూడు రచనలు ముకుర ప్రాయాలు, కొండను మనం అద్దాల్లో చూడవచ్చు.

## విమర్శక చక్రవర్తి

విశ్వనాథ శిల్పానుశీలనం ప్రతిభాశిఖి వంటిది. దానికి శిఖలెన్నో లెక్కపెట్టటం కష్టం. కాని, తెలుగు సాహిత్య విమర్శ ప్రస్థానంలో తన యుగాన్ని కట్టమంచి తరువాత నిర్మించుకొన్న మహామనీషి ఆయన. ప్రతికవికి ప్రత్యేక ప్రతిపత్తి ఉన్న దని ప్రతిపాదించిన ప్రతిభాపక్షపాతి ఆయన. ఒక్కొక్క ప్రయోగానికి ఒక్కొక్క అనుశీలన మార్గం ఉన్న దని వివేచించిన వివేకమూర్తి ఆయన. తా నెంత ధిషణాహంకారి అయినా కావ్యానుశీలంలో తాను శిల్పాదాకుడుగా మారి ప్రాచ్యపాశ్చాత్యసాహిత్య ప్రమాణాలకు సమన్వయాత్మకమైన సార్థక ప్రయోగాన్ని అనుశీలనంలో ఉన్మీలింపజేసిన ప్రౌఢ ప్రయోగకుశలు డాయన. శిల్పానుశీలన ప్రక్రియకు ప్రతీకాత్మక విమర్శను, తులనాత్మక వృత్తినీ, మానసిక స్వభావ విమర్శను, రసవ్యాఖ్యా ప్రవృత్తిని, వర్ణనాత్మక లక్షణగ్రంథ నిర్మాణ కౌశలాన్ని అలవరచి, చేపట్టిన ప్రక్రియకు పరిణతరూపాన్ని కల్పించి తన వ్యక్తిత్వాన్ని విమర్శక లోకంలో హిమవన్నగ సదృశంగా స్థాపించుకొన్న 'విమర్శక చక్రవర్తి' విశ్వనాథ.

విశ్వనాథ ప్రాచీనసాహిత్యాన్నే ప్రధానంగా అనుశీలించాడు. అట్లని సమకాలీన సాహిత్యాన్ని వదలిపెట్టలేదు. భావకవిత్వయుగంలో వెలసిన ఆధునిక కృతులకు పీఠికలు వ్రాశాడు. అభ్యుదయకవిత్వ స్వభావాలను సమీక్షించి తన దృక్పథాన్ని స్పష్టంచేశాడు. ఆయనమెప్పు పొందటం ఒక గొప్ప అని భావించారు సమకాలీనులు. ఆయన తిట్టినా ఒక గౌరవమనుకొన్నవారూ ఉన్నారు. ఆధునిక సాహిత్యవిమర్శ ప్రక్రియల్లోని మార్క్సిస్ట్ విమర్శ, సాంఘిక విమర్శ, మొదలైనవి ఆయన చేయలేదు. అది ఆయనకు లోపంకాదు. శిల్పప్రస్థానం ఆయనది. అందులో శిఖర మాయన. శిఖరంమరో శిఖరానికి శిరస్సు వంచకుండా ఉండటమే శిల్పాలలో కెల్లా శిల్పం!

# Andhra Pradesh
# State Road Transport Corporation

## ANNOUNCES

Opening of three
NEW RESERVATION-CUM-INFORMATION CENTRES
for long distance services from Hyderabad,

at
* CHARMINAR CONTROL POINT
* SECRETARIAT BUS SHELTER
* SECUNDERABAD STATION

with effect from
**1st DECEMBER, 1980.**

Avail this facility for the following
Express (E) and Super Deluxe (S/D) services

| | | |
|---|---|---|
| 1) | Bangalore | 19.00 hrs (E), 20.00 hrs (S/D) |
| 2) | Madras | 15.30 hrs (S/D) |
| 3) | Bombay | 16.00 hrs (E) |
| 4) | Amalapuram | 20.30 hrs (S/D) |
| 5) | Vijayawada | 22.00 hrs (E), 23.15 hrs (S/D)<br>23.30 hrs (E) |
| 6) | Tenali | 22.00 hrs (S/D) |
| 7) | Machilipatnam | 22.00 hrs (S/D) |

* Seats can be reserved TEN DAYS in advance
* Working hours : 13.00 hrs to 18.00 hrs on all days.

Released by
Public Relations Dept., A.P.S.R.T.C.
Hyderabad

Cover Printed at Gita Art Printers, Kachiguda, Hyd-27.